# అధ్యాత్మ దర్శన

# అభ్యాస యోగము

## ద్వితీయ భాగము




రచనా శుశ్రూష

కీ.శే. బ్రహ్మశ్రీ పాణ్యం లక్ష్మీ నరసింహశాస్త్రి

పరమ గురువులు



బ్రహ్మశ్రీ వేదమూర్తి గొల్లాపిన్ని మల్లికార్జున శాస్త్రిగారు

# అధ్యాత్మ దర్శన

# అభ్యాసయోగము

## ద్వితీయ భాగము

కీ.శే. బ్రహ్మశ్రీ పాణ్యం. లక్ష్మీనరసింహశాస్త్రి

ప్రచురణ

శ్రీ శివ సచ్చిదానంద ఆశ్రమము

(ఆత్మ విజ్ఞాన కళాశాల)

16-9-32/ఎ/1, రాణీబాగ్, మలక్‌పేట.

హైదరాబాదు.

# అధ్యాత్మ దర్శన 'అభ్యాసయోగము

(శ్రీ శ్రీ శ్రీ శివ సచ్చిదానంద స్వామి వారిచే గీత, ఉపనిషత్తులు, యోగ సూత్రాలు వంటి శాస్త్ర గ్రంథాల నుండి ఉద్ధరించ బడిన యోగ విద్యా ప్రణాళిక)

---


ప్రథమ ముద్రణ : నవంబర్ 2000

ప్రతులు : 1000

మూల్యం : 80-00



ప్రతులకు : **సాధు గురుమూర్తి**
శివసచ్చిదానంద ఆశ్రమము
16-9-32/ఎ/1, రాణీబాగ్
మలక్‌పేట, హైదరాబాద్.

**డాక్టర్. పాణ్యం. శ్రీనివాస**
ఎం.ఎ., పి.హెచ్.డి.
11-27ఎ, వెల్దుర్తి - 518 216.
కర్నూలు జిల్లా. ఆం. ప్ర.


---


ముద్రణ : శ్రీనివాస ఆఫ్‌సెట్,
డోన్-518 222. (కర్నూలు జిల్లా)
ఫోన్ : 21117.

## జిజ్ఞాసురపి యోగస్య, శబ్దబ్రహ్మాతి వర్తతే

*భగవద్గీత-ఆత్మసంయమయోగము*

యోగాన్ని గురించి తెలుసుకోవలెననుకుంటేనే చాలు. అట్టివాడు శబ్ద బ్రహ్మన్ని అధిగమిస్తున్నాడు. అంటే వేదోక్త కర్మానుష్ఠాన ఫలమున కంటె విశేష ఫలమును పొంది, ఉత్తమ లోకముల పొందుతున్నాడు. ఇంక యోగాభ్యాసము చేయుయోగి యొక్క ఫలమేమని చెప్పగలము? అది సర్వోత్కృష్టము!

మనము ఆ అభ్యాసయోగాన్ని గురించి తెలుసుకొని శ్రీ కృష్ణ భగవానుని వాక్యములోని మహత్తర భాగ్యము నందుటకుద్యుక్తులమై ఏకాగ్రతతో, ఆధ్యాత్మ దర్శన- అభ్యాసయోగము ను చదివి, అనుష్ఠించి మన జీవితాలను, అభ్యుదయ పూర్వక నిశ్శ్రేయస్సు పొందేందుకు, సిద్ధం చేసు కొందాం. రండి!




This book is Pubished with the Financial assistance of **TIRUMALA TIRUPATHI DEVA STHANAMS** under thier Scheme of Aid to Publish F.eligious Books.



## శ్రీ గురు పాదుకాపంచక స్తోత్రమ్

1. నమశ్శివాభ్యాం అతి సుందరాభ్యాం అనంత కళ్యాణ గుణాస్పదాభ్యాం
అజాది బృందారక వందితాభ్యాం నమోనమ(శ్రీ గురుపాదుకాభ్యాం
2. సనాతనాభ్యాం సుమనోహరాభ్యాం నమజ్జనే హేమరభూరుహాభ్యాం
త్రయీసతీ సూనృత వాఙ్మతాభ్యాం నమోనమ(శ్రీ గురుపాదుకాభ్యాం
3. గుణాధికాభ్యాం గురుదర్శకాభ్యాం అఘౌఘతామిస్ర రవిప్రభాభ్యాం
ప్రమోద లీలా సుమశోభితాభ్యాం నమోనమ(శ్రీ గురుపాదుకాభ్యాం
4. సితాభ్ర కాశ్మీరజ పుష్పసార సులేపితాభ్యాం సుమనోర్చితాభ్యాం
మునీంద్ర హృత్సారసభానుమద్భ్యాం నమోనమ(శ్రీ గురుపాదుకాభ్యాం
5. అనాద్య విద్యా హరణేక్షణాభ్యాం అహంమమోన్మత్త గజాంకుశాభ్యాం
గళత్సుధా సౌరభ సంతతాభ్యాం నమోనమ(శ్రీ గురుపాదుకాభ్యాం

పాదుకా పంచక స్తోత్రం శ్రీనివాస ముఖోద్గతం
పఠతా మిష్టఫలదం భూయాదీశ ముదేశివమ్

- శ్రీ గురువులు

ఈ పుస్తక ప్రచురణ కోసం పాక్షికంగా ఆర్థిక సహాయం అందించిన చి. **ఫణిగార్గేయ** (సాఫ్ట్‌వేర్. ఇంజనీర్. సాన్‌డియాగో. అమెరికా.) గారికి,(వారి తండ్రి గారైన **కీ. శే. శ్రీ అవధానం రామ మోహన్** గారి స్మృత్యర్థం ) **యస్.పి.వై రెడ్డి** (నందిపైపులు) గారికి శ్రీ శ్రీ శ్రీ శివసచ్చిదానంద స్వామి వారి ఆధ్యాత్మిక దివ్య మహదాశీస్సులు నిరంతరం శ్రేయస్సు నివ్వాలని ఆకాంక్షిస్తు....

**ప్రకాశకులు**



గ్రంథ రచయిత

కీ. శే. బ్రహ్మ శ్రీ పాణ్యాం లక్ష్మీ నరసింహ శాస్త్రి

వారి సహధర్మచారిణి కీ.శే. శ్రీమతి లక్ష్మీనరసమ్మ

# విషయ సూచిక

# శ్రీ గురుస్తోత్ర రత్నావళి

- కీ. శే. పాణ్యం. లక్ష్మీనరసింహ శాస్త్రి

శ్లో|| శ్రీగురుచరణస్మరణం హరణం శతకోటి జన్మదురితానాం
ప్లవనం భవసింధు సముద్ధరణం మమాస్తు సచ్చరణం||

శ్లో|| సదేకమాద్యం పరమాత్మతత్వం గురుస్వరూపేణ విభాతిసాక్షాత్
అణోరణీయాన్మహతో మహీయాన్ చకాస్తి వేదాంత వినిశ్చితార్థః||

శ్లో||యద్వేదాంత శిరోవిభూషణ మఖండానందకందం మహో
ధీరైశ్శిష్యగణైస్సమాహిత సుసంపన్నైస్సదాసేవితం
శాంతం శ్రీగురుధామ సత్యమఖిలౌన్నత్యం కృపాసుందరం
నిత్యోదారము పాస్మహే వయనుహో! తచ్ఛ్రీనివాసంమహః||

శ్లో||ఆనందామృతదీధి తేస్తుప్రభవోహ్యాధ్యాత్మ విద్యామహో
ముక్తాకౌస్తుభ రత్నగర్భితతలో విజ్ఞాన కల్పద్రుమః
నిస్సంకల్ప తరంగ ఏషబుధముక్తి శ్రీనివాసోజ్జ్వలో
గాంభీర్యోన్నత శాంతిపూరిత సుధాంభోరాశి రుజ్జృంభతే||

శ్లో||లీలామానుష్యదేహప్రకటిత విభవో హ్యాద్యవాత్సల్యకల్యో
యోగజ్ఞాన ప్రణాళీప్రణిహిత మధురాధ్యాత్మ విద్యాప్రబోధ
జ్యోత్స్నాసంపుల్ల శిష్యప్రకర విమలహృత్కైరవోమోదతేయో
జ్యోతీరూప ప్రకాశస్స జయతు భగవాన్ శ్రీనివాసాఖ్యదేవః||

శా|| శ్రీమత్సాధు కులాబ్ధి శీతకరమ్మై, శ్రుత్యంత కాంతాశిరో
దామంబై, పరసత్యనిష్ఠమయి, యాద్యంబై, శివానంద స
త్ప్రేమంబౌచు, సరస్వతీహృదయ నీరేజాత భాస్వంతమై,
భూమామగ్నము శ్రీనివాసగురు వొప్పున్ తాపరబ్రహ్మమై||

సీ|| అవిరళ విశ్రాంతి నధ్యాత్మబోధ నా చంద్రికల్ గురియుశశాంక కీర్తి,
అనయమధీతి బోధాచరణ ప్రచారాంచిత భవ్యపథానువర్తి,
సీ|| అవిరళ విశ్రాంతి నధ్యాత్మబోధ నా చంద్రికల్ గురియుశశాంక కీర్తి,
అనయమధీతి బోదాచరణ ప్రచారాంచిత భవ్యపథానువర్తి,
బ్రహ్మ వర్చస్సుందర మహోకళాపరివేష్టిత మధుర గంభీరమూర్తి,
మల్లికార్జున గురుమందార మకరంద మాధుర్యమగ్న రమ్యప్రవర్తి,
గీ|| అమ్మహాత్ముడు శ్రీనివాసాఖ్య నొప్పు బ్రహ్మరంధ్రాంబురుహ మధ్యభాసమాన
కర్ణికా పీఠికా చిత్సుఖాభిరామ మహితయోగీంద్ర సంసేవ్యమానుడగుచు,
సీ|| ఏమహనీయు సమిద్ధ ప్రబోధంబు సులభమై సుగమమై శుభములొసగు,
ఏగురుదేవు కృపా గుణవాహిని శిష్యజనాళీ సంజీవనంబు,
ఏశాంతు డెలయించు నాశాంత నిజయశో వల్లరీ విద్యా ప్రఫుల్లసుమము,
లేసాధుకుల దీపమా సాధకుల యోగ పథములజూపు సత్ప్రభల వెలిగి,
గీ|| శ్రీగురు శ్రీనివాసుండు చెలగుసతమునాత్మ విజ్ఞాన దివ్యబోధామృతార్థ
వివిధ దేశాగత విబుధ ప్రవరనిత్య వందితాభ్యర్చిత పదారవిందుడగుచు.
శా|| ఈతాపత్రయ వహ్నితప్తులకు హాయింగూర్పగా జ్యోత్స్నయై,
యాతాయాత దురంతరోగముల మాయంజేయు సిద్ధౌషధం
బై, తత్త్వప్రతిపాదకాక్షరసమర్థాధ్యాత్మ విద్యాపరం
జ్యోతీరూపము శ్రీనివాసగురు డిచ్చున్నిత్యకళ్యాణముల్.
ఉ|| కర్మశరీరముల్విడి యఖండ్యమదాహ్య మశోష్యమైన జ్యో
తిర్మయ దేహముల్బడ యధీరతమై, నజరామరంబునౌ
మర్మమనుగ్రహించి, పరమార్థము నిచ్చెడు శిష్యవ్రజ స
ద్ధర్మము; శ్రీనివాస గురువర్యుల కంజలినే ఘటించెదక్ .
ఉ|| ఎంత తపస్సుచేసినను నేనిలభింపని విద్యలెల్ల నొ
క్కింత కటాక్ష పాతముననే గురుదేవుడనుగ్రహించు; ధీ
మంతులు శిష్యులందరికి మానసితమౌ యనుభూతినిచ్చి యా
ద్యంతములేని యాపరమ ధామమునుజేరగ త్రోవజూపుచుక్.

ఉ|| ఎందఱో యోగివర్యులు మహిన్ భవదీయ కృపామృతంబు తా
మందిరిగాని వేదములకందని శ్రీగురుపూర్ణ తత్త్వమున్
అందిరొ లేరొ నందియుమునోగద! సత్యమున్నై శివంబున్నై
సుందరమ్మై నఖండమును మించిత మాపరతత్త్వ మెంచెదన్..

ఉ|| ఎన్ని భవంబులందు గడియించిన యోసుకృతంబు లెన్నియో
యున్నియుమూర్తియై మనకహో! లభియించె గురూత్తముండు వి
ద్వన్నుత యోగసాంఖ్యము విధాన సుధాపరిణామమూర్తి; మా
యన్న! తరించు జన్మ మనసా! గురుపాదము లాశ్రయింపుమా..

ఉ|| విద్యలను గ్రహింపుము న విద్యను యాపడగింపుమన్నట్టి నీ
యవిద్యను దివ్యవాహిని మహోన్నత సత్యహిమాద్రి నిస్సర
త్పుణ్యవివేకమున్ సదిమి యోమహిమోజ్జ్వల శిష్యతీర్థ నుం
వేద్యమునై, జగత్త్రయ పవిత్రమునై విలసిల్లు సద్గురూ||

ఉ|| మానితధర్మ దీక్షను సమానముగాగొని, యాంతరంగిక
జ్ఞానములేక కుందియు మను జాళికి తోవచూపనంగి, వి
జ్ఞానమహాత్మ్య దృశ్యమయమార్గమతోకను లజ్ఞానాంతి నుం
ధానముజేయు నీదు నవతారవిభూతికి నంజలించెదన్..

ఉ|| అంతముతోని తత్త్వ విషయాతమస్త్రవత భ్రమగ్నవేదనా
క్రాంత జగజ్జనావళికి ఖండసుధామయ బోధనంబులన్
శాంతినిమార్పు సర్వభువనస్థమనీయ కృపాప్రపూర్ణ! యు
క్రాంతము నీకటాక్ష పరిరక్షిత మార్గమునందు నిల్చెదన్ ||||

ఉ|| పాలనవో మనుష్యశిష్య జనవర్గము దివ్యసమాహిత స్థితిన్
బాలనపడంగ జేయుటకు, పట్టుదలన్ గలిగింపవే తయా
ళాలనము స్వామి! నీకు; మధురంబుగ తీరివిదిర్చి మాయజా
జాలముతెల్లు బాపెదవసద్య్యకృపామృతపూర ఘోరణిన్ ||||

శా|| నీవాత్సల్య సుధామనోజ్ఞలహరిన్నిండారు క్షేత్రమ్ములం
దావాసింపుచు పూర్వపుణ్యముల బీజాంకూరముల్వ్రాల్చి, వి
ద్యావల్లీ నుసమాహితోజ్జ్వల ఫలంబానంద మాధుర్య స
ద్భావాతీతరసంబు శిష్యతతికాస్వాద్యంబ విచ్చిన్నమై||

ఉ|| లక్షణ మాత్రతృప్తులయి లక్ష్యము జోలికె పోనియట్టి దు
ర్భిక్షము సంక్రమించినదివిశ్వమునన్, గురుదేవ! నీవనన్
శిక్షణనిచ్చి వత్సలత శిష్యజనావళి దీర్చుచుంట ప్ర
త్యక్షము లక్ష్యలక్షణ సమన్వయసంపద లుల్లసిల్లగన్||

శా|| లేవా యాశ్రమముల్ సమాజములునన్! లేరే గురుల్! కొల్లలం
తావేదాంతము చిల్కపల్కుల యుపన్యాసంబులందంచు వా
రేవెల్గొందిరి గాని; శిష్యతతికీరీతిన్మహాధ్యాత్మ వి
ద్యావైశిష్ట్య మహానుభూతి కలనాభ్యాసంబు లొప్పారునే!||

ఉ|| సాధన జేయువారలకు సారపు యోగముగూర్చి; యుక్తిసం
శోధన జేయువారలకు పూర్ణపదార్థముగూర్చి; భక్తినా
రాధన జేయువారలకు లక్ష్యముగూర్చుచు నీదు దివ్యస
ద్బోధన పట్టుగొమ్మయగుపో! భువిముక్తి నిగూర్చునద్దియే||

మ|| అధికారంబుల తారతమ్యములపైనాధారమున్ జెంది యుం
డుధరన్ విద్యలు లౌకికంబులవియెట్లో; యట్లెనిశ్శ్రేణికా
విధినాధ్యాత్మిక విద్యలన్న సులువున్ విప్పించు సద్బోధనా
సుధలన్ కొల్లగ పంచిపెట్టు కృపకున్ జోహారు! నీ శైలికిన్||

ఉ|| వాసిగ పూర్వజన్మ శుభ వాసనలన్వికసింపజేయు; న
భ్యాసులు వారివారి స్థితిపైననుభూతులను గ్రహించు; వి
న్యాసముజేయు వేదలలనామ్రుదు శీర్షములందు; నీయుప
న్యాసము శ్రీనివాసగురునాథ! యనన్యమపూర్వమైచనన్||

ఉ|| మంజులమ్మై, సమస్త సుఖ మంగళ భవ్యపురాణ సత్కథా
రంజనమ్మై; కువాదకటు లంపట లౌకిక దుష్టమార్గప్రో
ద్భంజనమ్మై, యశేషభవతారక తారక కోకిలోజ్వల
త్పంజరమ్మైన నీ మహితవాఙ్మధురామృతమే శరణ్యమౌ.

ఉ|| అక్షరరమ్యమ్మై, శుభపదార్థమునై, మహనీయభావ సా
పేక్షమునై; శృతిస్ఫుట నమీక్షమునై; వరశిష్యలోక
సంశిక్షణమ్మై; పురాణ మునివిచిత్ర కథాంతర దివ్యదృశ్య ప్ర
త్యక్షము నక్షమర్దనవిదక్షము నీ పదశైలి రక్షయౌ||

శా|| గీతాచార్యు మహోపదేశములు; యుక్తిన్ శంకరాచార్య వి
ద్యాతత్త్వంబులు, బ్రహ్మసూత్రముల భాష్యార్థంబులున్, వేదదే
వీ తాత్పర్యము; శ్రీనివాస గురుగంభీర ప్రబోధోజ్వల
స్రోతస్సుందర దివ్యపద్మములునై శోభిల్లెడి న్నిత్యమున్||

సా|| సందేహమ్ములు వాయుచోటు; మదులన్ సద్వాసనాదివ్యముల్
మందారమ్ములు విచ్చుచోటు; తొలఁగన్ మాలిన్య విక్షేపముల్
డెందమ్మెల్ నిలుపొందుచోటు; పరిపాటి న్నిత్యమాధుర్య మా
నందంబయ్యది పొంగుచోటు; బుధగణ్యా! నీపదధ్యానమే||

శా|| సర్వజ్ఞంబును సర్వకారణమునున్ సర్వ ప్రియంభావమున్
సర్వోత్కృష్టము సర్వదేవమయమున్ సర్వేంద్రి యాభాసమున్
సర్వానందము సర్వగమ్య పదమున్ సర్వేద్య సర్వేశమున్
సర్వోపాస్యము నీదు తత్త్వము శరణ్యంబౌచు మమ్మేలుతన్.

శా|| నిండెన్ మోదము శ్రోతృవర్గములకున్ జిజ్ఞాసులోకంబులన్
పండెన్ పున్నెపు పంట! శిష్యతతికిన్ నానాగమ ప్రోక్త స
త్పాండిత్యోన్నతభావ బంధురకలాప ధ్యాత్మ విద్యాసుధా
భాండంబైతివి! శ్రీనివాసగురుదేవా! మా నమో వాకముల్||

సీ|| ఒక చిరునవ్వులో వికసించును పనిషత్సుందరీ మంజులానంద రేఖ;
లోక కటాక్షమ్ములో నూటలు వారును బ్రహ్మర్షి హృదయనీరజ మధువులు;
ఒక చిన్న పల్కులో నుదయించు నోంకారవీణలో హవణించు వింతరవళి;
ఒక మౌనముద్రలో నొప్పారు గంభీరపరతత్త్వ వాక్యార్థ భాష్యపంక్తి;
గీ|| సగుణమో! నిర్గుణమ్మొ! నీ సత్యరూపమందు కొనలేము నీదు మహత్త్వమేము
పాదములు నమ్మినాము కాపాడుమయ్య! శ్రీనివాస! గురూత్తంస! చిద్విలాస!.

ఉ|| ఛాత్రులు నిందరున్న మతిశాలురు; నీమహనీయ భావముల్
స్తోత్రముజేయు భాగ్యమదితుష్టిగ దక్కెను నాకె! నీకృపా
పాత్రమునై కృతార్థమయి పావనమయ్యెను వాఙ్మయమ్ము! నా
గోత్రము వంశమున్నవముగూడ కృతార్థమునయ్యె నియ్యెడన్||

చం|| జయమవు సరస్వతీశునకు సాధుకులాభరణాత్తకీర్తికిన్
జయమగు మల్లికార్జునయశః ప్రకటోజ్జ్వల భవ్యవృత్తికిన్
జయముజయమ్ము సత్త్వపరిణాహ విశిష్టమనోజ్ఞ మూర్తికిన్
జయమగు శ్రీనివాస గురునాథునకున్ జయమంగళంబగున్||

# గురుస్సాక్షాత్పరబ్రహ్మ

# ఉపక్రమణిక

మనిషికేంకావాలి? అనే ప్రశ్న అనాదినుండి చర్చింపబడుతూనే ఉంది. మానజాతి శ్రేయస్సును కోరిన, కోరుతున్న మహానుభావులంతా ఈ ప్రశ్నవేసుకొని తుదకు తేల్చిన సారాంశమేమంటే, అది సుఖం! **మనిషికి కావల్సింది సుఖం.**

అయితే ఈసుఖాన్ని పొందడానికి మనమేం చేయాలనేదానిలో ఒక్కొక్కరు ఒక్కొక్క అభిప్రాయాన్ని కల్గిఉన్నారు. ఒకరికి ఒక్కొసందర్భం లో ఒక్కొక్కటి సుఖహేతువవు తుంది. అదే మరొకరికి మరొకస్థితిలో దుఃఖ హేతువు కావచ్చు. మొత్తానికి ఆహార విహారాలలో మెరుగైన స్థాయి పొందడమే సుఖకారణంగా వివేచించవచ్చు. ఈవిషయంలో ఉచ్ఛస్థితిని పొందడమే **అభ్యుదయం** గా వ్యవహరించబడుతుంది.

కాని ఇది ఇంతటితో ముగుస్తుందా? కేవలం భౌతిక పరిస్థితుల అనుకూల్యం వల్లనే సుఖాన్ని అనుభవిస్తున్నామా? దీన్ని మించిన మరేదైనా సుఖానికి కారణమవు తుందా? అనే దాన్ని గాఢంగా ఆలోచిస్తే ప్రతివ్యక్తీ అంతరాంతరాలల్లో తనకేదో కావాలనే తపన పొందుతుంటాడు. అట్టిస్థితి మరొకటి ఉందని తెలిసీ తెలియక తల్లడిస్తున్నాడు. మానవుడు ఏస్థితిలో అయితే సుఖాన్ని పూర్తిగా పొందగలడో ఆ స్థితి మనశ్శాంతి. సుఖం, శాంతి అనే రెండూ కావాలనీ ప్రతిప్రాణీ వాంఛిస్తుంటుంది. ముఖ్యంగా మానవుడు భౌతికవస్తువులవంటి ద్వారానే సుఖపడాలని ప్రయత్నిస్తుంటాడు. బాహ్య ప్రకృతిగా దీన్ని చెప్పుకోవచ్చు. తనకు మిగిలిన సంఘంతో గల సంబంధబాంధవ్యాలను, పరిస్థితులను అనుకూలంగా మలచుకోవడంద్వారా సుఖం పొందాలనే ప్రయత్నం చేస్తుంటాడు.

అంతేకాకుండా తనఆలోచనలు, భావాలు, మొదలైన మానసికశక్తులను అనుకూలంగా మల్చుకోవడంద్వారా కూడా సుఖాన్ని పొందవచ్చునని యత్నిస్తుంటాడు. మొత్తానికి బాహ్య, అంతర ప్రకృతులతో నిరంతరం జరిపే పోరాటమే జీవితంగా తేల్చవచ్చు. తాను, తన ఎదుటనున్న సర్వం, తనలోనుండే ప్రకృతి, తనబైటనుండే ప్రకృతి వీటి సంబంధంలో సామరస్యం పొందించుకునేందుకే ప్రయత్నం చేస్తుంటాడు. **దీన్నే ప్రకృతి జయం** లేదా **ప్రకృతి వశీకరణ** అని పిలుస్తున్నాం. ప్రకృతి వశీకరణాన్ని భౌతిక విజ్ఞాన శాస్త్రజ్ఞులు తమ పరిశోధనలద్వారా ప్రయోగాలద్వారా కొంతవరకు సాధించి నారు. ఆప్రయోగ ఫలితాలను పరికరాలరూపంలో మానవకోటి అంతా ఉపయోగిస్తూ తాముకూడా ప్రకృతిని వశీకరించుకున్నాం అనుకుంటూ ఉంది. ఇది చాలా హాస్యాస్పదమైన విషయం. ఎందుకంటే **శాస్త్రజ్ఞుల ప్రయోగ ఫలితజన్యమైన వస్తువులవల్ల కొంతవరకు ప్రకృతివల్ల కల్గుతున్న కష్టాన్ని, ప్రతికూల పరిస్థితులను అనుకూలంగా మార్చుకొని సుఖాన్ని పొందడం ప్రకృతిని జయించడం కాదు.** ప్రయత్నపరుడైన ప్రతివ్యక్తీ స్వయంగా తనకు తాను ప్రకృతిని వశీకరించుకోగలడు. దానికుండే ఏకైకమార్గం **ఏకాగ్రతా రూప-అభ్యాస యోగమే.** ఈపద్ధతి ద్వారా ఆంతర ప్రకృతిని స్వాధీనపరచుకున్న వానికి బాహ్యప్రకృతికూడా తనకుతానే (Automatic గా) వశమవుతుంది. ఎందు కంటే శరీరం లోపలి ప్రకృతి, బాహ్యప్రకృతి ఒక్కటే కాబట్టి. దీనికి శాస్త్రీయమైన అంశాన్నే ఉదాహరణగా చూపించవచ్చు.

ఒకమహాసముద్రంలోని నీటి లక్షణాలను, స్వభావాన్ని, దానిలోనుండే పదార్థ విశేషాలను తెలుసుకొనేందుకు రసాయన శాస్త్రవేత్త ప్రయోగశాలలో అతితక్కువ పరిమాణంలోని నీటిని మాత్రమే పరిశోధించి దానికిగల గుణాలనే సముద్రజలానికంతటికీ వర్తింపజేస్తాడు. అది ఖచ్చితంగా సరిపోతుంది గదా! అదేవిధంగా అంతరప్రకృతిని జయించడంద్వారా మన శరీరంలోని అంతర ప్రకృతియైన చైతన్యంలోని వివిధ పరిస్థితులను, ప్రకృతిని, స్పష్టంగా చూచి (దర్శించి) ఆపై ఆయా చైతన్యశక్తులను స్వాధీనం చేసుకోవడమే ఆధ్యాత్మ విద్య.

**అధ్యాత్మమంటే ఏమి?** మన భౌతికశరీరం మొదలుకొని సూక్ష్మ శరీరం, (ఇంద్రియాలు, మనస్సు మొ॥) జీవాత్మ పరమాత్మ వరకూ గల వస్తు స్వభావం అధ్యాత్మం. దీన్నే క్షేత్రంగా కూడా పిలుస్తారు. దీన్నంతా గూర్చి తెలుసుకొనే విధానమే **అధ్యాత్మవిద్య.** దాన్ని తెలుసుకున్న వాసినే క్షేత్రజ్ఞుడని గీత పేర్కొంటుంది. విద్య అంటేనే క్రమంగా తరగతులువారీగా నేర్చుకోవలసినట్టిదని అర్థంచేసుకోవాలి. లోకంలోని లౌకిక విద్యలన్నీ తరగతుల ప్రకారం ఎట్లా నేర్చుకుంటున్నామో అట్లే అధ్యాత్మవిద్య కూడా నేర్చుకోవలసినదే.

క్రమంగా నేర్చుకోవడం అంటే కేవలంశృత పాండిత్యం కాకుండా తెలుసు కున్న విద్యా క్రమమంతటినీ అభ్యసించి అనుభవాన్ని పొందడమన్నమాట. సూక్ష్మశరీరంలోని ఇంద్రియాధిష్ఠాన దేవతలు, పంచభూతాలు, షట్చక్రాలు, శ్రీచక్రం, అందులోని దేవతలు ఆయా దర్శనాలు ఇవన్నీ కలిసినదే **అధ్యాత్మవిద్య.** ఈ అధ్యాత్మ విద్య ఎన్నో యుగాలనుండి మహర్షులచేత తత్త్వవేత్తల చేత ఎన్నోవిధాలుగా తెల్పబడింది. (Theory) థియరీ (Practicals) ప్రాక్టికల్స్ రెండూ చెప్పబడినాయి. ఆవిధానానికి తగిన అభ్యాస పద్ధతులను, క్రమవికాసాన్ని తెలుసుకొని సాధన చేయడం ఎంతో అవసరం. సిద్ధాంతాలు ఎన్ని చెప్పినా, ఎన్నివిన్నా, ప్రయోగాభ్యాసం లేకుంటే నిరుపయోగం కదా! కొన్ని ధ్యాన కేంద్రాలు యోగాభ్యాసాన్ని శిక్షణనిస్తున్నప్పటికీ, అది తరగతుల వారీగా (Syllabus) కన్పించదు. కేవలం ఉపన్యాసాలు, ప్రచారం ప్రాముఖ్యతను వహిస్తున్నాయి. సాధకుని సంస్కారాన్ని, చిత్తవికాసాన్ని, అర్హతను ఆధారంగా తరగతుల నేర్పరచి యోగాభ్యాసంలో శిక్షణనిచ్చినప్పుడే అది అనుభవానికి వస్తుంది. లేకుంటే నిష్ఫలమే. అటువంటి విధానాన్ని ప్రకటించి అభ్యాసంలో తగిన శిక్షణనిచ్చి, సాధకులకు తగిన మార్గదర్శకత్వం (Guidence) ఇవ్వడమే మా ఆత్మ విజ్ఞాన కళాశాల లక్ష్యం. ముఖ్య ఆశయం. ఈఏకాగ్రతారూప అభ్యాసానికి ప్రతిమానవుడూ, (లింగ, కుల, మత, భాష, దేశ వివక్ష లేకుండా) అర్హుడే! ప్రతివానికీ ఆహక్కు ఉంది.

**జిజ్ఞాసువులందరికీ, అభ్యాసకులందరికీ**
**ఇదే మా హృదయ పూర్వక ఆహ్వానం!**
**స్వాగతం! సుస్వాగతం!!**

# శ్రీ గురువుల సంక్షిప్త జీవిత చరిత్ర

శ్లో॥ శ్రీనివాసం శ్రీనికేతం శీఘ్రసిద్ధిద మాశ్రయే
స్వయం జ్యోతి స్సుధాసింధు సాధు సద్గురుశేఖరమ్

**కులం పవిత్రం జననీకృతార్థా వసుంధరా పుణ్యవతీ చ తేన**

శ్రీనివాస గురుదేవుల స్వస్థలము ఆంధ్రప్రదేశమునందలి రాయల సీమలో కడప మండలము జంబులమడుగు తాలూకా పెద్దముడియం అను గ్రామము. కుముద్వతీ నదీ తీరములోనున్న ఆ గ్రామములో మృడానీ దేవాలయమున్నది. ఆదేవి పేరుతోనే మృడానీయము అని ఆగ్రామము వెలసినదనియు, క్రమముగా వికృతిని చెందుచు ముడియము అని నిలిచినదని అభిజ్ఞుల అభిప్రాయము. ఆయూరిలో సాధు, వంశస్థులు శ్రీగురుమూర్తి భట్టు అను బ్రాహ్మణశ్రేష్ఠుడు నివసించుచుండెను. వారి వంశమునకు, శ్రీ గురుమూర్తి భట్టుగారి సాధువర్తనముగాంచి చాలహర్షించి ఆప్రాంతం ఏల్బడిదారు ఒకసభనేర్పాటుచేసి సగౌరవముగ శ్రీగురుమూర్తి భట్టుగారిని ఈసాధు నామముతో సత్కరించినారని ప్రతీతి. ఆనాటినుండి వారి వంశనామము సాధు వంశమయ్యెను. వారిది కౌండిన్యస గోత్రము.వారు శ్రీనివాసగురుదేవులు ప్రపితామహులు.

శ్రీగురువుల అవతారమునకు వారిపై మూడుతరములనుండి యే (రంగస్థలము) బీజాంకురములేర్పడినవని భావింపవచ్చును. శ్రీగురుమూర్తి భట్టుగారి గృహస్థ ధర్మము మూడు పూవులారు కాయలుగ నుండెను. అతిథ్య భ్యాగతసత్కారములకు లోటులేని భూవసతి గలిగి అగ్రహారీకులలో యోగ్యుడుగ శ్రీగురుమూర్తిభట్టుగారు సంసారయాత్ర జరుపుచుండిరి. వారి ఇంటికి ఒకనాడొక సిద్ధపురుషుడెచ్చటినుండి యో మధ్యాహ్న కాలమునక భ్యాగతుడైవచ్చినాడు. శ్రీ గురుమూర్తి భట్టు ఆసిద్ధపురుషునికి సాష్టాంగ ప్రణామ పూర్వకముస్వాగతమొనరింప జేసి, అర్ఘపాద్యాదు లిచ్చి సత్కరించి భోజనమొనరింపజేసి విశ్రమింపజేసినాడు. విశ్రాంతి సమయమున, ఆసిద్ధుడు "నాయనా! గురుమూర్తిభట్టూ! నీకు శ్రీగురుదక్షిణామూర్తి స్తోత్రము నుపదేశించెదను. ఆస్తోత్రము నీవంశీయులకందరికి క్రమముగ నుపదేశించుచుండుము అని పలికెను. వానిచే శ్రీగురుదక్షిణామూర్తి

మీవంశములో మీకు మూడవతరములో నవతరించి యోగజ్ఞానముల ప్రవర్తింప చేయువాడు. ఇది ఈశ్వరేచ్ఛసుమా"! అని ప్రబోధించెను. అప్పుడు గురుమూర్తిభట్లు ఆమహనీయుని అవ్యాజమైన, అపారమైన అనుగ్రహాతి శయమునకు నేత్రముల నుండి ఆనందబాష్పధారలు జారుచుండ **ధన్యోస్మి** అని ఆసిద్ధునకు సాష్టాంగ మొనర్చి, లేచి అనుగ్రహింపుడు అని ప్రార్థించెను. ఆనందముతో మహా భాగ్యమని శ్రీ దక్షిణామూర్తి స్తోత్రమును ఉపదేశం పొంది భక్తి శ్రద్ధలతో ఆస్తోత్రమును మూడు సంధ్యల యందు పారాయణ మొనర్చుచు యథాశక్తి మననంచేయుచు జీవితం గడిపినారు. శ్రీ జగద్గురు శంకరాచార్య స్వాముల వారి రచనలలో శిఖర స్థానము నందిన శ్రీ దక్షిణామూర్తి స్తవమును సాధు గురుమూర్తిభట్లుగారి సత్పుత్రుడు నారాయణభట్లు గారికిని ఉపదిష్టమై సాగినది.

శ్రీ నారాయణభట్లు గురుమూర్తి భట్లుగారి ఏకైక పుత్రుడు. ఆయన మృడానీభక్తుడు. ప్రతి నిత్యము మృడానీభవానీ సన్నిధిలో ఆమెను ఆరాధించి శ్రీ గురుదక్షిణామూర్తి స్తవమును పారాయణ మొనర్చు చుండెడి వాడు. శ్రీ నారాయణభట్లుగారికి నల్గురు కుమారులు కలిగిరి. పెద్ద వానికి శ్రీ గురు మూర్తిభట్లు అని పేరుపెట్టుకొన్నారు. తరువాతవారికి వరుసగా సుబ్బాభట్లు, నందయ్య, శేషయ్య అని నామకరణము లొనర్చినాడు.

వారునల్గురిలో మూడవవారు సాధునందయ్యగారు. శ్రీ నివాస గురుదేవుల పితృపాదులు. మాతృదేవి లక్ష్మీనరసమ్మ గారు. నందయ్య గారు ప్రతిభావ్యుత్పత్తులలో సామాన్యులు గారు. ఆయా గ్రామాలలో భారత, భాగవత రామాయణములను ఎన్నోచోట్ల అనేక భావపరీమళములు విచ్చు నట్లు తనశ్రావ్యకంఠముతో గానమును జతచేసి, జనరంజకముగ పురాణ ప్రవచనం చేయుచు ఆప్రాంతమున పేరుగాంచిన వ్యక్తులు. ఆప్రజలందరు భయ భక్తులతో వారిని సేవించే వారు. వారికి సాహిత్యముపై కంటె ఆధ్యాత్మిక విషయములపైననే జిజ్ఞాస దినదిన ప్రవర్ధమానముగు చుండెను. వారితండ్రి గారినుండి ఉపదిష్టమైన శ్రీ గురుదక్షిణామూర్తి స్తవమును ఎంతో దీక్షతో పారాయణము నొనర్చు చుండు వారు. శ్రీ గురుదేవులమాతృదేవి లక్ష్మి నరసమ్మ గారు పతివ్రతా రత్నముగ నందయ్యగారికి గృహస్థధర్మములో సరి యుద్దిగ గృహకార్యములను తీర్చు చుండెడిది. పరమపావనమగు ఆ తల్లి చరితము గృహిణీమణు లకునెల్ల ఆదరణీయముగ నుండినది. సాధునందయ్య

గారికి అధ్యాత్మజిజ్ఞాసతో బాటు విషయానందముపై వెగటు గల్గుచు, నిత్యానంద లాభమునందవలెనను ప్రగాఢశుభేచ్ఛ గల్గుచుండెను.

ఆప్రాంత్యమునకెల్ల బ్రహ్మ విద్యాసిద్ధినందిన మహనీయులు కోదండరామయ్య గారు శ్రీనంధయ్యగారింటికి ఒకనాడు అతిథులైచనుదెంచిరి. వారిదర్శనముతోడనే నందయ్యగారు లేచి సాష్టాంగ ప్రణామ మొనర్చి ధన్యుడైతి నని పల్కి సపర్యలొనర్చెను. కోదండ రామయ్య గారు నందయ్యను బ్రహ్మవిధ్యాధికారిగాయంచి తగిన ప్రబోధమొసగి ఆధ్యాత్మిక విద్య దిగమమునకు ప్రాణకమగు అష్టమహా విద్యలలో ముఖ్య ప్రభావవంతమగు అక్షిపురుష విద్య నుపదేశించెను. కోదండ రామయ్యగారు విద్యనిచ్చిన వెంటనే నందయ్యగారికి అనుభవం గల్గినది. శ్రీ కోదండ రామయ్యగారు "నాయనా నందయ్య! నీకు ఈ విద్యనభ్యాసం చేయుకొలది మిక్కిలి బ్రహ్మానందలాభమునంది కృతార్థుడవగుదువని" ఆశీర్వదించి వెడలిపోయిరి. నందయ్యగారు శ్రద్ధగా యక్షిపురుషవిద్యోపాసన జేసుకొను చుండెను. నందయ్యగారికి సంతానము కాలేదు. నందయ్య పినతల్లి కొడుకు ఈశ్వరయ్య(పర్లపాడు) ఈశ్వరభక్తుడు. సమవయస్కుడు. ఒకసారి నందయ్యకు వానితల్లిని సంజీవమ్మకు చూచుటకు వచ్చి,గోష్ఠిలో మహానందీశ్వర స్వామి క్షేత్ర మహిమను వారికి తెలుపగా నందయ్య దంపతులు, వారి తల్లి సావిత్రమ్మగారును ఈశ్వరయ్య దంపతులు ఆనాటి సమీపమున వచ్చు మహా శివరాత్రికి మహానందీశ్వర స్వామి క్షేత్రమునకు వెళ్ళి స్వామికి యథావిధిగా అభిషేక పూజాదికములు సభక్తికముగా చేసి ఆరాధించిరి. మహానందీశ్వర స్వామి పూజానంతరము ఆ క్షేత్ర మందలి ఆచారం చొప్పున నందీశ్వరయ్య, ఈశ్వరయ్యలు మహానందీశ్వర శిరోగర్భమున చేతులుపెట్టి వేడుకోగా, నందయ్యకు ఒక రుద్రాక్షను ఈశ్వరయ్యకు ఒక మామిడి పండు దొరికినది. అది చూచి వారందరు బ్రహ్మానంద పడుచు స్వామి కృపను మిక్కిలి ప్రశంసించిరి. ఈశ్వరయ్య సావిత్రమ్మతో "పెద్దమ్మ ఈపండును ఏమి చేయమందువు" అని అడుగగా సావిత్రమ్మ (నందయ్య తల్లి) "నాయనా! ఇది మహానందీశ్వర కృపాఫలము సంతాన ప్రదాయకమైనది. దానిలో సగము మన లక్ష్మీనరసమ్మకు ఇచ్చి మిగిలిన సగము నీ భార్య కిమ్ము. ఈ ఫలము భక్షణమువనే వీరలిర్వురు సత్సంతానవంతులై వంశవర్ధినులు కాగలరు." అని ఆదేశించెను. ఈశ్వరయ్య యు ఆ ప్రసాదమును కలది. వెంటనే చెరి సగము

చేసి వారికిచ్చెను. కన్నులకద్దుకొని వారలప్పుడు భుజించిరి. శివరాత్రి ఉత్సవములు ముగించుకొని పెద్ద ముడియం జేరిరి. మర్నాడు ఈశ్వరయ్య దంపతులు పర్లపాడు చేరిరి. మహానందీశ్వర అనుగ్రహ రూప ఫలభక్షణ ప్రభావంతో మరుసటి నెలలోనే వారిరువురు ఒకేసారి గర్భము ధరించిరి. శ్రీ నందయ్యగారి ధర్మపత్ని లక్ష్మీనరసమ్మ దంపతుల కాపురము 7 ఏండ్లు గడిచినమీద ఇప్పటికి సంతాన ప్రాప్తి జరుగుచున్నది. లక్ష్మీనరసమ్మగారి తండ్రి జంబులమడుగు నగరవాసి కల్లుట్ల నరసరామయ్యగారు. వారికి ఈ శుభవార్త తెలియగానే పసుపు కుంకుమ చేసి మూడవనెలలో జంబులమడుగు కుమార్తెను పిలుచుకొని పోయిరి. ఎంతో అల్లారుముద్దుగా గర్భవతి అయిన కుమార్తెను 9 నెలలవరకు చూచుకొనుచుండిరి. వారి ఇలవేల్పు తిరుపతి శ్రీనివాస మూర్తిని కుమార్తె సుఖప్రసవము అగుటకు సత్పుత్రుని పొందుటకు ఉపాసించుచుండిరి. లక్ష్మీనరసమ్మగారికి శ్రీనివాసస్తవము ఉపదేశించినారు. ఆతల్లి శ్రీనివాసస్తవమును నిరంతరము స్మరించుచుండినది. ఆతల్లికి ఒక నాటి స్వప్నంలో శ్రీనివాసుడు దర్శనమొసగి "అమ్మా! మహానందీశ్వర అనుగ్రహముచే గర్భము ధరించినావు. నీకు జన్మించబోవు కుమారుడు రూపముచే ఆస్వామి సమానుడైనను, నామముచే నా స్వరూపుడు గా విరాజిల్లును. నేనునూ మహానందీశ్వరుడునూ ఒక్కటేనని గ్రహింపుము. ఎవరేమి పేరుపెట్టినను నీవు మాత్రము శ్రీనివాసుడని పిలువుము. అతడెప్పటికినీ శ్రీనివాసమూర్తి వలె ప్రకాశించగలడు" అని చెప్పి అంతర్హితుడయ్యెను. ఆమె వెంటనే మేల్కాంచి తమ తండ్రికి ఈసంగతి తెల్పి ఇరువురు ఆనందాశ్చర్యమును పొందిరి.

శ్రీగురుమాత లక్ష్మీనరసమ్మ నందన సంవత్సర కార్తీక శుద్ధ షష్ఠీ గురువారం (27-10-1882) ఉదయం గం. 9-30 ని.లకు శ్రీనివాసుని ప్రసవించెను. తక్షణమే ఆమెకు ఆ గది నిండా దివ్య తేజఃపుంజము కనిపించినది. మహానందీశ్వరుడు శ్రీనివాసుడు లీలగా దర్శనము యిచ్చి మా ఇద్దరి స్వరూపమే ఈ బాలుడని చెప్పినట్లు భాసించింది. నామకరణము జరిగింది. తండ్రి గురుమూర్తి అని తల్లీ శ్రీనివాసులు అనితలచుకొనిరి. రెండూ కలిసి శ్రీనివాస గురుమూర్తిగా ఖ్యాతినొందెను.

**శ్రీ గురువుల బాల్యం** :- శ్రీ గురువులకు ఐదవ మాసములోనే మాతృవియోగము కలిగినది. చిరునవ్వుల పువ్వులు వికసించు శ్రీనివాసుని

ముఖచంద్ర దర్శనము, ముచ్చట ఆ తల్లికి అంత మాత్రమే. జ్వరము సంధి లో "స్వామీ శ్రీనివాసా! నన్ను నీలో చేర్చుకో అంటూ కన్ను మూసింది. శ్రీనివాసుడు క్రమంగా శుక్ల పక్ష చంద్రుని వలె ప్రకాసించు చున్నాడు. మూడు సంవత్సరములు వచ్చుసరికి పౌరాణిక గాథలన్ని తెల్సు కున్నాడు. తెలియని దానిని గూర్చి అడిగితెల్సుకొనుట తెలిసిన వాటిని ఇతరుల కు సవివరంగా చెప్పుట వారి బాల్య లీలలలోనే ప్రసరించిన విజ్ఞాన వీచికలు.

శ్రీనివాసునికి ఐదవఏట విద్యాభ్యాసము వైభవముగా చేసి బడికి పంపినారు. ఐదవ నెలలోనే ప్రాథమిక విద్యలలో ప్రావీణ్యం పొంది పై తరగతి వారిని కూడా నిర్వీర్యుల నొనర్చు అత్యద్భుత మేధా శక్తి ప్రదర్శించెను. ఆ చదువు బాలునకు ఒక ఆటగా ఉండినట్లు ఇతరులకు తోచు చుండినది. ఆటలలో చాలా మేటిగా సహచరులగు బాలురకు గురుత్వము నాయకత్వము పొందుచుండినాడు. కేవలం ఆటలలోనే కాలము గడిపేవాడుకాదు. సాయంత్రం ఆటలు ముగిసిన తోడనే వృడానీ ఆలయము ఇతర దేవతాలయమునకు వెళ్ళి మధుర స్వరముతో స్తోత్రములు చేయుచు తోటి బాలులకు భక్తిని ప్రబోధించు చుండెను. వారు సహచరులగు బాలురు శ్రీనివాసుని తమ స్నేహితుడుగా మాత్రమే చూచుకొనుట లేదు. ఒక గురువుగా సేవించు చుండిరి. వారికి పేదరాశి కథలు, పితృపాదులు చెప్పినవి, అత్యద్భుతముగా కన్నులకు కట్టినట్లుగా చెప్పి ఆ బాలుర తన్మయులనూ చేయుచుండేవాడు. అందులోన అప్పుడే భావిజీవితంలోని మధురాతి మధురమైన శక్తి తొంగిచూచు చుండినది.

ఇట్లు ఏడేండ్ల వయసు వచ్చి నప్పటికే పెద్ద ముడియంలోని పాఠశాల విద్య పూర్తి అయినది. గురువుల పితృపాదులు ఉపనయమున మహోత్సవముగా శుభముహూర్తమొనర్చి శ్రీగాయత్రీ మంత్రము ఉపదేశించిరి. వారునూ పితృపాదులు సంధ్యావంద నాదులను చెప్పుచుండగానే గ్రహించి, కొంతకాలములోనే రుద్రాధ్యాయాది మంత్ర భాగముల్లు కంఠస్తమయినవి. నందయ్యగారు కుమారునకు ఆంధ్రము లోనే భారత, భాగవత మరియు రామాయణము లను క్రమముగా పాఠము చెప్పుచుండిరి. వారు చెప్పుట వినుట మాత్రమే శబ్దార్థముల భావములు, సన్నివేశ సందర్భములు ఏక సంథ గ్రాహియై వారి తండ్రికి ఆశ్చర్యకరమున వివరించుచుండిరి. శ్రావ్యమైన మధురకంఠముతో 14 ఏండ్ల లోనే వారిఊరి యందలి ప్రముఖులు

వచ్చి వీరి ఇంటివద్ద భారతభాగవతాది పురాణములను శ్రీనివాసుని వద్ద విని ముగ్ధులగుచుండిరి. పితృపాదులను మించిన పౌరాణికులై, వారు పుత్రాదిచ్ఛేత్ పరాజయం అనునది సార్థకం చేసినారు.

శ్రీనందయ్య గారికి సంస్కృత భాషతో ఎక్కువ ప్రవేశములేదు. తనకుమారునికి సంస్కృతములో పాండిత్యము కల్గింపవలెనన్న ఎచటికో దూరదేశములకు పంపవలెను. కుమారుని వియోగమును సహింపలేక చింతించుచుండెను. శ్రీనివాసునికి 15వ సంవత్సరము నడుచుచుండెను. ఒకమారు నందయ్యగారింటికి వారి గురువులు శ్రీకోదండరామయ్యగారు విజయం చేసిరి. వందనాది సపర్యలైన తర్వాత కోదండరామయ్యగారు భక్తి పూర్వకముగా నమస్కరించి నిలిచిన శ్రీనివాసులను చూచి "నందయ్యా! నీకుమారుని వదన తేజస్సు మాకే విభ్రాంతిని కొలుపు చున్నది. అష్ట మహాపురుష విద్యలలో ముఖ్యమైనదియు పరమ బ్రహ్మవిద్యాధిగమమునకు ప్రత్యక్షసాధకమగు అక్షిపురుషవిద్యయొక్క అనుభవమును పొందిన నీవు ధన్యుడవు. వేదాంత విద్యల పరిపాటి దేశంలో తప్పిపోయి (సన్నగిల్లి) అందరునూ వేదాంత వాక్చూరులుగా మిగులు చున్నారు. నీవు తగిన దినశుద్ధి చూచి నేనుపదేశించిన విద్య ఇతనికి ఉపదేశింపుము. నీ పుత్రుని విషయమున నీవు గురు స్థానము నొందుము. ఆ విద్యా ప్రచార ప్రాభవమువే ఇతడు ముందుముందు గొప్ప బ్రహ్మవేత్తయై స్వోద్ధారకుడు మాత్రమే గాక అనేక శిష్యోద్ధారకుడు మరియు దేశోద్ధారకుడు కాగలడని మాకు స్పష్టముగా తెలియుచున్నది. ఇది నా ఆదేశం." అని పలుకుచుండ శ్రీనివాసులకు ఆనంద బాష్పములు కన్నులనుండి జలజలా రాలుచుండెను. కొన్నాళ్ళుండి కోదండ రామయ్య గారు వెళ్ళిపోయిరి. శ్రీనివాసులకు అదివరకే సిద్ధమైన ఆధ్యాత్మిక వాసనలు ధీ క్షేత్రమున ప్రబుద్ధములై రేకెత్తి మారాకు తొడిగి ప్రవృద్ధములైనవి. పైగా కోదండరామయ్యగారి శ్లాఘ ప్రబోధము ఆవాసనలను మరింత ప్రాబల్యమునకు తెచ్చినవి.

నందయ్యగారు తమ గురువుల ఆదేశము మేరకు తమనందనునికి ఒకశుభ దినమున అక్షిపురుష విద్యను ఉపదేశించిరి. వెంటనే శ్రీనివాసుడు గురువులకు ఆవిద్యానుభవం చక్కగా గలిగినది. అప్పటి నుండియు శ్రీనివాసులలో నొక విధమైన అవర్ణనీయమగు మార్పూ తేజమూ విస్ఫురించి ముఖసీమలయందు వెల్లివిరియుచునే శ్రీవారిని చూచినవారి కెల్లా "ఈయన ముందుముందు

ఎంతటి మహనీయుడు కాగలడోకదా" అని ఆశ్చర్యపూర్వకభావములు దయించుచుండెను.

## శ్రీనివాస గురువులకు పరమ గురు మల్లికార్జున శాస్త్రుల వారి దర్శనము. వివాహము.

అల్కూరు గొల్లాపిన్ని మల్లికార్జునశాస్త్రిగారు ఆకాలము నందు కర్ణాటకము. ఆంధ్రరాష్ట్రములలో సుప్రసిద్ధులు. అపరోక్ష బ్రహ్మీభూతులై నిరంతరము బోధ, ఉపరతి నందుచు గృహస్థ ధర్మములోనున్నను 3, 4, 7, 10, రోజులు అసంప్రజ్ఞాత సమాధిలో గడపుచుండిన జీవన్ముక్తులు. ఆమహనీయులు తర్క వ్యాకరణ వేదాంత శాస్త్రములలో ఆకాలపు పండితులలో గద్వాల వనవర్తి సంస్థానాదులలో నాన్యతో సర్వసీమ ప్రతిభతో దేశమంతట కీర్తి చంద్రికలు వెల్లివిరియించిన [illegible] వారి కవితా ప్రౌఢి అనన్యమై విరాజిల్లుచుండినది. జ్యోతిశ్శాస్త్రములో గ్రహసిద్ధాంతములో వారి ప్రావీణ్యము వర్ణింపశక్యము కానిది. వారి రచనలలో ఇప్పటికి కొన్ని గ్రంధ రూపములుగైకొనియున్నవి. ఇంకను ఎన్నోకలవు.

అల్కూరు రాయచూరుకు సంబంధించిన ఊరు. తెలంగాణాలోనిది. అచటినుండి బయలుదేరివచ్చి జమ్ములమడుగులో నందయ్యగారి స్నేహిత బంధువులు గడియారం శేషశాస్త్రి గారితోగూడ శ్రీనివాసులు వరుడుగా నున్నాడని తెలిసివీరి బంధుత్వమున తమ కుమార్తె కువరాన్వేషణ నిమిత్తము కడప జిల్లాకు వచ్చి గడియారం శేషశాస్త్రితో గూడ వచ్చి, శ్రీనివాసులను చూచి, ఆమహనీయులు మల్లికార్జునశాస్త్రిగారు తమకుమార్తెకు శ్రీనివాసులకు ఇచ్చెదమనిరి. అంతగొప్పప్రసిద్ధ పండితులతో మహనీయులతో వియ్యమందుటకు నందయ్య కొంత భయ సంభ్రమములు కనబరుచుచు తమ కుమారునికి సంస్కృత విద్యా పాండిత్యము లేదని తెలిపెను.

శ్రీమల్లికార్జునశాస్త్రి పరమగురువులు "ఇతని విద్యావిషయమును గూర్చియు పురోభ్యుదయముగూర్చియు మాకువిడిచిపెట్టుడు అంతయు మేము చూచుకొందుము ఇక మీ సంశయము తీరినట్లేగదా?" అనిరి. గడియారం శేషశాస్త్రితో "ఈసిల్లవాడు బ్రహ్మవేత్తయై అభ్యుదయ సిద్ధినందు వాడుగనున్నడు నూకన్ని విధముల సరిపోవును." అనుటయు పంచాంగం

తెప్పించి, సముహూర్తం నిశ్చయించుటయు జరిగెను. నిశ్చయ తాంబూలము లు ఇచ్చి పుచ్చు కొనుట కూడ వెంటనే జరిగినవి. త్రికాల వేదులగు మల్లికార్జున పరమ గురువులు శ్రీనివాసుల భవిష్యత్తులోని మహత్తు దర్శించిరని వేరు తెలుపవలెనా?

శ్రీమతి కృష్ణవేణమ్మతో శ్రీనివాసశాస్త్రుల వివాహము శాస్త్రోక్తంగా జరిగింది. పెద్దముడియంలో తన స్వగృహమందు గృహస్థాశ్రమమున ప్రవేశించినారు. కొంతకాలం తర్వాత శ్రీమల్లికార్జునశాస్త్రి శ్రీనివాసునకు ఒక లేఖ రాసినారు. దానిలో తన విద్యా ప్రగతికి తగిన గురువుగా శ్రీ మల్లి కార్జునుడు గోచరించినాడు. తండ్రి ఆశీసులను గ్రహించివెంటనే అల్ళ్యారుకు వెళ్ళి మామగారైన మల్లికార్జునశాస్త్రిని సర్వాత్మనా గురువుగా భావించి భక్తితో సేవింపసాగిరి. మల్లికార్జునశాస్త్రిగారు పరమయోగి పుంగవులు. విద్యా సముద్రులు. దీర్ఘకాలం నిర్వికల్ప సమాధినిష్ఠులై స్వాత్మావలోకన తత్పరులై ఉండేవారు. అట్టి సద్గురువును సేవించి ఆయా విద్యాసిద్ధిని పొంద వలెననే దీక్షతో శుశ్రూషసల్పుతున్నారు శ్రీనివాసులు. మహాత్ముల జ్ఞాన నిష్ఠ బలవత్తరం అయ్యేందుకు తగిన పరిస్థితులు విధివశాత్తు సమకూరు తాయి. గురు సేవా తత్పరులైన శ్రీనివాసునకు భార్య కృష్ణవేణమ్మ అకాల మరణ వార్త కలచివేసింది. కాని ప్రాజ్ఞుడై విరాగముతో దుఃఖాన్ని జయించినారు. కొంత కాలం తర్వాత మల్లికార్జునశాస్త్రిగారు తన రెండవ కుమార్తె సరస్వతమ్మ ను శ్రీనివాసశాస్త్రి కిచ్చి వివాహము చేసెను. తన నిరంతర సమాధి నిష్ఠ శిష్యుని విద్యాభివృద్ధికి ఆటంకం అయితుందని భావించి నారాయణశాస్త్రి అనేపేరు గల్గిన వెదవేదాంగవేత్త, తర్క వ్యాకరణాది శాస్త్రవేత్త వద్దకు పంపించినారు. ఈశ్వరానుగ్రహం వల్ల శ్రీనివాసశాస్త్రికి చిత్తైకాగ్రాము చేకూరి, అచిర కాలంలోనే సమస్త శాస్త్రాలలో అఖండ పాండిత్యం సంపాదించెను. ఇంతలో శాస్త్రిగారికి పితృవియోగం సంభవించింది. స్వగ్రామం వీడి అల్ళ్యారు నందే స్థిరనివాసం ఏర్పరచుకున్నారు.

ఒకనాడు నారాయణ పండితులు శ్రీనివాసునితో ఈవిధంగా పలికిరి. "నాయనా! శాస్త్ర పాండిత్యంతో ఆధ్యాత్మతత్వాన్ని బోధిస్తూ శిష్య లోకోద్ధరణం సల్పుము. భక్తి జ్ఞానములను సమన్వయిస్తూ ప్రసంగించగలిగే ప్రజ్ఞ గలవాడివి నీవు. మహానుభావుడైన మల్లికార్జునశాస్త్రిగారి ఆశయము కూడా ఇదే. ఆధ్యాత్మ విషయికమైన వైముఖ్యాన్ని తొలగించి లోకను

నుద్ధరించు!" అది మొదలుగా శాస్త్రిగారు తన జీవితాన్ని ఆధ్యాత్మ విద్యా ప్రబోధ ప్రచారాలకే అంకితం చేసినారు. ఎందరో శిష్యసాధకులు శ్రీ గురు కృపచే జన్మ సాఫల్యమునొందినారు.

## గురువుల ఆధ్యాత్మబోధ

గురువర్యుల ప్రసంగములు పురాణాగమాదిసమ్మతములై తర్క భూయిష్టమై, దివ్యములై యొప్పారుతుంటాయి. గహనములైన ఆత్మ విషయాలను అమోఘప్రతిభతో సుస్పష్టమొనరుస్తూ భాషించేవారు. వారు సర్వవేదాంతరహస్య పారగులు. ఆత్మతత్వాన్ని ధర్మాలను ఏకకాలంలో పండితులకు, పామరులకు, స్త్రీలకు, బాలురకు అందరికీ సుబోధకమగు నట్లు ప్రసంగించెడివారు. తననాశ్రయించిన వారినందరినీ ఆత్మీయులుగా భావించి, అవ్యాజ వాత్సల్యాదరాలతో కరుణించే వారు. సర్వప్రాణులందు ఆత్మనే దర్శించినారు. వారి హృదయంలో కోపతాపాలకు, బేధ భావానికి స్థానమే లేదు. జాతి, మత, కుల, లింగ, భాషా భేదం లేక ఆశ్రితులైన శిష్య సాధకులను చూచేవారు. ఈవిధంగా శ్రీగురువులు యోగులలో ఉత్తములుగా కర్మతత్పరులలో అగ్రేసరులుగా, పండితులలో శ్రేష్ఠులుగా, జ్ఞానులలో జ్ఞానసత్తముడిగా ఖ్యాతి గాంచిరి. వారు త్రిమూర్త్యాత్మకులు. బ్రహ్మజ్ఞాన సంపన్ను లనెడి సద్భావనచే సేవించు భక్తులు బ్రహ్మీభూతులు కాగలరనుటలో సందేహములేదు.

శ్రీ గురుదేవుల ప్రవచనములనువిని అనుభవమును తెచ్చుకొన్న శిష్యులు ఎక్కువ మందున్నారు. వారిలో ముఖ్యులు అల్కూరు రామా శాస్త్రి, జయంతి కామేశ్వరరావు, శీనంభట్లు, గ్రంధరచయిత పాణ్యాం లక్ష్మీ నరసింహ శాస్త్రిమొ॥ గురువుల రచనలు భక్తి జ్ఞాన వైరాగ్యబోధకములు. అమూల్యములు. అముద్రితములు. వాటిలో అధ్యాత్మవిద్యా ప్రణాళిక యొక్కటి ప్రస్తుతం ముద్రణకు నోచుకొన్నది.

## ఆత్మవిజ్ఞాన కళాశాల *(College of Self - Science)* స్థాపన

ఈ ఆత్మవిజ్ఞాన కళాశాల 1950 సం. నవంబరులో పరమ కృపా స్వరూపులగు శ్రీగురువులు, బ్రహ్మశ్రీ సాధుశ్రీనివాస శాస్త్రి గారిచే స్థాపించబడి నిర్వహింపబడెను. ఇది ఏ విశ్వవిద్యాలయమునకు అనుబంధ కళాశాలగా చేర్చబడక తనకృషిని నిర్వహించెను. భారతదేశంలో వేదాంత

సంస్థలు, మతసంస్థలు, యోగాశ్రమములు ఎన్ని ఉన్ననూ, కేవలము విద్యా దృక్పథముతో నిర్మింపబడిన ఆత్మవిజ్ఞాన కళాశాల ఇది యొక్కటేనని చెప్పవచ్చు. మొదట నల్గురు విద్యార్థులతో ప్రారంభించిననూ, ఈ సంస్థ క్రమముగా వికాసము పొంది, ఉత్తీర్ణులైన పెక్కుమంది విద్యార్థులను దేశమునకు సమర్పించుకొన్నది.

ఈ కళాశాలలో ఆత్మ విజ్ఞానమే ప్రధానమై బోధింపబడెను. అదికూడా ఆధునిక వాతావరణమునకు తగినట్లు సైన్సు- విజ్ఞానముగా బోధింపబడుట వల్ల, సహృదయులు ముందడుగు వేసి, ఆత్మ విజ్ఞాన తత్త్వము గ్రహించుటకు అవకాశమేర్పడెను. ఇచ్చట ఆంధ్రమే బోధనా భాషగానుండెను. విద్యార్థుల సౌకర్యార్థము కన్నడభాషలో కూడా అప్పుడప్పుడు విషయములు బోధింప బడెను. ఆత్మవిజ్ఞానార్థులు ఎవ్వరైననూ ఏజాతి, మత, కుల, వృత్తులతో సంబంధం లేక ప్రవేశపరీక్ష (Entrance test) లో ఉత్తీర్ణులైనంతనే చేర్చుకొను చుండిరి.

ఇచ్చట ఆత్మవిజ్ఞానము కేవలము ఉపన్యాసముల ద్వారానే కాక, అభ్యాస క్రమముతో తరగతి వారిగా (Class by class system) బోధన చేయ బడెను. ఈకళాశాలలో ఆత్మవిజ్ఞానసాధన ఒక పరిశోధన దిశగా సాగెను. ఆత్మ విజ్ఞానము సమాహితపద్ధతి (Subjective Method) నాశ్రయించి బోధింపబడు చున్నది. విద్యార్థుల కిందు మొదటి నుండి మనశ్శిక్షణ (Mental Training) మీద ఆధారపడి ఆత్మవిజ్ఞాన ప్రచారము జరుగుటవల్ల, క్రమశిక్షణ (Discipline) కెంతో ప్రాధాన్యమేర్పడెను. క్రమశిక్షణారహితులతో ఆత్మవిజ్ఞానము కలుగదని నిష్కర్షగా చెప్పవచ్చు. అందువల్ల, ఆత్మ విజ్ఞానమును ఆధునిక విద్యావిధానములో ఒక ముఖ్య విషయముగా (Compulsory Subject)గా చేర్చినచో, అది విద్యార్థుల యౌన్నత్యమునకు తోడ్పడ గలదు. ఇందలి ఆత్మవిజ్ఞానప్రణాళిక, ఇటు సామాన్యవిద్యావిధానముద్వారా ఉన్నత పాఠశాల వరకు బోధించగల విధానముతోనున్నది. కళాశాల స్థాపకులు, నిర్వాహకులు, శ్రీగురువులు అయిన బ్రహ్మశ్రీ సాధు శ్రీనివాస శాస్త్రిగారు శ్రీవిద్యా నగర (హంపి) విరూపాక్షేశ్వర స్వామి ప్రియ శిష్యులును, అలుకూరు వాస్తవ్యులును బ్రహ్మ వేత్తలును అయిన శ్రీ అలుకూరి మల్లికార్జున

శాస్త్రిగారి ప్రియశిష్యులు. పోలికయే అవసరమైనచో మన ప్రాచీన ఋషులతో పోల్చుదగిన మహావ్యక్తి ఈయన. చిన్నతనమున ఆత్మవిజ్ఞానము నభ్యసించి, ఉత్తీర్ణులైన ఆత్మవేత్తలుగా ప్రఖ్యాతి గాంచి, ఆత్మవిజ్ఞానమును మథించి తెచ్చుకొన్న అమృత రసము, ఆత్మానుభవమును అందరికీ పంచిపెట్టు ఔదార్యముతో హైదరాబాదుకు వచ్చి ఈకళాశాల స్థాపించిరి. వారి వేద, శాస్త్రపురాణాది విదయ్ల యందలి గాఢ కృషి, ఆత్మవిజ్ఞాన వ్యాప్తి ద్వారా దేశోద్ధారము గావింపవలెననే ఉత్సాహమే, ఈ ఆత్మవిజ్ఞానకళాశాలా స్వరూపమునకునాంది.

## ఆత్మవిజ్ఞాన కళాశాల పక్షమున వెలువడిన మాసపత్రిక – మేధావి

ఆత్మవిజ్ఞానము వ్యాపకముగా విద్యాసంస్థలలో ప్రవేశపెట్టించి మనబిడ్డలను విద్యార్థులను రక్షించుకొని మేధావులుగా చేయుటకు, మహాశయులను హెచ్చరించి, వారి సానుభూతి, సహకారములను సేకరించు కొనుటకై మేధావి పత్రిక ఆవిర్భవించినది. ఆంధ్రప్రజలలో మేధావిత్వమును గూర్చి ఆధునిక వ్యవహారపద్ధతులకు ఏవిధమైన ఇబ్బంది వాటిల్లకుండా ప్రబోధరూపమైన ప్రచారమునకై **మేధావి** అవతరించినది.

ఈ పత్రిక చేయ సంకల్పించిన దేశసేవ సామాన్యమైనది కాదు. అసలు శరీర వ్యవహారమునకు సంబంధఇంచిన **నేను** అను భావరూపమైన వస్తువే **ఆత్మ.** అట్టి ఆత్మ యే స్వరూపముగా కల్గినవాడు మానవుడు. అయినను అది యంతము మరచిపోయి, ఆత్మశబ్దము వింత, వెర్రి వేదాంతముగా భావించుకొని, అది తనకవసరం లేదని, అహంకృతులైన సమయంలో, ఈపత్రిక ఉదయించి అన్ని వ్యవహారములలో నేను, నేను అని భావించిన నీవు ఫలానావాడవు! నీ స్వరూపము ఇది! జిజ్ఞాసువైన నీవు ముందు అది తెలుసుకో! నిన్ను నీవెఱుగకుండా ఎంత నేర్చిననూ వ్యర్థము అని నిరూపించి చెప్పుటలో మేధావిత్వమును మొదటసాధనముగా చూపి ఆత్మవిజ్ఞాన లాభమును కల్గించి, తద్వారా మానవుని బాహ్య వ్యవహారమును నిర్దుష్టముగా, నిత్యానంద మయముగా జేసి పోషించుకొనుటకు తగిన ప్రణాళికలు, మార్గములు చూపించి, అతని కృతకృత్యుని చేయుటయే తన ముఖ్య కర్తవ్యములుగా తలంచినది.

శ్రీగురువుల సంక్షిప్త రచనలు:- 1. శత్రువిజయము 2. శివరాత్రి 3. రెండే మార్గములు 4. మతము, దాని తత్వము 5. శ్రీగురువులు 6. మాగురువులు 7. ప్రవృత్తి- నివృత్తులు. 8. మహిళాభ్యుదయము (సావిత్రి), 9. మతసామరస్యము, 10. ప్రాచీన విద్యాప్రణాళిక, 11. షట్చక్ర నిరూపణము. 12. గురుసేవా పద్ధతి. 13. విరాడుపాసనా*(గురువుల యోగ విద్యలన్నీ ఈ గ్రంథంలో ప్రకటించబడుతున్నాయి)*

**అఖిల భారత విద్యామహాసభ: (All India Educational Conferance)**

హైదరాబాదు చరిత్రలో మొట్టమొదటుగా అఖిల భారత విద్యా మహాసభ, ఉస్మానియా విశ్వవిద్యాలయంలో (డిశంబరు 28-31-1950) జరిగినది. ఆత్మవిజ్ఞాన కళాశాల గూడ భారత విద్యాసంస్థల సమాఖ్య (All India Federation of Educational Institutions) లో చేరి దాని శాఖలలో ఆత్మవిజ్ఞాన - సంస్కృతి అనే ఒక శాఖను (Self Science & Culture) కల్పింపజేసి, తద్వారా ఆసంస్థ యందలి విద్యా భావుకుల సహకారముతో, ఆత్మవిజ్ఞాన సంస్కృతులను- మనశ్శిక్షణ (Mental Training) పద్ధతిమీద ఒక సబ్జెక్టు గా చేసి నాటి విద్యా ప్రణాళికలో చేర్చి విద్యాపునర్నిర్మాణమును కావించవలెనని ఆకర్షించెను. కాని ఈ ప్రయత్నము కార్యరూపము దాల్చలేదు.

**శ్రీగురువులను గూర్చి కొన్నిమాటలు** :- శ్రీగురువులు సంస్కృతమున అఖండ పాండిత్యమును సంపాదించినవారై, వేద, ఉపనిషత్, శాస్త్ర, పురాణాది విద్యలందు విశేష కృషి సల్పియున్నారు. వారు **భగవద్గీత** నొక పారాయణ గ్రంధముగా కాకయోగశాస్త్ర గ్రంధముగా అభ్యసించి అనుభవము పొందిరి. ఈయోగశాస్త్రము యొక్క ఆదర్శము ఆత్మ-సాక్షాత్కారము కొఱకే అయినా, నిత్య జీవితంలో యోగవిద్యల యొక్క అనుభవము ఎట్లు ఉపయోగించునదీ, ఉపయోగపడునదీ అవి ఏవిధములై ఫలితములు సాధించినదీ తన శిష్యులచేత సాధన చేయించి నిరూపింపజేసిరి. వారి శిష్యులచేత సాధన చేయించి నిరూపింపజేసిరి. వారిశిష్యులలో కొంతమంది అద్భుతములు చేసి చూపినారు.

శ్రీగురువుల యోగవిద్యలు ముఖ్యముగా పతంజలి యోగసూత్రములు, ఉపనిషత్తుల ఆధారముగా బోధింపబడినవి. ఇవి శిష్యులచే అభ్యాసము చేయబడి అనుభవము పొందబడినవి. శ్రీగురువులు తన పరమ గురువులైన

బ్రహ్మశ్రీ అల్మూరి మల్లికార్జునశాస్త్రి గారి నుండి యోగాభ్యాస శిక్షణను పొందియున్నారు. వీరు హంపి విరూపాక్షస్వామి అనుగ్రహమును స్వయముగా పొంది యుండిరి. శ్రీగురువులు విద్యలను అభ్యాసయోగ ప్రణాళిక ద్వారా అభ్యాసకులకు సులభమగునట్లు, ప్రత్యేకమైన పద్ధతులద్వారా శిష్యులకు ఉపదేశించిరి. అది ప్రస్తుత మన విద్యాప్రణాళికవలె క్రింది స్థాయి నుండి పైస్థాయివరకు తరగతి వారీగా బోధింపబడెను. వారు విశాలహృదయముతో కుల,మత, లింగ విచక్షణ లేక అందరినీ తన శిష్యులుగా చేర్చుకొని అభ్యాసక్రమముతో విద్యలనుపదేశించి ఉద్ధరించిరి. సాధక శిష్యులను సుమారు 100(నూరు) సంఖ్యకుపైగా తమ కృపామృతధారచే అధ్యాత్మ విద్యనుపదేశించి, యోగ విద్యాదర్శనములను అనుభవపూర్వకముగా ప్రసాదించిరి. ఆయోగదర్శనానుభవము ఇప్పటికీ కొంతమంది శిష్యులు పొందుచూ, వారి అధ్యాత్మజ్యోతిని వెలయించుకొనుచున్నారు. వారు భక్తజన కల్పతరువులు. జిజ్ఞాసులగు సాధకులు ఇప్పటికీ వారి సన్నిధిలో అభ్యాసము జరుపుకొనుచున్నారు.

## మతము-దాని తత్త్వమును గూర్చి గురువుల అభిప్రాయము

మతమనగా ఏమి? లోకమున వైదిక మతమని, శైవమతమని, వైష్ణవ మత మని, క్రైస్తవమతమని, మహమ్మదీయమని ఇట్లు వేరువేరుగ అభిరుచిని బట్టి పలువిధములుగ మతముల నేర్పరచుకొన్నారు. ప్రతి వారు నా మతమే ఉత్కృష్టము, ఉన్నతము, శ్రేష్టము, భగవంతుని చేరు మార్గమని విభేదించుచున్నారు. ఆకాశమునుండి పడిననీరు నదులుగామారి, కొన్ని చక్కనిత్రోవలో, కొన్ని వంకరటింకరగా ప్రవహించినా, ఆప్రవాహములన్నిటికీ మహాసముద్రము ఎట్లు పరమ గమ్యమో, అట్లు మానవాళికంతకూ నిత్యానంద పరబ్రహ్మమే పరమ గమ్యముగా ఉంది.

నిత్యవ్యవహారంలోని ఆచారములు, పూజలు, ప్రార్థనలు మొదలైన క్రియాకలాపములే **మతము** కాదని సర్వజన సమ్మతమే మతమని శ్రుతి, స్మృతి, ఆగమ, దర్శనాదికములచే చెప్పబడినది. జన సమూహముచే అంగీక రించ బడినది. దీనినే మతము అని చెప్పుట న్యాయము. ఇది ఎట్లనగా , ఈ వివేచనను గ్రహించి తెలుసుకొనగోరు వారికి శ్రీగురువుల అభ్యాసయోగ ప్రణాళిక తక్షణమే అభ్యసింపదగినది. నిత్య సుఖ రూప పరమ గమ్యమునకు గమకము

(సాధనములు) అనేకములు ఉండవచ్చు. ఆగమకములగు సాధనము లందు కూడా పరస్పరము గమ్యగమక భావము ఉండవచ్చు. లౌకిక పర్యాయంలో, విద్యాశాఖలో ఉన్నత గమ్యం పి. హెచ్. డి. అను కుంటే ఈ స్థాయి గమ్యానికి గమకములు 1వ తరగతి నుండి మొదలై చివరి గమ్యం వరకు ఉంటాయి. గమ్యాన్ని చేరడంలో వచ్చే క్లాసులన్నీ గమకాలే అయినా, ఒకటవ క్లాసుకు రెండవ క్లాసు గమ్యము మూడవ క్లాసు గమ్యము, రెండవ క్లాసు గమకము. ఇట్లు పరస్పర గమ్యగమక భావమువెట్లు మారుచున్నవో, అట్లే పరమ గమ్యమై సర్వసమ్మతమై ఉన్న నిత్యానంద కేంద్రమునకు, శ్రుతి, స్మృతి ఆగమాదులలో చెప్పబడిన భిన్నభిన్న మార్గములు గమకములై, పరస్పరము గమ్య గమక భావము పొందుచూ, చిన్న నదులూ, పెద్ద నదులూ ఎట్లు పరమ గమ్యమైన సముద్రమున కలియుచున్నవో, అవి అన్నీ మార్గ భేదాలైనా, పరతత్వాన్ని చేరుస్తాయని శ్రీ గురువులు నొక్కి చెప్పుచున్నారు.

ఇట్లు అభ్యాసములో ముందు తరగతులు (క్లాసు) వెనుకటి తరగతులలో గమ్యములని, ఏక్లాసుకు (తరగతి) తగిన అధికారి (అభ్యాసి) కి ఆక్లాసే పరమశ్రేష్టమని తమ శిష్యులకు, పైతరగతులకు చేరు యోగ్యతను కలుగ జేయుటకు, దయామయులగు వ్యాసపరాశరాది గురువులు పైవిధముగ అధికారి తారతమ్యతపాటించడం సంప్రదాయమే కాని, మతభేదమును గూర్చి కాదని శ్రీ గురువులు రమ్యముగా మతతత్త్వమును వివరించిరి.



శ్రీ గురుః జ్ఞాన భాస్కరః

# అధ్యాయము - 1

# యోగవిద్యలు

## ( అధ్యాత్మ విద్యాసాధన ప్రణాళిక )

### పరిచయం

"అధ్యాత్మ విద్యావిద్యానాం" అని శ్రీమద్భగవద్గీత విభూతి యోగంలో శ్రీకృష్ణ భగవానుడు ప్రకటించినాడు. అన్ని విద్యలలో అధ్యాత్మ విద్య తనస్వరూపంగా చెప్పుకొన్నాడు. కాబట్టి ఈ అధ్యాత్మ విద్యయే విద్యలలో సర్వోత్తమమనడం నిర్వివాదాంశము. సృష్టిలోని సమస్త జీవులకు ముఖ్యంగా మానవులకు పరమగమ్యం అఖండాద్వైత సచ్చిదానంద పరతత్త్వము ననుభవములోనికి తెచ్చుకొనడమే! అప్పుడే తాను నిత్యసుఖస్వరూపుడనని తెలుసుకోగలడు. లేకుంటే అశాశ్వతమైన దుఃఖాలయాన్ని, (జనన మరణరూప సంసారాన్ని) దాటలేడు. ఐహిక విషయసుఖాలు సుఖభ్రాంతిని కల్గిస్తాయే కాని సుఖాన్ని కల్గించలేవని తత్త్వవేత్తలు బోధిస్తున్నారు.

**శ్లో॥ అసారేఖలు సంసారే సుఖభ్రాంతి శరీరిణాం**
**లాలా పానమివాంగుష్ఠే బాలానాం క్షీరవిభ్రమః**

నిస్సారమైన ఈ సంసారంలో శరీరధారులకు సుఖభ్రాంతి, పసి పిల్లలు బొటన వ్రేలిని నోటిన ఉంచుకొని చప్పరిస్తూ పాలు తాగుతామను కొన్నట్లుంది కాబట్టి పరమ గమ్యాన్ని చేరేందుకు ప్రయత్నించినపుడే మానవ జన్మ ధన్యమైతుంది. అమృత రూప జ్ఞానాన్ని పొందడమే మానవ జీవితానికి కృతార్థత. ఈ జ్ఞానాన్ని పొందేందుకు ఎన్నో ప్రతిబంధ కాలున్నాయి. అనేక జన్మలనుండి చేరిన కర్మ సంస్కారాలు జీవుని కప్పివేసి కలవర పరుస్తున్నాయి. శాస్త్రీయ పరిభాషలో వీటిని ఆవరణ విక్షేపములు అంటారు. భగవద్గీతలో రెండురకాలైన పద్ధతులు ఉపదేశింపబడినాయి.

### 1. జ్ఞానయోగము 2. కర్మయోగము.

వెనుకటి జన్మలలో ఉత్తమ సంస్కారాన్ని పొందివచ్చిన వారుమాత్రమే జ్ఞానయోగానికి అర్హులు. ఇటువంటి వారు చాలాచాలా తక్కువ. అందుకే భగవానుడు అర్జునునికి కర్మయోగమందే అధికారం ఉందన్నాడు.

జనకాదులింతా కర్మ యోగంలోనే సిద్ధి పొందినారని పేర్కొన్నాడు. కాబట్టి దాదాపు అందరూ అభ్యాస యోగానికే అర్హులు. జ్ఞాన యోగానికి కాదని స్పష్టమౌతుంది.

శ్లో॥ అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచింతయన్

తా: అర్జునా! అభ్యాసయోగి ఏకాగ్రచిత్తంతో భగవత్తత్వాన్ని ధ్యానిస్తూ, పరమపురుషునిలో ఐక్యం చెందుతున్నాడు.

**సారాంశము :–** అధ్యాత్మవిద్యకు అభ్యాసయోగమే ప్రధాన సాధనం. ఏకాగ్రత అలవర్చుకోవడమే అభ్యాసం. శ్రీగురువులు సచ్చిదానంద సరస్వతీ స్వామివారు అధ్యాత్మ వస్తుసందర్శనాలు చేయించి, బాహ్యాంతర ప్రకృతిని స్వాధీనంచేసుకోగలే మహోత్తరమైన, అనన్యసామాన్యమైన, అవితరసాధ్యమైన, అభ్యాసయోగదర్శన ప్రణాళికను ఉద్ధరించి ప్రచారం చేసినారు. ఎంతోమంది సాధక శిష్యులకు అనుభవానికి తెచ్చినారు.

ఈ దర్శనాలలో పొందే సిద్ధులు, మహిమలు ఉత్తమమైన అభ్యాసనిష్ఠగల వారికే లభిస్తాయి. ఆసిద్ధులు లభించినప్పుడు వాటియందు వ్యామోహంతో వాటిని అల్ప ప్రయోజనాలకు స్వార్థపరత్వానికి, ఉపయోగిస్తే పతనం తప్పదని శ్రీగురువులు, పూర్వయోగాచార్యులు హెచ్చరిస్తున్నారు.

**సూచన :** సామాన్యసాధకులకు కొంత పరిపాకం కల్గినంతనే దర్శనాలు మాత్రము కావడంలో సందేహం లేదు. కాబట్టి ఈయోగ దర్శనసాధకులు పైసంగతులు గుర్తుంచుకొని యోగసిద్ధులను స్వార్థలాభాలకు ధనార్జనకు వినియోగించరాదు. లోక కల్యాణానికి నిస్వార్థంగా ఉపయోగించవచ్చు.

సాధకులు దర్శనాభ్యాసాన్ని ప్రారంభించడానికి ముందు ఈ అధ్యాత్మ విద్యాసాధన ప్రణాళిక ను శ్రద్ధగా పఠించి అందలి భావాలను హృదయంలో నిల్పుకొని మననం చేసుకోవడం చాలాముఖ్యమని సూచిస్తున్నాం.

## 1. త్రాటకాభ్యాసము–(ప్రథమస్థితి)

అధ్యాత్మ విద్యాసాధనలో ముఖ్యమైన ఏకాగ్రతాభ్యాస సాధనకు ప్ర ప్రథమంగా త్రాటకము అభ్యాసం చేయాల్సి ఉంటుంది. ఈ త్రాటకము హఠయోగవిధానంలో చెప్పబడినప్పటికీ, సాధన విధానములు రాజయోగ

సాధన పద్ధతికి అనుకూలంగా సాధకుల సౌకర్యం కోసం కొన్ని మార్పులను చేసి శ్రీగురుదేవులు ఈ ప్రణాళికలో చేర్చినారు.

**అభ్యాసవిధానము:**– ఒక తెల్లని గట్టికార్డుమీద మధ్యలో ఒక చిన్న ఎర్రని చుక్కను (●) (ప్రక్కన చూపిన సైజుకన్నా మించరాదు.) పెట్టి, ఆ కార్డును కను బొమ్మ మధ్యనుండి సుమారు 9,10 అంగుళాల దూరంలో (తాను సమ దృష్టితో చూసేందుకు వీలయ్యేట్లుగా) అమర్చుకొని, వీలైనంతసేపు కదలకుండా కూర్చోడానికి తగిన స్థానంలో ఉండి, రెప్పవాల్చకుండా ఏకాగ్ర మనస్సుతో ఎర్ర చుక్కను చూస్తూండాలి. ఎర్ర చుక్క కన్పించడానికి తగినంతవెలుతురు మాత్రమే గదిలో ప్రసరించాలి. రాత్రివేళ జీరోబల్బు సరిపోవచ్చు. ఈవిధంగా కదలకుండా, రెప్పవాల్చకుండా, ఏకాగ్రచిత్తంతో చుక్కను చూసే అభ్యాసం కనీసం ఒకగంట వరకు చేయాల్సి ఉంటుంది. ఒకే సారి ఒక గంట చేయలేనివారు యథాశక్తి అభ్యాసం చేస్తూ, బాధకల్గినప్పుడు విశ్రాంతి తీసుకుంటూ సాధన కొనసాగించాలి. మళ్ళీమళ్ళీ అభ్యాసం చేస్తూపోతే కొన్నాళ్ళకు గంటసేపు సాధ్యమౌతుంది. అభ్యాస సమయంలో కన్నులు కొంత మంట, బాధ, నీళ్ళుకారడం నంటి వాటికి గురౌతాయి. అప్పుడు కుడి రెప్ప వాల్చక, అభ్యాసం చేస్తూపోతే కొన్నాళ్ళకు పైబాధలన్నీ తగ్గుతాయి. ఈవిధనం వల్ల కంటి దోషాలు తగ్గుతాయని వైద్యులు కూడా పేర్కొన్నారు. ఈవిధంగా అభ్యాసం చేస్తూపోతే, మనస్సు ఎర్రచుక్కపై ఏకాగ్రమైనప్పుడు క్రమంగా ఎర్రచుక్క మాయమై, దాని స్థానంలో నక్షత్రం వంటివెలుగు కన్పిస్తుంది. ఏకాగ్రత తగ్గినా, దృష్టిచెదరినా ఆవెలుగు కన్పించదు. ఎర్రచుక్కే కన్పిస్తుంది. దీన్నిబట్టిమనం అర్థం చేసుకోవాల్సిన మూలసూత్రం ఒకటి ఉంది. స్థూలప్రపంచంలో ఉన్న ఎర్రచుక్క కు సూక్ష్మప్రపంచ రూపమైన తేజోరూపమే ఆధారం. అదే సత్యం. బాహ్య ప్రపంచంలోని ఏ వస్తువైనా ఏకాగ్రదృష్టితో చూచి నప్పుడు తేజోమయంగనే కన్పిస్తుందని ఋజువైంది. దీన్నిబట్టి స్థూలప్రపంచానికాధారం సూక్ష్మప్రపంచమే అనడం స్పష్టము. దీన్నిమనం ముందుమన మనస్సులో నిర్ధారణ చేసుకోవడం అవసరం. ఈ అభ్యాసము పారమార్థిక వ్యవహారానికి ముఖ్యమైనది. ఈ జ్యోతిస్సు నిల్చి కుంటేే మనకు జాగ్రదవస్థలో సూక్ష్మ ప్రపంచంలోనికి ప్రవేశం లభించదు అని తెలుస్తుంది.

## అభ్యాసికి కొన్ని జాగ్రత్తలు:

ఎఱ్ఱచుక్కపై అభ్యాసం చేయగా, చేయగా క్రమంగా ఎఱ్ఱచుక్క కనిపించకుండా పోయి, వారి వారి చిత్త వృత్తి పరిపాకం బట్టి మొదట వెన్నల వంటి వెలుగు, క్రమంగా నక్షత్రం వంటి వెలుగు కనిపిస్తుంది. ఏకాగ్రత తగ్గినా, దృష్టిచెదిరినా ఆవెలుగు లేక జ్యోతి కనిపించక ఎర్ర చుక్క కనిపిస్తుంది. ఒక గంట వరకు ఆజ్యోతిను నిలకడగా ఉండే స్థితి పొందే వరకు సాధన చేయవలసి ఉంటుంది. ఈ సాధనలో మనస్సును ఏకాగ్రం చేయడంలోనే నిష్ఠ, శ్రద్ధ అవసరం. అంతే కాని త్వరగా జ్యోతిస్సును దర్శించాలనే తహ తహ ఉండ రాదు. ఇది మనస్సును కలవర పరుస్తుంది. అట్టి స్థితిలో ఏకాగ్రం చేయడం సాధ్యం కాదు. తగిన ఏకాగ్ర స్థితి కలిగితే జ్యోతిస్సు దర్శనము తప్పక అవుతుంది. కాబట్టి మన ప్రయత్నం అంతా మనస్సును ఏకాగ్రం చేయడానికి తగిన అనుకూల స్థితిని కలిగించడానికే ఉండడం మంచిది.

*సమీక్ష : ఒక గంట వరకు నిలకడగా జ్యోతిస్సు ఉంటే అభ్యాసం చక్కగా సాగుతున్నట్లు భావించవచ్చును ఈస్థితిని క్రమంగా ఒక గంట నుంచి రెండు గంటల వరకు (జ్యోతిస్సు స్థిరంగా ఉండేవరకు) అభివృద్ధి చేయాల్సి ఉంటుంది.*

ఈ అభ్యాసము దాని ఫలితమైన జ్యోతిర్దర్శనము వలన మనము ఒక ముఖ్య విషయాన్ని గమనించవచ్చు. మనస్సు, దృష్టి పూర్తిగా ఏకాగ్రమైనప్పుడు ఎఱ్ఱ చుక్క కనిపించక జ్యోతిస్సు కనిపించడాన్ని బట్టి స్థూలజగత్తు నుండి సూక్ష్మ జగత్తులో ప్రవేశించడం ప్రారంభం అయినదని తెలుస్తుంది. ప్రతి స్థూల దేహానికి చుట్టూ పన్నెండు అంగుళముల వ్యాసం (ఒక అడుగు) బైట సూక్ష్మ శరీరం వ్యాపించి ఉన్నదని యోగశాస్త్రం చెపుతుంది. త్రాటకాభ్యాసం ద్వారా స్థూల నుండి సూక్ష్మానికి ప్రవేశించడం అనుభవానికి వస్తుంది.

## త్రాటకాభ్యాసము-ద్వితీయస్థితి :

ఒక గంటసేపు జ్యోతిస్సు నిశ్చలంగా నిల్పగల్గిన సాధకుడు చీకటిలో కూర్చొని, ఎఱ్ఱచుక్క అవసరం లేకుండ సాధన లేకుండ ఇది వరలో తాను పొందిన అనుభవాన్ని ఆధారం చేసుకొని అదే సమదృష్టితో అదే దూరం నుండి ఏకాగ్రం చేసిన వెంటనే జ్యోతిస్సు దర్శనం అవుతుంది. ఇది త్రాటకా భ్యాసములో ద్వితీయ స్థితి ఆజ్యోతిస్సు నిశ్చలంగా ఉండేట్లు రెండు గంటల వరకు సాధించ గలిగితే అది ఉత్తమ స్థాయిని అందుకొన్నట్లు గుర్తు. దీనికి ప్రమాణంగా హఠయోగప్రదీపకలోని క్రింది శ్లోకాన్ని ఉటంకించవచ్చు.

శ్లో: "ఈక్షతే నిశ్చల దృశా సూక్ష్మలక్ష్యం సమాహితః
అశ్రుసంపాత పర్యంతం ఆచార్యైహి త్రాటకంమతం
ఏతన్మనో మారుతలయ సాధనం భయతా భవేత్
దృగ్యుగ్మం లీయతే యత్ర మనస్తత్రైవ లీయతే
దృఙ్మనో లీయతే యత్ర మారుత స్తత్రలీయతే"

"త్రాటాభ్యాస వధిం విధ్యాధి కారణం చాహ. దర్శనం జ్యోతిషో యావత్ తావత్ త్రాటకం అభ్యాసేత్ విధ్యాధికారీ భవతి! తతః శ్రీగురు భక్తిమాన్ శ్రీగురూక్తి ప్రకారేణా సమాహిత మనోభవన్ అభ్యాసే త్రాటకం సమ్యక్ జ్యోతిషో దర్శనావధిః"

ఈత్రాటకాభ్యాసము వల్ల మనస్సు ప్రశాంతస్థితికి వచ్చినట్లు అభ్యాసికి అనుభవం అవుతుంది. విధ్యార్థులకు తమ విద్యావిషయాలలో సూక్ష్మ గ్రహణాశక్తి ధారణ శక్తి పెంపొందుతాయి. పాఠ్యాంశాలు చక్కగా గ్రహించే శక్తి లభిస్తుంది. కుబేరుడు ఈ అభ్యాసాన్ని సాధించి సిద్ధి పొందినాడని ఐతిహ్యము.

## అభ్యాసానికి ముందు చేయువలసిన ధ్యానం

అభ్యాసకుడు ఆస్తరణము (ఆసనము) నందు కూర్చొని క్రింది ప్రార్థన శ్లోకాలను పఠించి శ్రీగురువులను మనస్సు లో ధ్యానించి అభ్యాసాన్ని ప్రారంభించవలె.

**1) శ్రీగురు గణపతి వాణీ హయకంధర దక్షిణాశ్యానాం**
**చరణ స్మరణం అవిద్యా హరణే కారణం ముపరాస్తు సచ్చరణం.**

**2) గురుబ్రహ్మ గురు విష్ణుః గురు ర్దేవో మహేశ్వరః**
**గురుస్సాక్షాత్ పరబ్రహ్మ తస్మైశ్రీగురవేనమః.**

**3) సదాశివ సమారంభం శంకరాచార్య మధ్యమాః**
**అస్మదాచార్య పర్యంతాం నందే గురు పరంపరాం.**

**4) శ్రీనివాసం శ్రీనికేతం శీఘ్రసిద్ధి దమాశ్రయే**
**స్వయం జ్యోతి స్సుధా సింధో సాధు సద్గురుశేఖరం.**

**5) శివసచ్చిదానంద శివ సచ్చిదానంద**
**శివ సచ్చిదానంద శివముకుందా పాహి.**

అభ్యాసకుడు పైశ్లోకాలను పఠించి ఈ అభ్యాసము తనకు తన పరిసరాలకు శాంతిని కళ్యాణాన్ని సమకూరుస్తుందని భావించి అభ్యాసాన్ని ప్రారంభించవలె.

## 2. దక్షిణామూర్తి విద్య

త్రాటకాభ్యాసంలో జ్యోతిస్సు స్థిరపడిన అభ్యాసి తన నాసాగ్రంపై (ముక్కు కొనపై) దృష్టిని ఏకాగ్రం చేస్తే అక్కడ ఒక జ్యోతిర్బిందువు దర్శనం ఇస్తుంది. దీనినే దక్షిణామూర్తి విద్య అంటారు. పరమేశ్వరుడు జ్ఞానోపదేశం చేసేందుకు దక్షిణామూర్తి అవతారం అవతరించినాడు. దక్షిణం అంటే జ్ఞానం అని ఉపనిషత్ చెప్పుతుంది. అజ్ఞానమే ఆకారంగా అవతరించిన దేవుడు దక్షిణామూర్తి. వారు ఉపదేశించిన విద్య కావడం వల్ల దీనికి ఆపేరు వచ్చింది.

ఎక్కడ రెండు కన్నుల చూపు ఒకే చోట చేరుతుందో అక్కడ మనస్సు ఏకాగ్రం అవుతుంది. సాధకునికి ప్రారంభంలో ఈ విధంగా రెండుకన్నుల చూపును ఒకే చోట చేర్చడానికి యోగ్యమైన చోటు నాసాగ్రమే. అందుకే భగవద్గీతలో కూడా " సంప్రేక్ష నాసికాగ్రం స్వమ్ " అని చెప్పబడింది. ఈవిద్యలో రెండు గంటలసేపు జ్యోతిస్సు కదలకుండ స్థిరంగా ఉండేట్లు ఏకాగ్రతతో అభ్యాసం చేస్తే దాన్ని ఒక "ధారణ" అని యోగాచారులు పేర్కొన్నారు. ఇటువంటి ధారణలు వరుసగా **40** కి తక్కువ కాకుండా **60** వరకు చేస్తే ఈ విద్యలో ఉత్తీర్ణత కలిగి మనస్సు చాలా ప్రశాంతతనొందినట్లు అనుభవం అవుతుంది. దేహమంతా చల్లని హాయిగొల్పే స్థితిని అభ్యాసి అనుభవిస్తాడు. తీవ్రమైన ఎండ వేడి వాతావరణంలో కూడ చల్లదనాన్ని అనుభవించవచ్చు. ఆధునిక పరిభాషలో చెప్పాలంటే అభ్యాసి తనకు తానే ఏయిర్ కూలర్(A.C.) గా మారి నాడనవచ్చు. ఆధ్యాత్మిక విద్యలను అభ్యసించే వాడికి ఈ దక్షిణామూర్తి విద్య పునాది వంటిది. దీనిగురించి శాండిల్య ఉపనిషత్‌లో ఈ విధంగా చెప్పబడింది.

"అర్థోన్మలిత లోచన స్థిరమనో: నాసాగ్ర దత్తేక్షణః
చంద్రార్కా వపి లీనతా మువనయన్ నిష్పంద భావోత్తరం
జ్యోతీ రూప మశేష బాహ్య రహితః దేదీప్య మానం పరం
తత్త్వంతత్ పరమస్తి వస్తు విషయం శాడిల్యవిద్ధీహతత్.॥"

### ఏతత్ ఫలం

మూహర్తమపియోనిత్యం నాసాగ్రే మనసా సహా
సర్వం తరతి పాప్మానమ్ తస్య జన్మ శతార్జితం.

## 3. దత్తాత్రేయ విద్య

నాసికా మధ్య మార్గమందు (ముక్కు దిమ్మ) దృష్టినేకాగ్రం చేస్తే దక్షిణామూర్తి విద్యలోని జ్యోతిరూపమైన ఒక బిందువు అభ్యాసికి దర్శనం ఇస్తుంది. ఇదే దత్తాత్రేయ విద్య. దీన్ని అభ్యాసం చేయడం వల్ల అభ్యాసి మనస్సును ఎక్కడ ఏకాగ్రం చేయాలనుకుంటే అక్కడ ఏకాగ్రం చేయడానికి వీల అవుతుంది. అంటే మనస్సుపై అధికారం సంపాదించేందుకు ఈ విద్య ఎంతో సహకరిస్తుంది. ఈవిద్యను అభ్యసించే వారికి మనస్సు ప్రశాంత తను పొందడం దక్షిణా మూర్తి విద్యలో కన్న విశేషంగా అనుభవానికి వస్తుంది.

## 4. మండల విద్య

"బహిర్లక్ష్యంతు నాసాగ్రే చతుష్షడష్టదశ ద్వాశాంగులీభిః క్రమాత్ నీలద్యుతి శ్యామత్వ సదృగ్రక్త భంగి స్ఫురత్ పీత వర్ణ ద్వయోపేతంవ్యోమత్వం పశ్యతి సతుయోగీ" మండల బ్రాహ్మణోపనిషత్

మనస్థూలశరీరాన్ని దాటి చుట్టూ 12 అంగుళాల వ్యాసం వరకు సూక్ష్మ శరీరం వ్యాపించి ఉంది. ఆతేజశ్శరీరంలోని సూక్ష్మపంచభూతాలు మండలాలుగా ఉన్నాయి. వానిని దర్శించడమే మండలవిద్య అంతేకాక అభ్యాసకుడు తనలక్ష్యాన్ని అంతరాళంలో ఎక్కడకావాలో, అక్కడినుండి దర్శనం చేసేందుకు కూడా సహాయకారిగా ఉండేందుకు కూడా ఈవిద్య నిర్దేశించబడింది.

### విద్యావిధానం :

నాసాగ్రం నుండి నాలుగు అంగుళాల దూరంలో లక్ష్యాన్ని నిలిపి ఏకాగ్రతతో చూస్తే ఆకాశమండలం నీలవర్ణంతో దర్శనమిస్తుంది. ఆకాశ మండలా భ్యాసంలో సాధకునికి ఎంతో ప్రశాంతత అనుభవానికి వస్తుంది.

నాసాగ్రం నుండి ఆరుఅంగుళాల దూరంలో లక్ష్యాన్ని నిలిపి ఏకాగ్రతతో చూస్తే వాయుమండలం ఊదారంగులో దర్శనమిస్తుంది. వాయుమండలా భ్యాసంలో సాధకునికి ఊపినట్లుగా కదలిక అనుభవానికి వస్తుంది. నాసాగ్రం నుండి 8 అంగుళాల దూరంలో లక్ష్యాన్ని నిలిపి ఏకాగ్రతతో చూస్తే అగ్ని మండలం ఎర్రని రంగులో దర్శనం ఇస్తుంది. ఈ అగ్ని మండలాభ్యాసంలో సాధకునికి దేహం వేడిగా ఉన్నట్లు అనుభవమగును.

నాసాగ్రమునుండి పది అంగుళముల దూరములో లక్ష్యమును నిలిపి ఏకాగ్రతతో చూచిన జలమండలము తెల్లని రంగులో దర్శనము అగును.

జలమండలాభ్యాసములో సాధకునికి తనదేహమును నీటివలన కలిగెడి చల్లదనం అనుభవమగును.

నాసాగ్రము నుండి పన్నెండు అంగుళముల దూరములో లక్ష్యమును నిలిపి ఏకాగ్రతలో చూసిన పృథ్వీమండలము పసుపు పచ్చని రంగులో దర్శనమవుతుంది. పృథ్వీమండల అభ్యాసముతో సాధకునికి తన దేహము పటిష్టంగా అనగా గట్టి తనం పొందినట్లు అనుభవ మగును.

ఈమండల విద్యలలో దృఢత రాభ్యాసము చేసిన సాధకుడు యోగియని చెప్పబడుచున్నాడు. మరియు మున్ముందు జరుపు బోవు విధ్యాసాధనలకు స్థూల దేహమున కలుగు తాకిడులను సహించ కలుగు శక్తి సామర్థ్యములను పొందగలడు.

వివరణ:- అమిత మగు క్లేశములతో వ్యాకులమైన స్థితిలో ఆకాశ మండలములో సాధకుడు నిలిచిన తక్షణమే ప్రశాంతతను పొందును. గాలి ఏమీ ప్రసరించని స్థితిలో వాయుమండలంపై ఏకాగ్రం చేస్తే సాధకునికి కావలసిన గాలి లభిస్తుంది. అతి శీతల ప్రదేశాలలో, మంచు కొండల్లో శరీరానికి శైత్యం (చలి, బాధ) కలిగి నప్పుడు సాధకుడు అగ్నిమండలాన్ని ఏకాగ్రం చేస్తే శరీరానికి శైత్య బాధ తొలగు తుంది. అమితమైన వేడి, ఎండ, వాతావరణంలో సాధకుడు జలమండల స్థితిలో ఉంటే శరీరానికి చల్లదనం కలిగి ఉష్ణబాధ తొలుగుతుంది. శారీరక శ్రమ అనారోగ్యము వంటి కారణాలతో పుష్టి బలం తగ్గినప్పుడు పృథ్వీ మండల స్థితిని సాధకుడు పొందితే సంపూర్ణమైన ఆరోగ్యం తేజస్సు బలం పొంద గలడు.

## 5. భూచరీ విద్య

మండల విద్యలో సాధకుడు స్థూల భూతముల వత్తిడి లేకుండా స్వతంత్రుడై నిలచి ముందు ముందు యోగ సాధన కొనసాగించడానికి కావలసిన శరీర పాటవాన్ని పొందినప్పటికిని పిశాచాదుల వల్ల సంభవించే విఘ్నాలనుండి రక్షణ పొందడానికి గమ్యాన్ని సాధించేందుకు గురువులు ఈ భూచరీ విద్యను ఉపదేశించారు. ఇది ముద్రాష్టకంలో ఒకటి.

శ్లో॥ పూర్వోక్తా సనమాస్థాయ దృష్టింనాసాగ్ర మార్గతః
భూమ్యాం మూహూర్తం సంస్థాప్యపశ్యేత్‌జ్వాలారుచం తతః ॥

సాధకుడు పూర్వోక్త విధానంతో కూర్చుండి తన నాసాగ్రమార్గం నుండి తన పాదం చివరి భాగం నందు లక్ష్యం నిలిపి చూచి నప్పుడు ఒక జ్యోతిస్సు జ్వాలగా దర్శనము యిస్తుంది. ఆ జ్వాల తన స్థూల దేహాన్ని చుట్టి ఉంటుంది. దీని వలన పైన తెలిపిన భూతపిశాచాదులు భయపడి దూరం తొలగి పోతాయి. మహన్యాసములో ఆత్మ రక్షా విధానానికి ముందు షోడశాంగ రౌద్రీకరణ విభాగం లో ఈ వాక్యలను గ్రహిస్తే మనకు ఈ భూచరీ విధానప్రభావం అర్థమవు తుంది.

"త్వగస్థిగతైస్సర్వపాపైః ప్రముచ్యతే సర్వభూతే ష్వపరాజితోభవతి
తతో భూతప్రేతపిశాచ బ్రహ్మ రాక్షస యక్ష యమదూత
శాకినీఢాకినీ సర్ప శ్వాపద తస్కర జ్వరాద్యుపద్రవ
జోప ఘూతాః సర్వే జ్వలంతం మాంపశ్యన్తు! మాం రక్షన్తు!"

తా. ఇందువలన సర్వపాపాలు సాధకుని విడిచి పోతాయి. సాధకుడు పంచ భూతాలకు లోబడడు. భూత, ప్రేత, పిశాచ, బ్రహ్మరాక్షస, యక్ష శాకినీ, ఢాకిని, సర్ప, శ్వాపాద, తస్కర, జ్వరాలు మొదలైన ఉపద్రవాల వలన కలిగే ఉప ఘూతాలు జ్వాల మాలికలచే నన్ను చూచి బెదరిపోవు గాక! వాటి నుండి నన్ను రక్షించు గాక! ఇంత వరకు పేర్కొన్న విద్యలలో వరుసగా దక్షిణామూర్తి విద్యచే సర్వ పాపమివెూచనం, మండల విద్యచే పంచ భూతముల నుండి భాధను పొందకుండడం, భూచరీ విధ్యచే జ్వాల మాల రక్షా విధి నంటి సిద్ధుల క్రమం కనిపిస్తుంది. ఈ భూచరీ విధ్యా విధానం "అభయా" అనే దైవీ గుణం దీన్ని సాధకుడు పొందగలిగి నప్పుడు నిర్భీకుడె పురోగమునాన్ని పొందుతాడు.

## 6. స్థూల భూత విద్య

స్థూల పంచ భూతములు మానవ స్థూల శరీరంలో ప్రత్యేకంగా ఒక్కొక్కటి ఒక్కొక్క అవయవ భాగంలో ఉన్నాయి.

**1. పృథ్వీ భూతం( భూమి) :-** సాధకుడు తన పాదముల నుండి మోకాళ్ళ వరకు ఉండే భాగంలో లక్ష్యముంచితే పృథ్వీ భూతం దర్శనమిస్తుంది. ఇది దీర్ఘచతురస్రాకారంలో పసుపు రంగులో ఉంటుంది. దానిలో "లం" అనే బీజాక్షరం ఉంటుంది. దానిలోని అనుస్వారం(సున్న) లో చతుర్ముఖబ్రహ్మ దర్శనమిస్తాడు.

ఈ పృథ్వీ భూత దర్శనం చేసిన సాధకుడు పరిపూర్ణత సాధిస్తే పరిమళాన్ని తాను అనుభవించడమే కాక, ఇతరులకు కూడా అనుభవానికి తెస్తాడు. తన దేహానికీ, ఇతర దేహాలకూ, వస్తువులకూ పటుత్వాన్ని కల్గించ గలడు.

**2. జలభూతం(నీరు) :-** సాధకుడు తన మోకాళ్ళ నుండి నాభి వరకు ఉండే ప్రదేశంలో సమాహితం చేస్తే అర్థ చంద్రాకారంలో తెల్లని వర్ణంతో జల భూతం దర్శనమిస్తుంది. దానిలో "వం" అనే బీజాక్షరం కనిపిస్తుంది. దాని అనుస్వార స్థానంలో (శ్రీ) విష్ణుమూర్తి కనిపిస్తాడు. సాధకుడు పరిపాకం చెంది స్థితిలో నీటి వలన కలిగే చల్ల దనాన్ని అనుభవిస్తాడు. పరిపూర్ణ స్థితిలో కావలసినంత జలాన్ని సృష్టించ గలడు.

**3. తేజో భూతం (అగ్ని) :-** సాధకుడు తన నాభి నుండి హృదయం వరకు ఉన్న ప్రదేశంలో లక్ష్యం ఉంచి సమాహింతం చేస్తే త్రికోణాకారంలో ఎర్రని రంగుతో తేజోభూతం దర్శనమిస్తుంది. ఇందులో "రం" అనే బీజాక్షరం ఉంటుంది. దాని అనుస్వారంలో రుద్రుడు దర్శనమిస్తాడు. ఈ సాధనలో అభ్యాసికి తన దేహంలో ఉష్ణం పెరిగిన అనుభూతి కల్గుతుంది. పరిపూర్ణ స్థితిలో ఇతర శరీరాలలో ఉష్ణాన్ని పెంచడం అగ్నిని సృష్టించడం వంటి సిద్ధులు పొందుతారు.

**4. వాయు భూతం(గాలి) :-** సాధకుడు తన హృదయం నుండి భ్రూ మధ్యం (కనుబొమ్మల మధ్యప్రదేశం) వరకు ఉండే ప్రాంతంలో ఏకాగ్రం చేసినప్పుడు షట్కోణాకారం కల్గి ధూమ్రవ వర్ణంతో వాయు భూతం కనిపిస్తుంది. అందులో "యం" అనే బీజాక్షరం, దాని అనుస్వారంలో ఈశ్వరుడు దర్శనమిస్తాడు.

అభ్యాసికి సాధనలో తన దేహం గాలిచే కదిలింప బడినట్లు అనుభవం కల్గుతుంది. ఉత్తమస్థితి పొందిన సాధకుడు గాలిని సృష్టించి, వస్తువులను, వ్యక్తులను దూరంగా విసరివేయగలడు. కదిలించగలడు.

**5. ఆకాశ భూతం(ఆకాశము) :-** భ్రూమధ్యం నుండి శిరస్సు పై భాగం (బ్రహ్మరంధ్రం) వరకు గల ప్రాంతంలో సాధకుడు సమాహితం చేస్తే, వర్తులాకారంలో(గుండ్రంగా) స్వచ్ఛమైన నీల వర్ణంతో ఆకాశ భూతం కనిపిస్తుంది. అందులో "హం" అనే బీజాక్షరం, దానిఅను స్వారంలో సదాశివుడు దర్శనమిస్తాడు. సాధకునికి ఈ సాధనలో ఎన్నడూ పొందని

ప్రశాంతత అనుభవానికి వస్తుంది. పరిపూర్ణ స్థితిలో సాధకుడు ఇతరులకు కూడా మానసికాందోళనను తగ్గించి ప్రశాంతతను ప్రసాదించగలడు.

ముఖ్యగమనిక :- ఈ స్థూల భూతములను సృష్టింప గలిగే శక్తి ముందు తెలుప బోయే మూర్ధ్ని జ్యోతిర్విద్య లో సిద్ధిపొందిన మహాయోగికి మాత్రమే కలుగుతుంది సామాన్య సాధకులకు ఆయా భూతలక్షణాలైన గంధాదులు మాత్రమే అనుభవానికి వస్తాయని తెలుసుకోవలసి ఉంటుంది.

## 7. మూర్ధ్ని జ్యోతిర్విద్య :-

శిరోమధ్య భాగంపై (నడినెత్తి మీద) ద్వాదశాంగుళ పరిమాణంతో మూర్ధ్ని జ్యోతిస్సు ఉంది. సాధకుడు దీన్ని దర్శించి సమాహితం చేస్తే, తన శరీరంలోని వాయువులు క్రింది నుండి పైకి ప్రసరిస్తున్నట్లు అనుభూతి పొందగలడు. దీని వల్ల నాడీ స్పందన తగ్గిపోతుంది. మనోవృత్తి ఈ మూర్ధ్ని జ్యోతిస్సును దాటి బైట సంచరించేటప్పుడు అత్యంత సుఖానుభూతి కలిగి ఆనందావిర్భావం కలుగుతుంది.

పంచభూతాల పంచీకరణ విధానంతో ఈ సృష్టి జరిగింది. ఈ భూతాలను స్వతః సృష్టి చేయగలిగే శక్తి ఈ విద్య లో పరిపూర్ణుడైన సాధకునికి వశమైతుంది. దీన్నిబట్టి భౌతికజగత్తుదాటి పై స్థితిలో ఉన్నప్పుడే సృష్టిచేయగలిగే శక్తి లభిస్తుందని తెలుసుకోగలం.

## 8. సప్తధాతు విద్య :-

మన శరీరం 7 ధాతువులతో నిర్మించబడింది. ఈ విద్యలో ఒక్కొక్కధాతువుపై లక్ష్యం వుంచి సమాహితం చేస్తే సాధకుడు అన్ని ధాతువులకు పుష్టిని చేకూర్చగలడు.

**1. చర్మం :-** ఈ ధాతువు పసుపు పచ్చని వర్ణంతో కనిపిస్తుంది. **"యం"** అనే బీజాక్షరం ఉంటుంది. ఈ ధాతువు అధిష్ఠాన దేవత ఒక శిరస్సుతో దర్శనమిస్తుంది. ఈ విద్యలో ఉత్తమ స్థితిని సాధించిన సాధకుడు చర్మ రోగాలను నివారించగలడు.

**2. రక్తం :-** ఈ ధాతువు నందు లక్ష్యం ఉంచి ఏకాగ్రం చేస్తే ఎరుపు రంగుతో కనిపిస్తుంది. బీజాక్షరం " రం" అధిష్ఠాన దేవత రెండు శిరస్సులతో దర్శనమిస్తుంది. ఈమె ఆహారం గుడాన్నం. ఈ ఉపాసనలో ఉత్తమ స్థాయి

పొందిన సాధకుడు రక్తగత వ్యాధులను నివారింపగలడు.

**3. మాంసం :-** ఈ ధాతువుపై ఏకాగ్రం చేస్తే గోధుమ వర్ణంతో కనిపిస్తుంది. దీని బీజాక్షరం " లం " అధిష్టాన దేవత మూడు శిరస్సులతో దర్శనమిస్తుంది. సాధకుడు ఉత్తమ స్థాయిని పొందినప్పుడు మాంసగత రోగాలను నయం చేయగలడు.

**4. మేదస్సు :-** ఈ ధాతువు ఊదా రంగులో ఉంటుంది. బీజాక్షరం " వం" అధిష్ఠాన దేవత నాలుగు శిరస్సులతో కనిపిస్తుంది. ఈ విద్యలో పరిపూర్ణుడైన సాధకుడు మేదోధాతువునకు సంబంధించిన రోగాలను నయం చేయగలడు.

**5. అస్థి (ఎముక) :-** ఈ ధాతువు పై సమాహితం పొందితే తెల్లని రంగుతో ధాతువు దర్శనమిస్తుంది. బీజాక్షరం " శం" అధిష్ఠాన దేవత ఐదు శిరస్సులతో దర్శనమిస్తుంది. సాధకుడు అస్థిగత వ్యాధులను నివారణ చేయగలడు.

**6. మజ్జ : -** ఈ ధాతువు ఎముకలలోపల ఉంటుంది. వర్ణం బూడిద రంగు. బీజాక్షరం " షం " అధిష్ఠాన దేవత ఆరు శిరస్సులతో కనిపిస్తుంది. ఉత్తీర్ణుడైన సాధకుడు ఈ ధాతువునకు సంబంధించిన వ్యాధులను నయం చేయగలడు.

**7. శుక్లం : -** సమాహితం చేస్తే ఈధాతువు తెల్లని రంగుతో దర్శనమిస్తుంది. బీజాక్షరం " సం" అధిష్ఠాన దేవత సప్త శిరస్సులతో కనిపిస్తుంది. ఉత్తమ స్థితి పొందిన సాధకుడు శుక్ల ధాతువునకు సంబంధించిన వ్యాధులను నివారించ గలడు.

**సప్తధాతు విద్య - విశేష వివరణ**

ఈ సప్తధాతు విద్యను సాధించిన అభ్యాసి, దేహములోని అన్నిభాగాలు ఆయా దేవతలకు ఆధీనమై ఉన్నాయని తెలుసుకుంటాడు. దానితో పాటుపరమార్థము పొందడానికి గొప్ప ఆటంకమైన ఈదేహం తాను కానని తెలుసుకోగలడు. ఇదే ఈ విద్యద్వారా పొందగల్గే ముఖ్యప్రయోజనం. అంతే గాక యోగసాధనకు సాధనమైన శరీరంలోని లోటుపాట్లు వ్యాధులు సరిజేసు కొనేందుకు తగిన స్వతంత్రుడౌతాడు. ఇంకా పరిపాకం చెందినప్పుడు ఇతరులు

వ్యాధులను నిర్మూలించగలడు. ఆవిధంగా సర్వభూతహిత రతుడౌతున్నాడు. తద్వారా ఉత్తమ చిత్త సంస్కారాన్ని పొందగల్గుతున్నాడు. కాని ఇక్కడ శ్రీగురువుల హెచ్చరికను గుర్తుచేసుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది. కీర్తి ధనాదుల కోసం తన సాధనాశక్తి కేవలవ్యాధి నిర్మూలన కేంద్రంగా వినియోగిస్తే, సాధనలో పురోగతి లేకపోవడమే కాకుండా, యోగభ్రష్టుడై పతనం పొందుతాడు.

★★★

## అధ్యాయం – 2

# మహాభూత విద్య

## (షట్చక్రములు)

ఈ మహాభూత విద్య చాలా ఉత్తమ తరగతికి చెందినది. వెనుక పేర్కొన్న విద్యలల్లో నిష్ణాతుడై, ఏకాగ్రతలో పరిపాకం చెందిన వారికే సాధ్యము. ఈవిద్యలను గురించి "త్రిపుర తాపిన్యోపనిషత్" శ్రీ పుణ్యానందమునీంద్ర విరచిత "కామకళావిలాసం" శ్రీ గౌడపాదాచార్య కృతం "సుభగోదయం" వంటి గ్రంధాలలో వివరించ బడింది. "సీతారామాంజనేయ సంవాదం" అనే గ్రంధములో కూడా తెల్పబడింది.

ఈ విద్యలు జగత్సృష్టిస్థితి లయాలకు హేతుభూతములై, ఉండడం వల్ల యోగదర్శన విద్యలలో అతి ముఖ్య స్థానము పొందినాయి. శ్రీగురువులు ఈమహాభూతవిద్యను సాధకుడు ఎంతో ఉత్తమస్థాయి పొందిన తర్వాతనే ఉపదేశించెడివారు.

నేటికాలంలో ఈషట్చక్రాలను గురించిన వివరణలను కొందరు తమ ఉపన్యాసాలలో, రచనల్లో పరిచయంచేస్తున్నారు. కాని వాటిని క్రమపద్ధతిలో దర్శన విధానాన్ని ప్రకటించడం లేదు. అంతే కాక వెనుకటి విద్యలను గురించి తెల్పకుండా నేరుగా ఈ విద్యలను తెల్పడం ఎంత వరకు సమంజసం? సాధకునికి అయోమయాన్ని సృష్టించడమే కదా! వెనుకటి విద్యలను క్రమంగా సాధన చేసి ఉన్నత స్థాయిని అందిన అభ్యాసి మాత్రమే ఈ విద్యలను అభ్యసించడానికి అర్హుడు.

## విద్యా విశేష వివరణః-

శరీరం కల్గిన ప్రతి ప్రాణి వెన్నెముకకు రెండు వైపుల ఇడా-పింగళా అనే నాడులున్నాయి. ఆసనము క్రింది భాగమునుండి ఈనాడులు బయల్దేరి ఊర్ధ్వముగా శిరోభాగం వరకుంటాయి. ఈనాడుల మధ్యలో వెన్నెముక పొడవునా ఒకకాలువ వంటి ఖాళీప్రదేశం ఉంటుంది. దీనిని యోగుల భాషలో "సుషుమ్నానాడి" గా పిలుస్తారు. ఈకాలువ క్రింద చివరి భాగంలో కుండలినీ చక్రమున్నది. ఆకుండలినీ శక్తినే పరాశక్తిగా గ్రంధములలో వివరించినారు. ఆకుండలిని చుట్టుచుట్టుకొన్న పాము ఆకారములో ఉంటుంది. ఆశక్తిని ప్రభోధించి సుషుమ్న ద్వారమున ఊర్ధ్వముగా ప్రసరింప చేస్తే, యోగులు, మహాశక్తులను పొందగలరు. ఈకుండలినీ ప్రభోధాన్ని గురించి ఆంగ్లంలో Serpent Power అనే గ్రంధం ఎంతో సవివరంగా తెల్పబడింది.

వెన్నెముక పొడవునా వరుసగా శిరస్సు పైభాగం వరకు ఆరుచక్రాలున్నాయని తెల్సుకున్నాము. అవి కమలముల ఆకృతిలో ఉన్నాయి. అవివే షట్చక్రములు. వాటిలో పృథివ్యాది మహా భూతాలున్నాయి. క్రింది నుండి వరుసగా అవి మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆజ్ఞా అనే పేర్లతో వెలసి పృథ్వి మొదలైన మహాభూతములతో, అధిష్ఠాన దేవతా మూర్తులతో మాతృక బీజాక్షరములతో ఉన్నాయి. ఆజ్ఞా చక్రం పై సహస్రారచక్రము ఈ భూతముల పైన ఉన్న అవ్యక్త మహత్, అహం కార మనస్తత్వములనే పేర్లతో ఉండే శక్తులున్నాయి.

*గమనిక :- శ్రీవిద్యాపద్ధతిలో నున్న శ్రీచక్రములోని తొమ్మిదిచక్రములు ఈ ఆరు చక్రములలోనే సమన్వయించబడినాయి. శ్రీలలితా సహస్ర నామ స్తోత్రంలో విశుద్ధ చక్ర దర్శనం నుండి ఆయా అధిష్ఠాన దేవతలు వాటివివరాలు తెల్పబడినాయి. మాతృకా వర్ణములు "అ" కారాది క్రమంలో విశుద్ధ చక్రం నుండే ప్రారంభమవుతాయి. కాబట్టి ఇది యేసముచితపద్ధతిగా పేర్కొనవచ్చు. కామకళా విలాసంలో కూడా ఈక్రమమే చెప్పబడింది. కాని సాధకుల స్థితిని, పరిపాకాన్ని బట్టి మూలాధారచక్రం నుండి కూడా దర్శనం పొందే మరొక సంప్రదాయం కన్పిస్తుంది.*

## 1. విశుద్ధ చక్రం:-

కంఠ మూలంలో లక్ష్యముంచి, ఏకాగ్రంచేస్తే విశుద్ధచక్రం దర్శనమిస్తుంది. ఈచక్రం (కమలం) ధూమ్రవర్ణంలో ఉంటుంది. మధ్య భాగం కర్ణిక ఎర్రని

కింజల్కము(పుప్పొడి) లతో ఉండును. ఈకమలము 16(పదహారు) దళములు కల్గిఉండి ఒక్కొక్కదళముపై ఒక్కొక్క అచ్చు(స్వరము) బీజాక్షరాలు ఎర్రని రంగులో అనుస్వారంలో కూడి దర్శనమిస్తాయి. (అ నుండి అః వరకు) ఈకమలం మధ్యకర్ణిలో ఆకాశమండలం తెల్లని రంగుతో వర్తులాకారంలో (గుండ్రంగా) దర్శనమిస్తుంది. ఆకాశమండలంలో ఒకత్రికోణమండలం దానిలో పూర్ణచంద్రమండలం దర్శనమౌతాయి. ఆచంద్రమండలం మధ్యలో తెల్లని ఏనుగుపై ఎక్కి, పాశ, అంకుశ, అభయ, వరద హస్తములతో అధిష్ఠానదేవత హం అనే బీజాక్షరంపై దర్శనమిస్తుంది. ఆబీజాక్షరం అనుస్వారం (సున్న) పై అర్ధనారీశ్వరులు (తెల్లని వర్ణంతో శివుడు బంగారు రంగుతో పార్వతి) దర్శనమిస్తారు. ఈఅర్ధనారీశ్వరులు పంచ ముఖాలతో, శూల, టంక (ఉలి) క్రకచ,(రంపం) ఖడ్గ, వజ్ర, అగ్నికుండ, ఘంటా, అమేశ, పాశ, అభయ, హస్తాలతో (పది చేతులతో) విరాజిల్లు తుంటారు. విభూతి పూతతో, వ్యాఘ్రాజినం ధరించి, నాగాభరణుడై, తలపై అమృతము కురుస్తున్న అర్ధచంద్రునితో ప్రకాశిస్తూ, జటామండల ధారియైన, శిరసుపై గంగాదేవిని ధరించి సదాశివుడు ప్రకాశిస్తూ కన్పిస్తాడు. ఈ విశుద్ధకమలం మధ్యలో ఉన్నకర్ణికలో చంద్రమండలంలో త్వక్ (చర్మ), ధాతువు అధి దేవత ధాకినీ అనేశక్తి దర్శన మిస్తుంది. ఆమె ఒకముఖముతో, తెల్లని రంగులో, మూడుకన్నులతో, ఖట్వాంగ(మంచంకోడు) ఖడ్గ, శూల, చర్మము లలో ప్రకాశించే నాల్గు చేతులు కల్గి ఉంటుంది. ఆమెకు పాయసాన్నం చాలా ప్రీతి ఆమెను పరివేష్ఠించి అమృతాది యోగినీ గణముంటుంది.

*గమనిక : ఈ విశుద్ధ కమలంలోని కర్ణికా రూపమే శ్రీచక్రం లోపల ఉండే బహిర్దశారం అనే పేరు గల్గిన సర్వార్థ సాధక చక్రం.*

శ్లో॥ సమాధికాలాత్ ప్రాగేవం విచింత్యాతిప్రయత్నతః
స్థూల సూక్ష్మక్రమాత్ సర్వం చిదాత్మని విలాపయేత్!!

తా:- సమాధి సిద్ధికి ముందే స్థూల సూక్ష్మ ప్రపంచాన్ని అతిప్రయత్నంతో దర్శించి, అజ్ఞానంతో స్థూల సూక్ష్మప్రపంచంలో ముఖ్యమైన ఈ ఇరవై తత్త్వాలను చిదాత్మతో లీనం చేయవలె.

**20 తత్త్వాలు-పంచచక్రాలు**

1) మూలాధారచక్రం - 1) భూమి2)పాయు(గుదం) 3) ఘ్రాణేంద్రియం 4) గంధము(వాసన)

2) స్వాధిష్ఠానచక్రం- 1) జలం 2) ఉపస్థ (మర్మాంగం) 3) జిహ్వేంద్రియం 4) రసన (రుచి).

3) మణిపూరక చక్రం- 1) అగ్ని 2) పాద 3) నేత్రేందియం 4) రూపములు

4) అనాహతచక్రం- 1) వాయు 2) పాణి 3) త్వగింద్రియం (చర్మం) 4) స్పర్శ.

5) విశుద్ధచక్రం- 1) ఆకాశ 2) వాక్కు 3) శ్రోత్రేంద్రియం (చెవి) 4) శబ్దం.

పై ఐదు ప్రకాలలోని 20 తత్త్వాలను సాధనలో దర్శించి పరిపూర్ణ జ్ఞానసిద్ధిని పొందాలనే శ్రీశంకరుల నిర్దేశం.

పైన తెల్పిన విశుద్ధచక్ర ఉపాసనలో సాధకుడు ఉత్తమసిద్ధిని పొంది పరిపూర్ణుడైతే, అలౌకికమైన ప్రశాంతిని తాను పొందడమే కాకుండా, తన సన్నిధానంలోని ఇతర జనులకు కూడా అలౌకిక శాంతిని ప్రసాదించగలడు. అంతే కాక సంకల్ప మాత్రాన సర్వకార్య సిద్ధి కల్గుతుంది. విశుద్ధ చక్ర కర్ణికలో చంద్ర మండలంలో కారణగురువుల దర్శనమౌతుంది.

## 2. అనాహత చక్రము

సాధకుడు హృదయస్థానాన్ని లక్ష్యం చేసుకొని, ఏకాగ్రం చేస్తే అనాహతచక్రం దర్శనమిస్తుంది. బంధూక పుష్పవర్ణం (దాసాని పువ్వు), పగడం వర్ణంలో ఉంటుంది. 12 దళములు సింధూర వర్ణంలో ఉంటాయి. ఆరేకులమీద క వర్ణము నుండి ఠ వర్ణము వరకు (సున్న) అనుస్వారంతో కలిసి ఉంటాయి. అంటే కం, ఖం, గం, ఘంఅనే రూపంలో ఈ కమల కర్ణిక (బొడ్డు దిమ్మె) మధ్యలో ధూమ్ర వర్ణంతో షట్కోణ మండల మున్నది. అది వాయు భూమండలం. దానిపైనే యం బీజాక్షరం కన్పిస్తుంది. ఆవాయు మండలమధ్యంలో అగ్ని, సూర్య, చంద్ర మండలాలున్నాయి. ఆబీజాక్షరం యం మెరుపుతీగెల కాంతిలో విరాజిల్లుతుంది. వాయు మండలం మధ్యలో త్రికోణ మండలం అధోముఖంగాఉంది. దానిలో ధూమ్ర వర్ణం, నాల్గు చేతులతో, అంకుశధారియై, జింక వాహనంపైనున్న వాయు బీజాక్షర దేవత దర్శనమిస్తుంది. ఆవాయుబీజం యం అనుస్వారం పైన హంస అనే పేరుగల ఈశ్వరుడు విరాజిల్లు చున్నాడు. ఆ స్వామి వరద, అభయ హస్తాలతో, త్రినేత్రుడై పట్టు దుకూలం ధరించి, అనేక రత్నాభరణ ధారియై, మనో హరచంద్ర లేఖ కిరణ విభ్రాజితమైన జటజూటంతో, సూర్య ప్రభలతో ప్రకాశిస్తూ, దర్శనమిస్తాడు.

ఈ అనాహత కమల కర్ణికలోని రక్త వర్ణపద్మముపైన రక్తధాతువు యొక్క అధిష్ఠాన దేవత రాగిణి ఉంది. రెండు ముఖాలతో, నల్లని మేని ఛాయతో, మూడు కన్నులతో, కోరలతో కన్పిస్తుంది. నాల్గుచేతులలో చక్రం, శూలం, కపాలం, డమరుకం, ధరించి ఉంటుంది. ఆమె చుట్టూ కాళరాత్రి మొదలైన దేవతలు పరివేష్ఠించి ఉన్నారు. ఆమె స్నిగ్ధౌదన ప్రీత. **వీరేంద్ర వంద్య** ఈమె బిరుదు. ఉపాసించే భక్తులకోర్కెలను వెంటనే తీరుస్తుంది ఈ దేవత. ఈ త్రికోణ మండల మధ్యంలో అర్థ చంద్రుని, తలపై ధరించి సువర్ణకాంతులు విరజిమ్ముతూ ఒక **బాణలింగం** దర్శనమిస్తుంది. ఈ బాణలింగాన్ని గురించిన విశేషాలు ముందు చెప్పబోవు **దహార విద్య లో** తెలుసుకోవచ్చు.

అనాహత చక్రంలో పదివిధములైన **నాదములు** ఉత్తమస్థాయిని పొందిన సాధకుడు వినగలడు. అవి ఈక్రింది విధంగా ఉంటాయి.

| నాదసంఖ్య | నాదము | సాధకుని అనుభవం |
|---|---|---|
| 1 | చిణి | శరీరంలో క్రొత్తమార్పు |
| 2 | చిణి, చిణి | శరీరం విభజింపబడిన అనుభవం |
| 3 | ఘంటానాదం | శరీరం భేదింపబడిన అనుభవం |
| 4 | శంఖనాదం | శిరః కంపనం అనుభవం |
| 5 | తంత్రీనాదం | నోటిలో నీరూరడం |
| 6 | తాళనాదం | అమృతం తాగిన అనుభవం |
| 7 | వేణునాదం | రహస్య విషయాలను తెలుసుకోగల్గిన విజ్ఞానం |
| 8 | భేరీనాదం | పరాస్థానం (వాక్కు పుట్టడం) |
| 9 | మృదంగనాదం | అదృశ్యం చెందే శక్తి- దివ్యదృష్టి |
| 10 | మేఘనాదం(ఉరుము) | బ్రహ్మానందానుభవం |

ఈ మేఘ నాదాన్ని వింటూనే ముక్తిని పొందగలరు. జీవన్ముక్తులుగా ఉంటారు. ఈ అనాహత చక్రసాధకుడు ఉత్తమస్థాయిని పొందినప్పుడు, గాలిని సృష్టించ గలడు. స్తంభింప చేయగలడు. తాను భాగ్యాలు పొందడమే కాక భక్తులకు ప్రసాదించ గలడు.

## 3. మణిపూరక చక్రం

సాధకుడు తన నాభిస్థానంపై లక్ష్యముంచి ఏకాగ్రం చేస్తే, నీలం రంగుతో పది దళములతో మణిపూరక చక్రం దర్శనమిస్తుంది. డం నుండి ఫం వరకున్న బీజాక్షరాలు పది దళములపై కనిపిస్తాయి. ఈకమల కర్ణికలో (మధ్యదిమ్మలో) ఎర్రని రంగుతో త్రికోణాకృతిలో అగ్నిమండలం ఉంది. దాని వెలుపల స్వస్తిక్ (卐) చిహ్నం కన్పిస్తుంది. అగ్ని మండలం మధ్యలో రంఅనే బీజాక్షరం కన్పిస్తుంది. బీజముపై అధిష్ఠాత అగ్ని మేకవాహనంపై నాల్గుచేతులల్లో వజ్ర, శక్తి, వరద, అభయ ముద్రలలో కన్పిస్తారు. అనుస్వారం పైన రుద్రుడు, వృషభ వాహనుడై, రెండు చేతులతో, తెల్లని రంగులో ప్రకాశిస్తూ, నాగాభరణ, జటా జూటము లతో అర్థ చంద్రరేఖ ధరించి తలపై గంగా దేవితో దర్శన మిస్తాడు.

మణిపూరక కమలకర్ణికపై ఎర్రని కమలం ఉంది. తదధిష్ఠానదేవత మూడుముఖములతో ఎర్రని మైచాయతో నాల్గు చేతులతో శక్తి, వజ్ర, దండ, అభయ ముద్రలు ధరించి దర్శనమిస్తుంది. ఆమె ఉగ్రరూపిణి. భయంకరమైన కోరలు గల్గిన ముఖంతో ఉంటుంది. ఆమె పేరు లాకినీ. చుట్టూ డామరీ మొదలైన దేవతలు పరివేష్ఠించి ఉంటారు. ఆమె మాంసధాతువుకు అధిష్ఠానదేవత. బెల్లంపాయసం(గుడాన్నం) ఇష్టం. భక్తులకు సుఖాన్నిస్తుంది.

*గమనిక :- ఈమణిపూరక కమల కర్ణికారూపమే శ్రీచక్రంలోని నాగ దళాత్మక సర్వసంక్షోభిణీచక్రం. ఈ చక్రసాధకుడు ఉత్తమస్థితి నొంది నప్పుడు అగ్ని జ్వాలలను సృష్టించ గలడు.*

## 4. స్వాధిష్ఠాన చక్రం

సింధూర వర్ణం (లేత ఎరుపు)తో ఆరు దళములతో ఈచక్రం లింగమూలస్థానంలో (మర్మాసయప్రాంతంలో) దర్శనమిస్తుంది. ఆరురేకుల మీద బం నుండి లం వరకు మెరుపు తీగె కాంతిలో ఆరు బీజాక్షరా లుంటాయి. ఈచక్రం సుషుమ్న నాడి మధ్యనుంది. దీని కర్ణిక మీద వరుణ మండలం ఎనిమిది దళాలతో, తెల్లని రంగుతో, అర్ధచంద్రాకారంలో ఉంది. దీనిలో మకరవాహనంపై, పాశహస్తములతో వం అనే వరుణ బీజాక్షరం ఉంది. వరుణ బీజాక్షర అనుస్వారంపై పరమసుందరాకారుడైన శంఖ, చక్ర, గదా, పద్మ, కౌస్తుభ, శ్రీవత్స, వనమాలా, విరాజితుడై, లక్ష్మీ సమేతుడైన నారాయణుడు దర్శనమిస్తాడు. గరుడు వాహనంపైనుంటాడు.

కర్ణికపైనుండే ఎర్రని పద్మం మీద మేదో ధాతువు అధిష్ఠాత కాకిని

శక్తి విరాజిల్లుతూంది. పసుపు పచ్చని మేనిచాయతో నాల్గు మొగములతో మూడు కన్నులతో ఉంటుంది. అగ్ని, గుణ, కపాల, అభయ ముద్రలు ధరించి ఉంటుంది. ఆమెను బందినీ మొదలైన శక్తులు పరివేష్టించి ఉంటాయి. ఆమెకు దధ్యోదనం(పెరుగన్నం)ఇష్టం. భక్తులు కోర్కెలను తీరుస్తుంటుంది.

*గమనిక :- ఈ స్వాధిష్ఠాన చక్ర కర్ణికారూపమే శ్రీచక్రగత షోడశ పత్రాత్మకమైన* **సర్వాశాపరిపూరక చక్రము** *గా ఉంది. స్వాధిష్ఠాన చక్రోపాసకుడు ఇతరులకు కీడు కల్గించని తన కోర్కెలను నెరవేర్చు కోగలడు.*

## 5. మూలాధార చక్రం

సాధకుడు గుదస్థానం పైన రెండంగుళాలు మర్మాంగం క్రింద రెండంగుళాలు కొల్తలు గల స్థానంలో లక్ష్యముంచి, సమాహితం చేసినపుడు మూలాధార చక్రం రక్తవర్ణంతో నాలుగు దళములతో దర్శనమిస్తుంది.

ఈ నాలుగు దళాలపైన వం, శం, షం, సం అనే బీజాక్షరాలు బంగారు కాంతితో మెరుస్తున్నాయి. ఈ కమల కర్ణిక యందు నాల్గు కోణములు (చతురస్రం) కలిగి, ఎనిమిది శూలములు కలిగిన పసుపు పచ్చని రంగుతో పృథ్వీ మండలం దర్శనమిస్తుంది. దానిపైన నాల్గు బాహువులతో వజ్రములు ధరించి ఐరావతమనే తెల్లని ఏనుగునెక్కి, పసుపు పచ్చని రంగుతో లం అనే పృథివీ భూత బీజముంది. దాని అనుస్వారంపై చతుర్ముఖ బ్రహ్మ సరస్వతీదేవితో సహా హంసవాహనాన్నెక్కి దర్శనమిస్తాడు. వారితో గూడ గణపతి కనిపిస్తాడు. అందుకే మూలాధారానికి అధిష్ఠాన దేవత గణపతి యని ప్రచారంలో ఉంది. ఆబ్రహ్మ దండ, కమండలు, అక్షమాల, అభయ ముద్రలు ధరించిన నాలుగు చేతులు గల్గి ఉంటాడు. ఎర్రని మేని చాయతో ప్రకాశిస్తుంటారు.

ఈ కమల కర్ణికలో చక్రాధిష్ఠాన దేవత ఐదు ముఖములతో, మూడు, మూడు కన్నులతో ధూమ్ర వర్ణంతో గల మేనిచాయతో, నాలుగు చేతులతో అంకుశ, కమల, పుస్తక, జ్ఞానముద్రలలో కనిపిస్తుంది. పూర్వ దిక్కక్తులు ఆమెను పరివేష్టించి ఉన్నాయి. ఆమె మధుపానంతో మత్తిల్లి ఉంటుంది. ఆమె **సాకిని** పేరు గల్గిన అస్థి ధాతువు దేవత ఆమెకు ముద్గాన్నం (పులగం) ఇష్టం.

ఈ పృథివీ కమల కర్ణిక (మధ్యదిమ్మ) మధ్యన మెరుపు తీగల కాంతులు జిమ్ముచు త్రైపురం అనే త్రికోణం ఉంది. ఆత్రికోణం మధ్య ఎర్రని కాంతి

వెలుగొందుచు "క్లీం" అనే కామ బీజాక్షరం ఉంది. దీని బీజాక్షరంపైన బాలా త్రిపుర సుందరీ దేవి ప్రకాశిస్తూ దర్శనమిస్తుంది. మూడు కన్నులు కల్గిన ఈ దేవి మేని చాయ సూర్యకాంతితో విరాజిల్లుతూ ఉంటుంది. ఆతల్లి అరుణ కమలం మీద కూర్చొని, రక్తాంబరధారిణై, విద్య, అక్షమాల, అభయ, వరద ముద్రలు కల్గి, నాల్గు చేతులతో ఉన్నది.

ఆ త్రికోణ చక్రపైభాగాన ఒకనీలవర్ణ లింగం అధోముఖముగా ఒక రంధ్రము శిరసు కల్గి ఉంటుంది. ఇదే స్వయంభూలింగం.

## కుండలినీ శక్తి

పైన తెల్పిన ఆస్వయం భూలింగము యొక్క సగంభాగం వరకు మూడుచుట్లు చుట్టుకొని తామరతూడులో దారమువలె సన్నగా మెరుపుతీగ కాంతుల విరజిమ్ముతూ, తన పడగ చేతి లింగానికున్న రంధ్రముఖాన్ని కప్పి, మదించిన తుమ్మెదల మ్రోతవలె ధ్వని చేస్తూ, కుండలిని ఉంది. ఆపడగపైన దండాకారము కల్గి, కోటిసూర్యప్రభలతో చిత్కళ ప్రకాశిస్తుంది.

చిత్కళ అంటే జ్ఞాన ప్రకాశకల అని అర్థం. ఆ కుండలిని సర్పాకృతితో కన్పిస్తున్న తదధిష్ఠాన దేవతను ఈ క్రింది విధంగా ధ్యానిస్తే, దర్శనమైతుంది.

ఆదేవి ఎల్లప్పుడు పదహారు సంవత్సరముల వయస్సు కల్గినదై రక్త వర్ణము గల మేనిచాయతో ప్రకాశిస్తుంది. పీనోన్నత పయోధర. పూర్ణచంద్రుని వెలుగులు విరజిమ్మే కన్నుల కాంతికల్గి ఉన్నది. ఆమె ముఖము కోటి చంద్రుల కాంతితో, మూడు కన్నులు కల్గి ప్రకాశిస్తుంది. చతుర్భుజములతో వరద, అభయ, పుస్తక, వీణలను ధరించి ఉంది. సింహాస నారూఢమైన ఈతల్లి అనేక రూపాలను ధరిస్తుంది. ఆమే నాదశక్తి రూపిణి. పరానాదాత్మిక కుండలినీ శక్తి ఆమెయే. పరబ్రహ్మ స్వరూపిణియై అఘటన ఘటనా సమర్థయై, పరమేశాశ్రితయైన మహామాయాశక్తి ఆమె. బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివ, ఇంద్ర, **ప్రాణకళలు ఆమెయే!** అగ్ని, చంద్ర, సూర్యరూపాలు **ఆపరాశక్తివే!**

*గమనిక : ఈమూలాధార కర్ణిక రూపమే శ్రీ చక్రములోని నవచక్రాల మధ్య నుండే భూపుర వృత్తత్రయాత్మకమైన త్రైలోక్యమోహన చక్రం. ఈ మూలా ధార చక్రోపాసనలో సిద్ధి పొందిన యోగి, గొప్ప వక్తృతను పొందగలడు. పృథ్వీ తత్త్వము అధికముగా గల వస్తువులపైన, యంత్రాదులపైన అధికారం నెరపగలడు. సర్వలోకాలను సమ్మోహితం చేయగలడు.*

## 6. ఆజ్ఞాచక్రము

సాధకుడు భ్రూమధ్యమందు (కనుబొమ్మల నడుమ) లక్ష్యముంచి, ఏకాగ్రం చేస్తే ఆజ్ఞాచక్రం దర్శనమిస్తుంది. దీనిలో కర్పూరం వంటి తెల్లనిరంగులో రెండుదళాలున్నాయి. ఒకదళముపైన "హం" మరొక దళంపైన "క్షం" అనే బీజాక్షరాలున్నాయి. ఈచక్ర కర్ణికలో మూడు కన్నులు కల్గిన, ఆరుముఖాలతో, జ్ఞానముద్ర, అక్షమాలా, ఢమరుక, కపాలములను ధరించిన నాల్గు చేతులతో తెల్లని మేనిచాయతో మజ్జాధాతువు అధిష్ఠానదేవత "హాకినీ శక్తి" ఉంది. ఆమె హరిద్రాన్నాసక్త. అంటే చిత్రాన్నమంటే ప్రీతి. ఆమెను పరివేష్ఠించి హంసవతి మొదలైన దేవతలుంటారు. ఆమె సకల శుభాలను కల్గిస్తుంది. ఈ కర్ణికలోనే త్రికోణాకార మండలంలో మెరుపు తీగెల కాతితో ప్రకాశించే లింగం కన్పిస్తుంది. కమల కర్ణికపై మరొక త్రికోణ ముంది. దీనిలో దీపకళికగా అంతరాత్మ ప్రకాశిస్తూ ఉన్నాడు. ఆఅంతరాత్మనుండి ఒక నాదం వినబడుతూంటుంది. అది ప్రణవనాదం (ఓంకారం). ఓం కారానికి నాల్గు వైపుల (మధ్య భాగానికి కొంచెం క్రింద) నిప్పులు విరజిమ్ముచూ, మహా ప్రకాశవంతమైన తేజస్సుతో, మూలాధారం మొదలుకొని పైనున్న బ్రహ్మ రంధ్రం వరకు వ్యాపిస్తున్న ఒక మహా జ్యోతిస్సు కన్పిస్తుంది. ఆజ్యోతిస్సుకు పైన గోధుమగింజ ప్రమాణంలో సూక్ష్మ తేజోరూపం గల మనస్సు ఉంది. అక్కడే మనస్సంబంధమైన అహంకారం, బుద్ధి వంటి ప్రకృతులున్నాయి. దానిపైభాగాన పూర్ణచంద్రమండల దర్శన మౌతుంది. ఆ మండలంపై బాల సూర్యుని వంటి ఒక బిందువు సెనగ గింజ ప్రమాణంలో ఉంటుంది. అదే శివ శక్త్యాత్మకమైన "బోధిని శక్తి రూపము". పైన పేర్కొన్న మండలము బిందువు రెండింటి సంధిలో అంతరాత్మ సాక్షిగా ఉన్నాడు. పైన తెల్పిన బిందువు పైభాగాన బోధిని శక్తికంటె భిన్నముగాక గాంధారరాగము వంటి ఒక నాదము విన్పిస్తుంది. ఆగాంధారరాగ ధ్వని పై నాగలి ఆకారంతో ఒక మహా నాదం వినబడుతుంది. దానిపైన జీవశక్తి రూపిణి (కల) అర్ధగీత వలె కన్పిస్తుంది. ఆకల సృష్ట్యాది ఆవిర్భవించిన సచ్చిదానంద రూపిణి త్రిపుర సుందరి దేవి. ఈమె ఆ నాగలి ఆకార రేఖకు కుడి భాగాన ఉంది. ఎడమ భాగంలో బిందువుపై త్రికోణాకృతితో "వ్యాపికా శక్తి" ఉంది. ఈమె వ్యాపికా, వ్యాపికా శక్తి అనే రెండు రూపాలతో ఉంది. ఈ భాగానికి పైన ఒక సరళరేఖ ఉంది. అదే "సమనీ" అనే ఒక సమాధిస్థితి. ఆ రేఖ

మధ్యలోనున్న సూక్ష్మరేఖ "ఉన్మనీ" అనే మరొక శ్రేష్ఠమైన సమాధిస్థితి. ఈ స్థితి యందు మనస్సు తన సహజ స్థితిని కోల్పోయి, "అమనస్క" స్థితి అనే విలక్షణమైన స్థితిని పొందుతుంది.

*గమనిక :- పైన తెల్పబడిన ఏడుకారణరూపాలు సూక్ష్మశ్రీచక్ర రూపాలని తెల్సుకోవల్సి ఉంది. ఆజ్ఞాచక్ర కర్ణికయే శ్రీచక్రంలోని వసుకోణాత్మక సర్వరక్షాకర చక్రము.*

ఈ ఆజ్ఞాచక్రమునందు సిద్ధుడైన వాడు మహా యోగియై, సృష్టిలోని సర్వశక్తులను వశం చేసుకుంటాడు. ఈజగత్తుకు కల్గే ఆపదలనుండి రక్షిస్తాడు.

ఈఆజ్ఞాచక్రంతో షట్చక్రవిద్యలు ముగిసినవి.

## సహస్రార కమల విద్య (సహస్ర దళ చక్రం)

### పరిచయం:-

ఈ సహస్రార కమల విద్య మహోన్నత స్థాయికి చెందినట్టిది. సాధకుడు దీనిలో పరిపూర్ణుడైతే, ఆంతర ప్రకృతిని జయించి, జగదభ్యుదయము ప్రసాదించే మహా పురుషుడు కాగలడు. ఈజగత్తుయొక్క సృష్టి స్థితి లయములకు సంబంధించిన రహస్యాలన్నింటికి ఈ సహస్రార చక్రమే ముఖ్యము. ఉపనిషత్తులలో, యోగశాస్త్రాలలో ఈ సహస్రారకమల విద్య శ్రీ విద్యలను సమన్వయం చేస్తూ ఎంతో వివరించబడింది. వీటి సారాంశం శరీరము, మనస్సులుగా నుండే స్థూల శరీర, సూక్ష్మ శరీరాలలో ఉన్న తత్త్వములు దేవతలను దర్శించి, అనుభవం పొందడమే. ఈవిద్యలను గ్రహించేందుకు పూర్వం తగిన అర్హత పొందడానికి వెనుకచెప్పిన అభ్యాసదర్శన ప్రణాళిక ఉపయోగిస్తుంది. దానిని ఉద్ధరించి, లోకానికి ప్రసాదించిన సద్గురూత్తములగు శ్రీ శివసచ్చిదానంద సరస్వతీ స్వామి వారికి నతులర్పిస్తూ సహస్రదళ చక్ర విద్యను వివరించుకుందాం!

### విద్యావివరణ:-

సాధకుడు తలపైన బ్రహ్మరంధ్రస్థానంలో లక్ష్యముంచి, ఏకాగ్రం చేస్తే తెల్లని వర్ణంతో అధోముఖంగా వేయిదళాలతో ఉండేపద్మం ఒకటి దర్శనమిస్తుంది. ఆపద్మకర్ణికఎర్రని పుప్పొడితో ఉంది. అది సుషుమ్నానాడికిపైనఉంది. "అం" మొదలుకొని "ళం" వరకు 50 (యాభై) బీజాక్షరాలు ఆదళాలపైదర్శనమిస్తాయి.

ఈ సహస్రదళ కమల కర్ణికలోపల పన్నెండుదళాలతో మరొక కమలం ఊర్ధ్వముఖంగా ఉంది. దీని కర్ణికయందు సూర్యచంద్రవాయు మండలాలు ఉన్నాయి. వీటి మధ్యప్రదేశం త్రికోణాకారంగా ఉంది. ఈత్రికోణ రేఖలలో ఒకదానిపై "అ" బీజాక్షరం మరొకదానిపై "క" బీజాక్షరం ఇంకొకదానిపై "థ" అనే బీజాక్షరాలున్నాయి. మూడు కోణాలపైన "హ, ళ, క్ష" అనే అక్షరాలున్నాయి. త్రికోణం క్రిందిభాగానే హంసాత్మకమైన "హంసః" అనే అక్షరాలు దర్శనమిస్తాయి. వీటిలో "సః" అనే అక్షరం ప్రకృతి, హం అనే అక్షరం పురుషుడు. "సం" లోని విసర్గపై పరశివరూప **గురువులు** దర్శన మిస్తారు. ఆగురువుల క్రింది భాగంలో బిందునాదాత్మకమైన **మణి పీఠం** ఉంది. దానిలో హంసాత్మకమైన గురు చరణములు, ఎరుపు తెలుపు రంగుల మిశ్రమ కాంతులతో ప్రకాశిస్తుంటాయి. ఆచరణముల క్రింద ఉండే బిందువే జీవాత్మయై ఉంది. అచట "మహాశంఖిణీ శక్తి" ఉంది. **"సః"** లోని విసర్గ బ్రహ్మ రంధ్ర స్థానంలో ఉంది. సహస్ర దళ కమల కర్ణికలోని చంద్రమండలం అమృతాన్ని వర్షిస్తుంది. దానిమధ్య మెరుపుతీగె వలె మెరుస్తున్న త్రికోణంలో ఎర్రని రంగుతో అధోముఖియై **చిచ్ఛక్తి** వాలాగ్రశత **భాగైక భాగా** ఉంది. అంటే ఒక వెంట్రుకను నూరు భాగాలు చేస్తే అందులోని ఒక భాగం పరిమాణంతో అతి సూక్ష్మంగా ఉంది. దానినే పై చంద్రుని **అమాకల** అని చెప్తారు. "**చిచ్ఛక్తి**" యొక్క క్రోడం (ముట్టె) నందు పన్నెండు మంది సూర్యుల ప్రకాశంతో **నిర్వాణ కల** ఉంది. ఇది వంకరగా, అధోముఖంగా ఉంది. అంతేకాక వాలాగ్ర సహస్రభాగైక రూపా అని పిలువబడుతుంది. అంటే ఒక వెంట్రుకను వేయి భాగాలు చేస్తే (1/1000) అందులో ఒక భాగమైన అత్యంత సూక్ష్మంగా ఉంటుంది. ఇది చంద్రుని పదిహేడవ కల అంటారు. దీని క్రింది భాగాన ఊర్ధ్వముఖంగా **బోధికాకల** ఉంది. అది అగ్నిరూపిణి. అవ్యక్తనాదాత్మిక అంటే నాదానికి పూర్వస్థితి అన్నమాట. ఆబోధికాకల తమోగుణం అధికంగా నున్నపుడు. కేవల నాదంగా, రజోగుణం అధిక మైనపుడు కొంచెం రంగుతో, సత్త్వగుణం అధికమైనపుడు చంద్రకాంతితో బిందు రూపిణిగా ప్రకాశిస్తుంది.

## నిర్వాణ కల:-

పైన తెల్పిన నిర్వాణకల క్రోడమందు (ముట్టె) నిర్వాణ శక్తి ఉంది. ఆ నిర్వాణ కల కోటిసూర్యప్రభలతో వెలుగుతుంది. అది

సర్వజీవకళలకు మూలస్థానం. ఆనంద ధారా పరం పరలను నిరవధికంగా వర్షిస్తుంది. అది అంతటికీ ఆదికల. దాని మధ్యభాగాన ఉండే సుసూక్ష్మ శూన్యభాగమే పరబిందు రూపము. ఇదే శ్రీచక్రంలోని ఆది బిందువు.

**బ్రహ్మపదవము:-**

సహస్ర కమల కర్ణికలోని చంద్రమండలంలో ఆచక్రాధి దేవత యాకినీ శక్తి ఉంది. ఆమె మొండెం పై చుట్టూ తలలుంటాయి (సర్వతో వక్త్ర). లెక్కలేనన్ని చేతులతో ఎన్నో ఆయుధాలను ధరించిన ఆమె మేని ఛాయ అన్ని రంగులతో కలిసి చిత్రవిచిత్రంగా ఉంటుంది. ఆమె "రేతస్సు" అనే ధాతువుకు అధి దేవత. "సర్వౌదన ప్రీత చిత్త" అంటే అన్ని రకాల అన్నాలను ఇష్టపడుతుందని అర్థం.

# అధ్యాయము-3

## శరీరంలోని ముఖ్య భాగములు - దివ్యశక్తులు

### 1) కందము (దుంప వంటి భాగము) :

ఈ కందమనే భాగం ప్రతి శరీరం యొక్క నిలువు కొలతలో మధ్య భాగం నుండి తొమ్మిది అంగుళాల పై భాగాన ఉంది. ప్రతివ్యక్తి శరీరం తన అంగుళం కొలతతో తొంభై ఆరు అంగుళాలు ఉంటుంది. ఆసన స్థానం నుండి రెండు అంగుళాలు పైన ఉండే స్థానం శరీరం నిలువు కొలతలో మధ్య భాగం. అది త్రికోణాకారంలో ఉండే అగ్నిస్థానం. అక్కడినుండి తొమ్మిది అంగుళాల పైన కందం ఉంది. ఇది నాడులకు కేంద్రం. దీని నుండి డెబ్బైరెండు వేల నాడులు స్థూలమైనవి, సూక్ష్మమైనవి, అత్యంత సూక్ష్మమైనవి బయలుదేరి శరీర మంతా వ్యాపించినాయి. వీటికి ఆధారమైన చైతన్య శక్తియే "**కుండలినీ శక్తి**"

### 2) మేరుదండం (వెన్నెముక)

వెన్నెముక శరీరములో వెన్నుపూసలు అనబడు కటి ప్రదేశమునుండి మెడవరకు ఉన్నది. దీనినే యోగపరిభాషలో మేరుదండం అంటారు. ఈ వెన్నెముక ఎనిమిది ఆంక్లను అర్ధముగా ఉంచి ఒకదానిపై మరొకటి పేర్చుకు పోతే ఎట్లు ఉంటుందో అటువంటి ఆకారముగలదిగ ఉంటుంది. రెండు వైపులలో ఎడమ వైపునుండునది "ఇడ నాడి". కుడివైపున నుండునది.

"పింగళానాడి". అను పేర్లు గలవి. ఈ రెండు భాగముల మధ్యగా పోవుచున్న కాలువ వంటిది. "సుషుమ్నానాడి" అంటారు. పైన తెల్పిన 72 వేల నాడులలో ముఖ్యమైనవి పదియని కొందరు, పన్నెండని కొందరు, పదునాలుగు అని కొందరు అభిప్రాయపడుచున్నారు.

ఆపదునైదు నాడులలో ముఖ్య తరమైనవి 1) ఇడానాడి 2) పింగళానాడి 3) సుషుమ్నానాడి ఈ మూడింటిలో ముఖ్యతమమైనది సుషుమ్నానాడి. ఈ సుషుమ్నానాడి ప్రభావము ముందు భాగములో వివరింపబడుతుంది.

మిగతా పన్నెండు నాడుల **వివరము తెలుసుకొందాం!**

**1) నాడి (గాంధారి)** :- ఇది సుషుమ్నకు పూర్వ భాగము నుండి బయలుదేరి ఇడానాడికి వెనుక ప్రక్క ఎడమ కంటి వరకుండును. (చంద్ర దైవత్వము)

**2) నాడి హస్తిజిహ్వ** :- ఇది సుషుమ్నకు వెనుక భాగము నుండి బయలుదేరి కుడి కంటి వరకుండును. (ధీదైవత్వము)

**3) నాడి పూషా** :- కందమునుండి కుడి చెవి వరకు.

**4) నాడి యశస్వినీ** :- కందమునుండి ఎడమ చెవి వరకు.

**5) నాడి అలంబుసా** :- కందము నుడి అధోముఖమై (క్రింది భాగము) గుద స్థానము వరకు (పాయు మూలం).

**6) నాడి కుహూ** :- కందము నుడి అధోముఖమై లింగము వరకు (గుహ్యాంగము వరకు).

**7) నాడి శంఖినీ** :- కందము నుడి ఊర్ధ్వ గమనంతో కంఠ పర్యంతం పోయి భుజించ బడిన అన్నసారమును శిరస్సునకు చేర్చి నిల్వచేయును.

**8) నాడి సరస్వతి** :- సుషుమ్నానాడి వెనుక నుండి బయలు దేరి నాలుక వరకు ఉండును.

**9) నాడి కౌశికి** :-ఇడానాడి ప్రక్కన అధోముఖముగ కుడుకాలి బొటన వ్రేలు పర్యంతము.

**10) నాడి తపస్విని** :- పింగళానాడి ప్రక్కన అధోముఖమై ఎడమకాలి బొటన వ్రేలి వరకు .

**11) నాడి విశ్వాని** :- కుహూ హస్తిజిహ్వా అను నాడుల మధ్యన (కందము నుండి) జఠరము వరకు.

**12) నాడి చిత్ర(సీవిని)**:- నాభికి క్రింద (మేఢ్రము) గుహ్యాంగము వరకు వ్యాపించి, శుక్లము విడుచును.

ఈ నాడులన్నీ సుషుమ్నానాడి మూలభాగమునందు సంబంధము కల్గి ఉన్నందు వల్లనే చెవి మొదలైన ఇంద్రియములు, ఇతర శరీర భాగములు పనిచేయుచున్నవి. సుషుమ్నానాడి యందున్న "చిచ్ఛకి" యే అన్ని నాడులకు చైతన్యాన్ని కలుగజేస్తుంది.

## ఇడా, పింగళా, సుషుమ్నానాడులు

### ఇడా నాడి :-

కందము నుండి (ఆవిర్భవించి) బయలుదేరి అధోముఖియై ఎడమ వృషణము వరకు పోయి, సుషుమ్న నాడిని మధ్యన చేసికొని ధనురాకారంగా (లేక జడవంటి ఆకారము గలదై) కుడిభుజపు కీలుకు చేరి, కనుబొమ్మల నడిమి భాగము నుండి, ఎడమ ముక్కు రంధ్రము వరకు ఉంటుంది. ఇడా నాడిలో చంద్ర సంచారం జరుగుతుంది. ఇది చంద్ర ప్రకాశంతో ఉంటుంది. దీని దేవత విష్ణువు.

### పింగళానాడి :-

కందము నుండి బయలుదేరి అధోముఖముగా కుడిబీజము వరకు పోయి, సుషుమ్నను మధ్యగా చేసుకొని ధనురాకారంగా కాని జడ ఆకారంగా కాని ఎడమ భుజపు కీలు, కనుబొమ్మల నడిమి భాగమునకు వెళ్ళి, కుడి ముక్కు రంధ్రము వరకున్నది. పింగళ సూర్య సంచారము కలిగి, సూర్యకాంతి తో ఉంటుంది. దీని దేవత బ్రహ్మ.

ఇడానాడిని చంద్ర నాడియనియు పింగళానాడిని సూర్యనాడి యనియు వ్యవహరించుచున్నారు. ఈ చంద్ర సూర్యనాడులలో ప్రాణవాయు సంచారమును బట్టి స్వరశాస్త్రము ఉంది.

### సుషుమ్నానాడి (కుండలినీ శక్తి) :-

కందము నుడి వెడలి తామర తాడుతో సన్నని దారము వలె సూక్ష్మమై, మహా ప్రకాశవంతమై, మూలాధార చక్రములోని త్రికోణము పై ఉన్న నీల వర్ణ లింగాన్ని మూడు చుట్లు చుట్టుకొని, ఆలింగ శిరస్సుపైనున్న రంధ్రముపై పడగను కప్పి ఉంటుంది. దీనినే సుషుమ్న అని పరానాడి అని శివశక్తి అని తెలియదగును.

**సుషుమ్నానాడికి, కుండలినీ శక్తికి గల సూక్ష్మ భేదము :-**
సుషుమ్నానాడి అతి సూక్ష్మంగా ఉండును. దాని ద్వారా చైతన్య శక్తి ప్రసారమగుచున్నది. ఆశక్తి అనిర్వాచ్యము. కార్యానుమేయము. అంటే నిర్వచించడానికి శక్యం కానిది. అద్భుతమైన కార్యములు జరగడంతోనే ఊహించతగినది. దీనిని బట్టి వివరించుకుంటే సుషుమ్నానాడి కుండలినీశక్తిని ప్రసారం చేస్తుంది అని తెలుస్తుంది. విద్యుత్ ప్రసారాన్ని చేసే విద్యుత్ తీగ వంటిది. శక్తికి శక్తివంతమైన దానికి స్పష్టంగా బేధాన్ని నిరూపించలేము కావున ఈ సుషుమ్నా నాడినే కుండలినీ శక్తిగా యోగీంద్రులు వ్యవహరిస్తున్నారని గ్రహించ గలము.

యోగులు ఈకుండలినీ శక్తిని మేల్కొలిపి, మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూర, అనాహత, విశుద్ధ, ఆజ్ఞా, సహస్రార చక్రాలలో ఒక్కొక్క చక్రమునందు నిల్పి విహరింపజేసి, చివరికి పరబ్రహ్మంలో లీనమవుతున్నారు. శ్రీ శంకర భగవత్పాదులు సౌందర్యలహరి స్తోత్రంలో ఈ అనుభవాన్ని ఎంతో అద్భుతంగా వర్ణించారు.

శ్లో॥ " **మహీం మూలాధారే కమపి మణిపూరే హుతవహం**
**స్థితం స్వాధిష్ఠానే హృదిమరుత మాకాశముపరి**
**మనోపి భ్రూమధ్యే సకల మపి భిత్వాకుల పదం**
**సహస్రారే పద్మే సహరహసి పత్యా విహరసే"**

*తా:- అమ్మా! భగవతీ! నీవు మూలాధారచక్రమందున్న పృథ్వీ తత్త్వాన్ని విడిచి స్వాధిష్ఠానచక్రమందున్న జల తత్త్వాన్ని వదలి, మణిపూరక చక్రమందలి అగ్నితత్త్వాన్ని విడిచి, అనాహత చక్రమందలి వాయుతత్త్వాన్ని భేదించు కొని, దానిపైనున్న ఆకాశతత్త్వాన్ని విడిచి పెట్టి, భ్రూమధ్యమందున్న ఆజ్ఞాచక్రము నందలి మనస్తత్త్వాన్ని ఆకాశతత్త్వంతో సహా విడిచిపెట్టి, సుషుమ్నా మార్గాన్ని ఛేదించు కొని, సహస్ర దళ కమలమందు నీ భర్తయైన సదాశివునితో రహస్యంగా విహరిస్తున్నావు.*

ఈ కుండలినీ శక్తి ఏకాగ్రతలో ఉత్కృష్ఠ సమాహితం చేసే యోగులకు ప్రబోధం చెందుతుంది. ప్రాణాయామ పద్ధతిలో కుంభక ప్రాణాయామం చేసినపుడు కూడా ప్రబోధం చెందుతుంది. జన్మ సిద్ధులకు స్వభావం గానే ప్రబోధం చెంది ఉంటుంది. మహా మహిమాన్వితులందరికీ వారికి తెలిసినా,

తెలియకున్నా వారి యందలి కుండలినీ శక్తి ప్రబోధించెంది ఉంటుంది.

స్వామి వివేకానంద రాజ యోగ ఉపోద్ఘాతంలో కుండలినీ శక్తి ప్రభావాన్ని ఈ విధంగా వివరిస్తున్నారు.

"అతీంద్రియ జ్ఞానమును, ఆత్మసాక్షాత్కారమును, దివ్యజ్ఞానమును బడయుటకై కుండలినీ ఉద్బోధనమొక్కటియే మార్గము. ఈశ్వర ప్రేమ చేగాని, మహాపురుషుల అనుగ్రహముచేగాని నిత్యానిత్య వివేచనా సామర్థ్యము వలనగాని బహువిధములుగా కుండలినీ శక్తి మేల్కొనవచ్చును. ప్రకృత్యతీత మనియు, అలౌకికమగు శక్తి జ్ఞానము లెచట వ్యక్తమగుచుండునో అచట కుండలినీ శక్తి కొలదిగ సుషుమ్నాద్వారము నందు ప్రవేశించినదని యూహింప వలయును. సాధారణముగ నిట్టి సందర్భములనేకములందు కుండలినీ శక్తి యందొక లవలేశమును మేల్కొలుపునట్టి సాధన నేదియో ఒక దానిని తమకు తెలియకయే జనులు అవలంబించుచుందురు. ఎఱుకతో నొనర్చిన వారు, ఎఱుకలేకయే నొనర్చినను ఉపాసనల వలన గలుగు ఫలమిదియే. తమ ప్రార్థన లెవరివలననో సఫలమగుచున్నవనుకునే వాడుసిద్ధి తనయందుండియే గల్గు చున్నదని ఎరుగడు. తనయందే అణగియున్న అనంతశక్తి యందొక లవలేశమును ప్రార్థనా పూర్వకముగు మనః ప్రవృత్తిచే తాను మేల్కొల్పి గలిగితినని గ్రహింప కున్నాడు. కుండలినీ శక్తి ప్రతిజీవి యందును అణగియున్నది. తదనుగ్రహమును పొందుమార్గమును శ్రమించిన మాత్రమున మనకు శాశ్వతానందమును జేకూర్చును. జనుల జ్ఞానముచే భయభ్రాంతులకు లోనై అనేక నామములతో నర్చించుచుండునట్టిదీ కుండలినీ శక్తియేయని యోగులు చాటుచున్నారు. మరియు సమస్తమైన ఉపాసనలకును, ప్రార్థనలకును, శాస్త్ర విధులకును, క్రియాకలాపములకును ఆధారభూతమగు మూలతత్త్వమును నిరూపించు నట్టి మతతత్త్వ శాస్త్రమే రాజయోగము".
-చిరంతనానంద స్వామి తెలుగుసేత

సుషుమ్నానాడిహుగుద స్థానము నుండి 2 అంగుళములపైన మేఢ్రము (గుహ్యాంగము) నుండి రెండంగుళముల క్రింద, నున్నదైన నాలుగంగుళముల ఎత్తుకల కందము మధ్య నుండి, ఆవిర్భవించి సాగిన తీగవలె మేరు మధ్య భాగమునకు చేరి, మెడవరకు వెళ్ళి, అచట మేరు దండము వెలిభాగమున నున్న ఇడానాడికి, పూర్వభాగమునున్న గాంధారీనాడికిని, తవ ప్రక్కన నున్న

సరస్వతీనాడికిని, మధ్యన దక్షిణ కర్ణము వరకున్న శంఖినీ నాడి నాళము నాశ్రయించి, అచట రెండుగా విడిపోయి, వక్రగతితో ఒకటి లలాటమందు (నుదురు) చేరుతుంది. మరొకటి చిత్రిణీ నాడితో నాడితో కల్సి శిరస్సునందలి అధోముఖమైన సహస్రదళకమల కర్ణికయందున్న పండ్రెండు దళములు కల కమలము వరకు వ్యాపించి, విచ్చిన ఉమ్మెత్త పువ్వువలె తెల్లని కాంతి గలదై, ఈ సుషుమ్నానాడి, వజ్రానాడి, చిత్రిణీ నాడి అనే మూడు తత్త్వములు కలదానిగా మారును. వజ్రానాడిగ మారిన సుషుమ్నయే మేఢ్ర స్థానమునుండి ముందు చెప్పబడిన సుషుమ్నానాడి అంతరాళమున ప్రవేశించి, శిరస్సుపైన ఉన్న బ్రహ్మ రంధ్రాన్ని చేరి, తర్వాత చిత్రిణీ రూపమైన సుషుమ్నానాడి, మూలాధార చక్రమూలము నుండి రెండంగుళాలపైన పూర్వోక్తమైనను సుషుమ్నానాడి మధ్యన ప్రవేశించి ప్రణవప్రకాశంతో, బాలసూర్యప్రభకలదై మర్కట సూత్ర సమసూక్ష్మమగును. మేరు దండము మధ్యన ఉన్నటువంటి సుషుమ్నా, వజ్రానాడులు అంతరాళమున ఉన్న ఆధారాది షట్చక్రాలను భేదించు రూపిణియైన శివశక్త్యాత్మకముగు కుండలినికి షట్కమల విహారమునకు అనుకూలం కల్గిస్తూ, పరశివస్వరూపమైన ఊర్ధ్వబిందువు యొక్క అంతరాళమును చేరి, **బ్రహ్మనాడి** అనే పేరుతో శూన్యరూపమై నిలుస్తుంది.

## కుండలినీ శక్తి, ఉద్బోధ

ఇంతవరకు మనం మహా శక్తిరూపిణియైన కుండలినీ శక్తి ముఖ్యనాడీ సంచారాలను ముఖ్యతరమైన ఇడా, పింగళానాడి ద్వయ సంచారవిశేషాన్ని ముఖ్యతమమైన సుషుమ్నానాడి సంచారాన్ని తెల్సుకున్నాము. ఈ భాగంలో దర్శనానుభవాలగురించి, కుండలినీ శక్తి ఉద్బోధ గురించి శ్రీగురువులు ఉద్ధరించిన అంశాలను వివరించుకుందాం.

ఈ అంశాలనుగురించి ఉపనిషత్తులలో, ఇతరశాస్త్రగ్రంధాలలో ఎన్నో వివరాలున్నాయి. కాని ఆవిధానాలు చాలా కష్టసాధ్యంగా కన్పిస్తాయి. ప్రాణాయామ కుంభకస్థితిలో కుండలిని ఉద్బోధితమవు తుందని ఒక విధానం. మనోవృత్తిని ఆయాస్థానాలల్లో నిల్పి సాధన చేయడం మరొక విధానం. భావనోపనిషత్తులో చెప్ప బడిన ప్రత్యేక విధానం ఒకటిముఖ్యమైనవిగా కన్పిస్తున్నాయి. ఉపాసకులు వారి వారి

సంప్రదాయములననుసరించి, గురువుల ఉపదేశపద్ధతి ననుసరించి సాధనలు చేస్తూ ఉండవచ్చు. అనుభవాలను పొంది ఉండ వచ్చు. కాని యోగ శాస్త్రం "అధ సమ్యగ్దర్శనా భ్యుపాయోహి యోగః వేదే విహితః" అని ఘోషిస్తుంది. అంటే యోగము లెస్సగా దర్శించేందుకు మంచి ఉపాయం అని వేదమందు చెప్పబడింది అని అర్థం. అంతే కాక యథావద్వస్తు దర్శనమే సమ్యక్ దర్శనము అన్పించు కుంటుంది. అంటే ఏ వస్తువు ఏ విధంగా ఏరూపంతో ఉందో అదే **విధంగా ఆరూపాన్ని చూడడమే యథావద్వస్తు దర్శనం.** అట్టి దర్శనాన్ని పొందినప్పుడే ఉపాసన అనే మాట సార్థకమవు తుంది. ఏదో భావనా చిత్రంగా, రేఖామాత్రంగా భావించడం చాలా కష్టమని ఉపాసకులకు తెల్సినదే! ఆ ఉపాస్య వస్తువు లేదా దేవత కల్పితమూర్తి అయినప్పుడు ఎంత కాలమని నిలుస్తుంది ? ఒకవేళ నిలుపు కుందామని సాధన చేసినా, ఏమైతుందో ఆయా ఉపాసకులకే తెలుస్తుంది. శ్రీగురువులు ఉద్ధరించిన అభ్యాసయోగ దర్శన ప్రణాళికలోని సులభ తర పద్ధతిని క్రమవిధానంతో తరగతి వారీగా సాధన చేసినప్పుడు పొందే అనుభవాలు "సమ్యగ్దర్శనాన్ని" కల్గిస్తాయని మరొక్కసారి మనవి చేస్తూ, భావనను గురించి కొంత వివరించు కొందాం.

**భావన:-**

ఉపనిషత్తులలో, శాస్త్రాదులలో ఉపాసన భావనతోనే ఉన్నట్లు కన్పిస్తుంది. ఆభావనకు పూర్వరంగంగా కొన్నిఏకాగ్రతా రూప సాధనలు, కొంత సమాహితం చాలా అవసర. దీనికి ప్రమాణం భగవద్గీత సాంఖ్య యోగంలోని 65, 66 శ్లోకాలకు జగద్గురు శంకరుల భాష్యాన్ని పరికిస్తే శ్రీగురువుల అభ్యసయోగదర్శన ప్రణాళికలో గల విశిష్టతను అర్థం చేసుకోవచ్చు.

శ్లో॥ **ప్రసాదే సర్వదుఃఖానాం హాని రస్యోపజాయతే।**
**ప్రసన్న చేత సోహ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే॥**

**భాష్యం :-** ప్రసాదఇతి, ప్రసాదే సర్వదుఃఖానాం ఆధ్యాత్మికాదీనాం హానిః వినాశః అస్యయతేః ఉపజయతే కించ- ప్రసన్న చేతసః శుద్ధాంతః కరణస్యహి యస్మాదాశు శీఘ్రం బుద్ధిః పర్యవతిష్ఠతే. ఆకాశమివ పరిసమంతాత అవతిష్ఠతే. ఆత్మస్వరూపేణైవ నిశ్చలాభవతి. ఏవం ప్రసన్న చేతసః అవస్థిత బుద్ధేః కృతకృత్యతాయతః, తస్మాత్ రాగ ద్వేష విముక్తిః ఇంద్రియైః శాస్త్రవిరుద్ధేషు, ఆవర్జనీయేషు యుక్తః సమాచరేత ఇతి వాక్యార్థః.

భాష్యం అవ:- స్మ్రాయతేసేయం ప్రసన్నతాః

శ్లో॥ నాస్తిబుద్ధి రయుక్తస్య నచాయుక్తస్య భావనా
నచా భావయుత శ్శాంతి రశాంతస్య కుతస్సుఖం?

- గీత-సాంఖ్య యోగం - శ్లో 66

**భాష్యం :-** నాస్తి ఇతి నాస్తి నవిద్యతే నభవతేత్యర్థః బుద్ధిరాత్మ స్వరూప విషయా, అయుక్తస్య అసమాహితాంతః కరణస్య నచాస్త్యయుక్తస్య భావనా. ఆత్మజ్ఞానాభినివేశః.

పైరెండు శ్లోకముల సారాంశము:- ఇంద్రియములను రాగద్వేషములతో జతచేయకవిషయముల యందు ప్రవర్తింపచేయవలెను. తనకు వశ్యములుగ నింద్రియముల చేసుకున్నవాడు ప్రసన్నత పొందును. ప్రసన్నత వల్ల ఆధ్యాత్మికాది సర్వదుఃఖములు నశిసిపోతాయి. ప్రసన్నచేతము కలవానికి బుద్ధి ప్రశాంతంగా నిలుస్తుంది. సమాహితం పొందని మనస్సు కలవానికి (ఏకాగ్రతలో ఉత్తమస్థితి పొందని వానికి) బుద్ధి నిల్వదు. వాడేఅయుక్తుడు. అట్టివానికిభావనాపటిమ కావలెనంటే ఏకాగ్రతారూపసాధనలో ఉత్తమస్థితిని పొందవల్సి ఉంటుంది. సూక్ష్మశరీరభాగాల దర్శనం కావలెనంటేసాధకుడు క్రింది తరగతులతో సులువైనబహిర్లక్ష్యాలను ప్రారంభించి సాధనచేసినప్పుడే షట్చక్రాలను దర్శింపగలడు. అందుకేమొట్టమొదటివిద్య త్రాటకంలో బహిర్లక్ష్యం ఏర్పరచబడింది. ఇందలి జ్యోతిర్దర్శనం మొదటిమెట్టు. క్రమంగా బాహ్యలక్ష్యాలైనవిద్యలు సుమారు 10,15 ధారణలుచే సాధకుడు ఒక క్రమ పద్ధతికి అలవాటు పడి, సమాహితం చెందగలడు. తద్వారా సూక్ష్మచక్రదర్శనాలను పొందగలడు. జ్యోతిస్వరూపంతో ఎంతనిగూఢమైన వస్తువులను కూడా స్పష్టంగా దర్శించవచ్చని అందరికీతెల్సినవిషయమే. అభ్యాసయోగంలో ఏకాగ్రతవల్ల మనస్సు జ్యోతీ రూపాన్ని పొందుతుంది. అందువల్లనే జ్యోతీరూపమైనసూక్ష్మ శరీరాంతర్గతషట్చక్ర, శ్రీచక్ర దర్శనాను భవాలను సాధకులు పొందగలరు. ఇదే-ఈ "అధ్యాత్మ దర్శన అభ్యాస యోగం" యొక్క లక్ష్యం. సాధకులకు "యధావద్వస్తు దర్శనం" అనేసమ్యగ్దర్శనం కల్పించడానికి శ్రీగురువులు ఉద్ధరించిన-ఈ అధ్యాత్మ విద్యాసాధనప్రణాళికఎంతో ఉపకరిస్తుందని దానిని అనుసరించి సాధకులు జగత్కల్యాణకృత్తులు కాగలరని విశ్వసిస్తూ జగదభ్యుదయాన్ని ఆకాంక్షిస్తూ ఈ ప్రణాళికను మీ ముందుంచుతున్నాము.

# అధ్యాయము - 4

## శ్రీ చక్ర దర్శన విద్య

తత్త్వవేత్తలైన భారతీయ ఋషులు జగత్తుకు ప్రసాదించిన మహాద్భుత, పరమోత్కృష్ణ భోగ, మోక్ష, జ్ఞానసాధనమే శ్రీవిద్య. శ్రీ చక్ర విద్య. వీటిని విడిగా పేర్కొన్నా, సాధనలో రెండింటి సమ్మేళముంటుంది. సాధకుడు అధ్యాత్మ దర్శనాభ్యాసంలో మహోన్నత స్థాయిని పొందినప్పుడే శ్రీచక్ర విద్యా దర్శనాలను, అనుభవాలను పొందలేడనడం నిశ్చయంగా చెప్పవచ్చు.

శ్రీ చక్రము జగత్తుకు మాతాపితరులస్వరూపంగా ఉంది. దీన్ని చక్ర రాజంగా పేర్కొన్నారు. అద్వితీయ బ్రహ్మమునుండి, జగత్తు, జీవుడు, సృష్టి క్రమము వంటి పరమరహస్యాలను, సాధకుడు, శ్రీచక్రవిద్యోపాసన ద్వారా తెల్సు కొని స్వతంత్రుడైతాడు. బ్రహ్మాండపిండాండాల, ఈశ్వర శక్తుల, స్థూల, సూక్ష్మ, కారణశరీరాలను విడివిడిగా దర్శించి, ఇవన్నీ మార్పు చెందేవని నిశ్చయించుకొని, ఎన్నటికీ మార్పు చెందని సత్య, శివ సుందరమైన నిరతిశయ సుఖ స్వరూపాన్ని పొంది ధన్యుడయ్యేందుకు పరమసాధనము శ్రీ విద్య. అంతేకాకుండా పర- అపరా ప్రకృతి నంతా తన స్వాధీనం చేసుకొని, పూర్ణ పురుషుడై, పరమాత్మయై, స్వమహిమతో ప్రకాశిస్తాడు.

శ్రీ విద్య శ్రీ చక్రములు ఒకటే అని నిశ్చయించుకొన్నప్పుడే పూర్ణ దృష్టికల్గుతుంది. "శ్రీ" అంటే బ్రహ్మశక్తి అని శాస్త్ర నిర్ణయం. ఈ విద్య శృతి చోదితము. కాబట్టి తాంత్రికులు వేరువేరు పద్ధతులలో ఉపాసిస్తున్న ప్పటికీ, సంపూర్ణ జ్ఞాన నిష్ఠులైన శ్రీశంకర భగవత్పాదులు, వారి పరమ గురువులు గౌడపాదాచార్యులు సౌందర్య లహరి, సుభగోదయము అనే గ్రంధాలను రచించి, శాస్త్రఆచార్య గురూప దేశ సాంప్రదాయానికుత్తేజము కల్గించి, ఉపాసకులకు మహోపకారాన్ని ఒనరించినారు. శ్రీ పుణ్యానంద మునీంద్ర విరచితమైన కామకళావిలాసములో, ఈశ్రీవిద్య కృతయుగాది నుండి గురుశిష్య సంప్రదాయం ద్వారా వ్యాప్తిలో నున్నట్లు తెల్పబడింది.

కృతయుగం లో పరమ శివుడు శ్రీచక్ర బిందు పీఠమందధివసించి, తనలోని అంశరూపమైన విమర్శరూప పరాశక్తికి ఈ విద్యను ఉపదేశించినాడు. ఆపరాశక్తి ఉమామహేశ్వరులకు, లక్ష్మీనారాయణులకు, వాణీ హిరణ్య

కు పదేశించి, విస్తరింపచేసింది. క్రమంగా వారినుండి ఇంద్రాది దేవతలు
ం పొందినారు. వీరిని "దివ్యౌఘము" అని పిలుస్తారు. అంటే ఈ
ద్యకు దేవతలలోని గురుసమూహమని అర్థం. దివ్యౌఘము నుండి
సి సిద్ధౌఘమునకు, వారినుండి మానవౌఘమునకు ఉపదేశపరంపరగా
విద్య ప్రవర్తిల్లుతుంది.

బ్రహ్మాండ పురాణాంతర్గతమైన శ్రీ లలితా రహస్య నామ స్తోత్రము,
కామేశ్వరీ కామేశ్వరీ కృత త్రిశతీస్తోత్రము లలోని శ్రీ చక్రమహిమను
ని హయగ్రీవులు, అగస్త్యునితో ఈవిధంగా వివరిస్తారు.

'ఓ అగస్త్యా! జన్మమధ్యలో ఏదో ఒక్కసారైనా ఈ సహస్రనామాన్ని
పఠిస్తారో వారికి లభించే పుణ్యఫలం-కాశీక్షేత్రంలో కోటి శివలింగ
లు చేసిన పుణ్యాన్ని, కురుక్షేత్రంలో ఒక్కొక్కడు మోయగల్గినంత
ాన్ని కోటి మంది బ్రాహ్మణులకు దానం చేసిన ఫలం, నిర్జలమైన ఎడారి
ంలో కోటిబావుల త్రవ్వించిన ఫలం, కరువు రోజులలో ప్రతి రోజూ
మందికి భోజనం పెట్టిన ఫలం, పైపుణ్యకార్యాలన్నింటి ఫలాన్ని ఒకటి
దాని కన్నా కోటి రెట్ల పుణ్యం, కల్గుతుందని తెలుసుకో!"

త్రిశతీ పఠన ఫలం గురించి ఇంకా గొప్పగా చెప్పబడింది. లలితా
నామసంకీర్తనంచే లభించే పుణ్యానికి కోటికోటి రెట్ల పుణ్యం
నామాన్ని భక్తితో పఠిస్తే లభిస్తుంది.

ఏ వివరణను బట్టి మనం తెల్సుకోవాల్సిన మహా గంభీరార్థమొకటుంది.
నామ కీర్తనమే ఇంతటి ఫలాన్నిస్తున్నపుడు, శ్రీవిద్యా, శ్రీచక్ర
ర్శ దర్శనానుభవాల మహిమ ఎంతటిదో చెప్పశక్యమా? అందుకే శ్రీ
లు శ్రీశివ సచ్చిదానంద సరస్వతీ స్వామి ఈ శ్రీచక్ర, శ్రీవిద్యల
నుభవాలను శిష్యసాధకులకు ప్రసాదించినారు.

ఆత్మానాత్మ వివేకము మాటలతో, ప్రవచనాలతో అనుభవానికి రాదు.
" అనే శబ్దాన్ని నిర్వచిస్తూ శ్రీ శంకరులు గీతాభాష్యంలో **విభజ్య
ం వివేకః** అని సెలవిచ్చినారు. విభజించి చూడడమే వివేకం!
రమైన, సుసూక్ష్మమైన శరీరాంతర్గత శ్రీ చక్ర దర్శనం, ఆత్మానాత్మ
న్ని ప్రసాదించడమే ముఖ్య ప్రయోజనం కలదిగా ఉంది. గీతలో
కుడైన శ్రీకృష్ణుడు క్షేత్ర-క్షేత్రజ్ఞ విభాగయోగంలో, క్షేత్ర జ్ఞానం,

క్షేత్రజ్ఞజ్ఞానం అని రెండింటికి పేర్కొని, వాటిలో క్షేత్రజ్ఞానమే (అంటే అనుభవమే) తనకు ఇష్టమైనదిగా ప్రకటించినాడు. శృతి చెప్పే "నేతి, నేతి" అనే నిషేధ పద్ధతిలో ఉపదేశించిన విధంగా ప్రతివస్తువు (ఆధ్యాత్మ సంబంధమైనది), దానిని బాగా దర్శించినప్పుడే అది తనుకాదని నిషేధింప గల్గడం సాధ్యమౌతుంది. ఈవిధంగా అభ్యుదయ పూర్వక నిశ్శ్రేయస్సును పొందాలన్నా, కేవలం నిశ్శ్రేయస్సు పొందాలన్నా సమ్యగ్దర్శనమే ఏకైక మార్గమని తెలుస్తుంది కదా!

నామరూపాత్మకమైన జగత్తు "మిధ్య" అని తెల్సుకొనేందుకు సమ్యగ్దర్శనమే తరుణోపాయం. కాబట్టి శ్రీ గురువులు "త్రాటకం"మండి ప్రారంభించి క్రమంగా ఏకాగ్రత పెంచుతూ దక్షిణామూర్తి, దత్తాత్రేయ, మండల, భూచరీ, స్థూలభూతి, మూర్తిజ్యోతి, ధాతు విద్యలలో పరిపాకం చెంది, శ్రీచక్రదర్శనానికి సాధకులు అర్హులు కావాలనే ఈప్రణాళికను ఏర్పరచినారు. శ్రీచక్రాంతర్గత వస్తువులను విడివిడిగా దర్శనానుభవము పొందుతూ, సిద్ధిపొందుతాడని ఋజువుచేసినారు. దీనికి ముందుగా కొన్ని విషయాలను వివరించుకుందాం!

జగత్తునామ రూపాత్మకం ఈసృష్టిలోనున్న పదార్థాలన్నీ (చరాచరాలు) ఐదురకాలైన స్వభావాన్ని కల్గిఉన్నాయి. అవి 1)ఉండడం 2)ప్రకాశించడం 3)ప్రియం చెందడం 4)రూపం(ఆకారము) 5)నామం(పేరు).

పైఐదింటిలో 1,2,3 మార్పుపొందవు. 4,5(నామ,రూపాలు) మాత్రము ఎల్లప్పుడు మారుతూనే ఉంటాయి. ఆధ్యాత్మిక పరిభాషలో మొదటిది సత్యం రెండవది-మిధ్య. ఈ సత్యాసత్య మేళనమే జగత్తు.

మన అనుభవానికి కన్పించేది నామరూపాత్మకమైన జగత్తే. వివిధ ఆకారాలతో, రకరకాల పేర్లతో మనకు ప్రత్యక్షంగా కన్పిస్తున్నది. శృతి స్మృతులను బట్టి మనకు కన్పించని లోకాలెన్నో, ఉన్నట్లు తెలుస్తుంది. 14 లోకాలు, స్వర్గ నరకాలు అన్నీ కలిసిన ఒక గోళాన్ని బ్రహ్మాండము అని పిలిచినారు. ఇట్టి బ్రహ్మాండాలు ఎన్నోకోట్లున్నాయి. దీన్ని ఊహించడం కూడా శక్యంగాని పనే. ఒక బ్రహ్మాండానికి అధిష్ఠాతగా ఒకబ్రహ్మ ఉంటాడు. చీమ మొదలు ఆ బ్రహ్మ వరకున్న జీవులన్నింటినీ పిండాండము అని పిలుస్తారు. ఈ సృష్టికి కారణం శివశక్తుల సమ్మేళనమే. శివశక్తులంటే ఏమని వివరించుకోవడం అవసరం.

*ఈ జగత్సృష్టికి పూర్వం ఒకే ఒక్కటి (అద్వితీయబ్రహ్మం) మన వాక్కులకు అందనిది, నిశ్చల చైతన్యము, స్వప్రకాశమున్నది. దానినే ఆత్మ, బ్రహ్మము అని శృతి, స్మృతి, ఉపనిషత్తులు పేర్కొంటాయి. సచ్చిదానంద చైతన్యము అలలు లేని సముద్రం వలె ప్రశాంత గంభీరంగా ఉండినది. ఇందులో నుండి ఒకకోరిక (ఇచ్ఛాశక్తి) ఒక అలవలె కల్గింది. అనితైత్తరీయోపనిషత్ తెల్పుతుంది.*

## నిశ్చల చైతన్యమే శివ – అందు లోనుండి కల్గిన ఇచ్ఛయే శక్తి

ఈ శివశక్తుల సమ్మేళనం కారణం. దానివల్ల కల్గిన కార్యమే జగత్తు. ఈ కార్యకారణ సంబంధ సంవిధానవే శ్రీ చక్ర-శ్రీ[illegible] స్వరూపము (తత్త్వము). నిర్వికార నిరంజనమైన బ్రహ్మతత్త్వము (శివ) పరా శక్తి లేకుంటే స్పందన లేని స్థితిలో ఉంటాడని సిద్ధాంతం. అందుకే ఆదిశంకరులు సౌందర్యలహరిలో ఈవిధంగా స్తోత్రం చేస్తున్నారు.

> **"శివశ్శక్త్యాయుక్తోయది భవతి శక్తః ప్రభవితుం**
> **న చేదేవం దేవః నఖలు భవతి స్పందితుమపి".**

తా:- శివుడు శక్తితో కూడినప్పుడే సృష్టిచేసేందుకు సమర్థమైన వాడౌతాడు. ఆదేవుడట్లు శక్తితో కూడకున్న కొద్దిగాకూడా కదలలేడుకదా!

పైన జరుపుకొన్న విచారణను బట్టి ఒకే ఒక్కటి రెండుగానైనట్లు తెలుస్తుంది. ఈరెంటిని శ్రీవిద్యా పరిభాషలో బిందువులుగా ఏర్పరచు కొన్నారు.




ఈరెండూ నామరూపాలకుకారణంగా ఒప్పుతున్నాయి.



నామాత్మకమైన జగత్తుకు అహం అన్నదే మూలకారణంగా ఉంది. సర్వ శాస్త్రాలు, వేదాలు, ఉప నిషత్తుల వంటి విజ్ఞానానికి ఈ "అహం" నుండే ఉద్భవించినాయి. అట్లే రూపాత్మక జగత్తుకుడా ఈ "అహం" నుండే పుట్టింది.

పై చిత్రంలోని త్రికోణమధ్యబిందువు స్వప్రకాశబిందువు. ఆబిందువులో ఇచ్ఛాశక్తి స్పందించినప్పుడు త్రికోణరూపంగా ఏర్పడింది. ఆమే పరాశక్తి. ఈశక్తిలేనిదే పరమశివుడు కదలుటకుకూడా సమర్థుడు కాడు. ఈశివశక్తి సమ్మేళనమే, సత్య, అసత్య, మిశ్రమ రూపమైన జగత్తు. దీన్నొక లౌకిక దృష్టాంతంలో సమన్వయిస్తే ఇంకా సుబోధకంగా ఉంటుంది. సూర్యకాంతినిఅద్దంలో ప్రతిఫలింపచేసినప్పుడు అందులో నుండి వెలువడ్డకాంతి ప్రక్కనున్న గోడపై పడుతుంది కదా! అదేవిధంగా స్వప్రకాశచైతన్యం (మాయ) శక్తి అనే అర్థం పైన ప్రసరించి, శరీరంలోని చిత్తము(మనస్సు)పై ప్రతిఫలిస్తుంది. దాని ప్రభావంతో ఆమనస్సే నేను(అహం) అనే భావం ఏర్పడి, స్థూల శరీరాన్ని తానుగా భావించడం జరుగుతుంది. ఈ దేహభ్రాంతి వల్లనే జీవులు జనన మరణాది క్లేశాలను పొందుతున్నారు. అట్లుకాకుండా అంటే సూర్యకాంతి ప్రతిఫలించడంలో మార్పుకల్గనే కాని, సూర్యకాంతికి మార్పు లేనట్లే ఆత్మ చైతన్యానికి మార్పుండదు. గోడవంటి చిత్తమునకు, శరీరానికి మాత్రమే మార్పు కల్గుతుంది. హాని వృద్ధి వికారాలు వీటికే. ఇది తెలుసుకొని, అనుభవానికి తెచ్చుకున్న వారే నిత్య సుఖ స్వరూపులౌతున్నారు. పై మధ్యబిందువుతో కూడిన కోణత్రయబిందుయుత స్వరూపమే, శివ శక్తి సమ్మేళనమే శ్రీచక్రము.

**"త్రికోణ రూపిణీశక్తిః బిందురూప శివస్మృతః"** శ్రీచక్రమందలి త్రికోణరూపమే శక్తి. బిందూరూపమే శివుడు.

ఉప నిషత్తులల్లో, భగవద్గీతలో వివరింపబడిన అశ్వత్థ వృక్షము, శ్రీచక్రము, శ్రీవిద్యలు పిండాండబ్రహ్మాండములు విరాట్‌స్వరూపమైన జగత్సృష్టికి, స్థితికి, లయానికి ప్రతిరూపాలు. మనకు అతి సన్నిహితమైన, మనమే దాన్నిగా పరిగణిస్తున్న మనశరీరసృష్టిని, అందలి శక్తులను గురించి తెల్సుకుంటే, ఈమిగిలిన జగత్సృష్టినంతా తెల్సుకున్నట్లే! శాస్త్రజ్ఞుడు

సముద్రజలంలో ఒకచెంచానీటిని పరిశోధించి సముద్రాని కంతా ఆ లక్షణాలను అన్వయిస్తాడు గదా! అట్లే ఇదికూడా!

మన తత్త్వవేత్తలలో అగ్రగణ్యుడైన వ్యాసమహర్షి "బ్రహ్మసూత్రములకు" **శారీరక మీమాంస** అని పేరు పెట్టడంలో ఈ భావమే ప్రస్ఫుటమౌ తుంది. ఆదిశంకరాచార్యులు ఆసూత్రభాష్యానికి "శారీరక భాష్యము" లేదా **"అధ్యాసభాష్యము"** అని పేరు పెట్టినారు. శారీర (అశ్వత్థ) వృక్షాన్ని గురించి వివరించుకుంటే శ్రీచక్ర, శ్రీవిద్యల ఉపాసనను గురించి బాగా అర్థమౌతుంది.

ఈ అశ్వత్థ వృక్షము మామూలు వృక్షముల వంటిది కాదు. వేరు పైకి కొమ్మలు క్రిందికి కల్గి తల్లక్రిందులుగా ఉంది. భగవద్గీత 15 వఅధ్యాయం పురుషోత్తమ ప్రాప్తియోగంలో అశ్వత్థ వృక్షాన్ని గురించి విపులంగా వివరించినారు. ఆవిధానాన్ని అనుసరించి సాధన చేసిన ఉపాసకుడు పరమాత్మయందులీనమై ధన్యుడైతాడని చెప్పినారు. ఆది శంకరులు తమ గీతా భాష్యంలో గీత ఉపదేశం ఇంతటితో ముగిసిందని మిగిలిన 3 అధ్యాయాలు ఉపదేశం యొక్క సమీక్ష మాత్రమే అని తెల్పినారు. ఈపర్యాలోచన మనకు శ్రీ చక్ర శ్రీవిద్యాదర్శన మహత్తును తెల్పుతుంది. స్థూల విగ్రహ, శ్రీచక్రయంత్రములకు చేసే పూజాదుల వల్ల తగిన ఫలితం ఆస్తికులు పొందగలరు. కాని ఆధ్యాత్మికోపాసన విధానంలో శ్రీచక్రార్చనం చేయడం, యోగ విద్యాక్రమంలో శ్రీచక్రదర్శనానుభవం పొందడం యోగసాధకుల పరమ లక్ష్యమై ఉండవలెనని వక్కాణిస్తున్నాము. అశ్వత్థ వృక్షాన్ని గురించి ఇంకా సమాలోచన చేయవలసి ఉన్నది.

ఈ ప్రకరణారంభంలో పేర్కొన్న స్వయంప్రకాశ బ్రహ్మ చైతన్యం ఇదివరలో మనం తెలుసుకున్న షట్చక్ర దర్శన విద్యలో సహస్రారకమలం శిరస్సు పైభాగంలో ఉంది. ఆకమలంలో చంద్రమండల దర్శనం చెప్పబడింది. ఆచంద్ర మండలమే ప్రత్యగాత్మ స్థానము. ఈ ప్రత్యగాత్మయే "సాక్షి" "కూటస్థుడు" "పరమాత్మ" అని పిలువబడుతున్నాడు. ఆ ప్రత్యగాత్మ నుండే జగత్సృష్టి జరిగిన విధానాన్ని శృతిస్మృతులు, శ్రీ చక్రవిధానము వివరిస్తున్నాయి. అఖండ స్వప్రకాశబ్రహ్మ చైతన్యం శాంత గంభీరం చలన రహితం. దానిలోనే అంతర్లీనమై శక్తి ఉంది. ఈబ్రహ్మచైతన్యానికి సృజించు ఇచ్ఛకల్గినంతనే దాని నుండి శక్తివిడివడింది. బహిర్గతమైంది.

దీన్నే తైత్తరీయో పనిషత్ వివరిస్తుంది.

సోఽకామయత! బహు స్యాంప్ర జాయేయేతి! సతపోఽతప్యత! సతపస్తప్త్వా! ఇదగ్ం సర్వ మసృజత! యదిదం కించ! తత్సృష్ట్వా! తదేవాను ప్రావిశత్! తదను ప్రవిశ్య సచ్చత్యచ్చాభవత్! నిరుక్తంచా నిరుక్తంచ, నిలయం చానిలయంచ, విజ్ఞానంచా ఽవిజ్ఞానంచ, సత్యంచానృతంచ, సత్యమభవత్! యదిదంకించ! తత్సత్య మాచక్షతే! తదప్యేష శ్లోకో భవతి! -తైత్తరీయోపనిషత్- ఆనంద వల్లీ

## శ్రీ చక్ర దర్శన విద్య

సహస్రార చక్రము లోని కమలమధ్య బిందువే శ్రీచక్రం లోని మధ్యబిందువు. ఆబిందువు నుండి త్రికోణము శక్తి, అదే ఆజ్ఞాచక్రము. ఆఇచ్ఛాశక్తి నుండి నాదము పుట్టి ఒకవైపు నామాత్మక జగత్తు. మరొక వైపు రూపాత్మక జగత్తు ఉద్భవించినాయి. రూపాత్మక జగత్తు 24 తత్త్వములుగా ఏర్పడింది. మహత్తత్త్వమునుండి అహం కారము, దాని నుండి మనస్తత్త్వము దానినుండి శబ్ద, ఆకాశ, శ్రోత, వాక్, స్పర్శ, వాయు, త్వక్, పాణి, రూప, అగ్ని, చక్షు, పాద, రస, జల, జిహ్వా, ఉపస్థ, గంధ, పృధ్వి, నాశిక, వాయువు ఇవన్నీ క్రమంగా సృష్టించ బడినాయి. శక్తితో కూడా కలిపి ఇవి 24.

*గమనిక :- ఈ అన్ని తత్త్వములలో కూడా నామాత్మక శాఖలో కూడా శివశక్తి సమ్మేళనముందని గ్రహించాలి.*

నామరూపములు శబ్దార్థముల వలె అవి భాజ్యములు. అంటే విడదీయ శక్యంకానివి. శబ్దాన్ని , అర్థాన్ని కూడా విడదీయలేంకదా! ఈగంభీరార్థాన్నే కాళిదాసమహాకవి క్రింది శ్లోకంలో వివరించినాడు.

**"వాగర్థావివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే**
**జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ !!"**

జగన్మాతాపితరులు శబ్దార్థములవలె కలిసిపోయినారు. వారిని విడదీయలేము.

నాదమునకు పూర్వస్థితి అవాఙ్మానసగోచరము. దానినే " పరా" అని పిలిచినారు. అది బిందురూపము అదివరౌనవ్యాఖ్యానరూపము బ్రహ్మచైతన్యము. అది రెండుగానైనప్పుడు " : " విసర్గలుగా మారుతుంది.

విసర్గ ఉచ్చారణ దగ్గరినుండే నాదానికి **పశ్యంతి, మధ్యమ, వైఖరి** అనేస్థితులు కల్గుతున్నాయి.

సహస్రారకమలంలోని బిందువు "పరా!" దాని క్రింద ఉండే శక్తి త్రికోణమునుండి క్రమంగా "ః" విసర్గధ్వని. అక్కడినుండి సూక్ష్మమైనస్థితిలో "పశ్యంతి" దాని నుండి "మధ్యమ", దాని నుండి "వైఖరి" కల్గుతుంది. ఈవైఖరిస్థితిలోనే మనం శబ్దాన్ని బాహ్యంగా వినగల్గుతున్నాం. మూగవారికి ఈవైఖరి స్థితి మాత్రం ఉండదు. మిగిలిన 3 స్థితులు ప్రాణులన్నింటికీ సమానమే.

ఈ మధ్యమ, సూక్ష్మ, స్థూల స్థితులను కల్గి ఉంది. పరా ... మధ్యమా శక్తులనుండి అ నుండి క్ష వరకు 51 అక్షరములు పుట్టినాయి. అవి సుసూక్ష్మస్థితిలో ఉద్భవించినాయని తెల్సుకోవాలి. ఈ అక్షరాల నుండి పదాలు, వాక్యాలు, మంత్రాలు వంటి విశ్వ విజ్ఞాన కోశమంతా సృష్టించ బడింది. ఈవిధంగా శ్రీచక్ర శ్రీవిద్యలు శివశక్తి సమ్మేళనమై నామరూపజగత్తుగా ఉన్నాయి.

"బిందు, త్రికోణ, వసుకోణ, దశారయుగ్మ, మన్వస్ర, నాగదళ, షోడశ పత్ర కంచ;
వృత్తత్రయంచ, ధరణీ సదనత్రయంచ, శ్రీచక్రమే తదుదితం పరదేవతాయాః"

1) బిందువు 2) త్రికోణము 3) వసుకోణము (అష్టకోణము) 4) దశకోణములు రెండు 5) చతుర్దశకోణం 6) అష్టపత్రము 7) షోడశదళము 8) వృత్తత్రయము(మూడు వృత్తములు) 9) భూపురత్రయము. ఈవిధంగా తొమ్మిది భాగాలలో శ్రీ చక్రముంది. ఈ తొమ్మిదిలో 4 శివచక్రములు 5 శక్తిచక్రములు.

**శివచక్రములు :-** 1) బిందువు 2) అష్టదళము 3) షోడశ దళము 4) చతురస్రమైన మూడు రేఖలు.

**శక్తిచక్రములు :-** 1) త్రికోణము 2) అష్టకోణము 3) దశకోణములు రెండు 4) చతుర్దశకోణము 5) వృత్తత్రయం (మూడు వృత్తములు) ఈతొమ్మిది చక్రముల మేళనము ఈవిధంగా ఉంటుంది.

1) త్రికోణములో బిందువు లీనమై ఉంది.
2) అష్టకోణములో అష్టదళము లీనమై ఉంది.
3) దశకోణములు రెండింటిలో షోడశ దళము మేళనమై ఉంది.
4) చతుర్దశకోణములో భూపురము మేళనమైంది.

ఈవిభాగము తెలియక చేసే శ్రీచక్రార్చన ఫలించదు. శ్రీలలితా పరాభట్టారిక సంతృప్తి పొందదు అని చెప్పబడింది.

షట్చక్రములలోని సహస్రారకమలంలోని భాగాలతో శ్రీచక్రంలోని త్రికోణాది చక్రములతో సమన్వయం పొందు విధానాన్ని ఇంకా వివరించు కుందాం.

*గమనిక :- శ్రీ చక్రమధ్యమందలి బిందువు సహస్రారంలోని చంద్రమండలంలో ఉంది. ఆజ్ఞాచక్రమందున్న కర్ణికలో శ్రీచక్రంలోని త్రికోణముంది. విశుద్ధ కమలంలో శ్రీచక్రంలోని అష్టకోణము కర్ణికగా ఉంది. అనాహతకమలంలో శ్రీ చక్రంలోని బహిర్దశకోణము కర్ణికగా ఉంది. స్వాధిష్ఠానకమలంలో చతుర్దశ కోణం కర్ణికగా ఉంది. మూలాధార కమలంలో భూపురం కర్ణికగా ఉంది.*

## శ్రీ చక్ర శ్రీ విద్యల సారాంశం:-

శ్రీ విద్య శ్రీచక్రం రెండూ ఒక్కటే అని చెప్పుకున్నాం. రెండుగా ఎందుకు వ్యవహరిస్తున్నారో కొంచెం చర్చించవచ్చు. ఈ జగత్తు నామ రూపాత్మకం. కంటితో రూపాన్ని చూస్తాము. చెవితో శబ్దాన్ని వింటాము. ఉపాసనలో నాదము(శబ్దము) ప్రాధాన్యము వహిస్తుంది. మంత్రోచ్చారణ ద్వారా (జపం) దాన్ని పొందే సాధనం శ్రీవిద్య.

"విద్య" ను నిర్వచిస్తూ శ్రీ శంకరులవారు **"వేత్తుం ప్రతిపరమ సాధనం విద్యా"** అన్నారు. ఈ అభ్యాసయోగంలోని ప్రతివిధానాన్ని విద్యగా పిలుస్తున్నాం. **"అధ్యాత్మవిద్యావిద్యానాం"** అని గీతావాక్యం. విద్యలలో అధ్యాత్మ విద్యయే భగవంతుడు. **అధ్యాత్మము అంటే శరీరం మొదలు కొని అందలి వివిధ శక్తులు. దాన్ని తెలుసుకోవడమే అధ్యాత్మ విద్య.** నాదాన్ని అర్థభావనతో ఉచ్చరిస్తూ మనస్సును ఏకాగ్రం చేయడం ఒకపద్ధతి. కేవలం చూపుతో మనస్సును ఏకాగ్రం చేయడమే మరోపద్ధతి. ఇవి రెండూ ఉపాసనాభాగాలు. వీటిలో మొదటి పద్ధతిని శ్రీవిద్య అని రూఢిగా వ్యవహరిస్తున్నారు. రెండవ పద్ధతిని దర్శనము అని వ్యవహరిస్తున్నారు. ఈ రెంటి లక్ష్యము ఒక్కటే కాని సూక్ష్మంగా వివేచిస్తే రెండు పద్ధతులలో మనస్సును చూపుద్వారా ఏకాగ్రం చేయడమే భావనా పటిమను కల్గిస్తుందని తెలుస్తుంది. లౌకిక వ్యవహారంలో కూడా చూచి గ్రహించడానికి, విని గ్రహించడానికి తేడా ఉంది కదా! చూచి గ్రహించడమే మేల్తరము. శ్రీ విద్యను

మంత్ర జపంగా పేర్కొని, శ్రీ చక్రవిద్యను యోగ దర్శనవిద్యగా పేర్కొంటే విషయం స్పష్టమౌతుంది. మంత్ర జపం క్రమంలో కూడా స్థూల, సూక్ష్మ కారణాలను తెల్సుకోవడం అవసరం.

*గాయత్రీ మంత్రము - స్థూలము; పంచదశీ మంత్రము - సూక్ష్మము*
*షోడశీ మంత్రము - కారణము; కామకళా ఏకాక్షరీ - పరాశక్తి.*

పంచదశాక్షరీ మంత్రమే శ్రీవిద్యగా శాస్త్ర కారులు పేర్కొన్నారు. "అహం పంచాక్షరీ సాక్షాత్ త్వంతు పంచదశాక్షరీ దేవి!"

"నేను పంచాక్షరీ మంత్రాన్ని, నీవు పంచదశాక్షరీ స్వరూపానివి" అని పరమశివుడు పరాశక్తితో చెప్పినాడు.

శ్రీ విద్యలోనే శ్రీ చక్రం అంతర్వ్యాప్తమై ఉంది. పరాశక్తికి పంచదశీ మంత్రానికి భేదం లేదు. శ్రీ విద్యకు, శ్రీచక్రానికి భేదం లేదు. సాధకునకు పరాశక్తికి భేదం లేదు. ఈ అభేద ఏకత్వ దర్శనానుభవమే పరిపూర్ణత. శబ్దార్థములు ఏవిధంగా అవిభాజ్యములో, నామరూపములు అదే విధంగా అవిభాజ్యములు. శివశక్తులు అట్లే అవిభాజ్యములు. ఇదే శ్రీ చక్ర, శ్రీ విద్యల సారాంశము!.

## శ్రీచక్ర దర్శన విద్య- పంచశ్రీ చక్రములు

శ్రీచక్రము స్థూల, సూక్ష్మ, కారణములని మూడు విధాలు. అందులో స్థూల శ్రీచక్రము దాని ఆకృతిని బట్టి 3 రకాలు.

**శ్రీ చక్రము**

**<u>1.స్థూలము</u>** **<u>2. సూక్ష్మము</u>** **<u>3. కారణము</u>**

A. భూప్రస్తారము
B. కూర్మ ప్రస్తారము
C. మేరు ప్రస్తారము

ఇవన్నీ వెనుకటి ప్రకరణంలో వివరించినట్లుగా బిందు, త్రికోణ, వసుకోణ మొదలైన తొమ్మిది చక్రములచే విరాజిల్లుతున్నాయి.

### A. భూ ప్రస్తార శ్రీ చక్రం

ఇది మన స్థూల శరీరంలోని ఏడు ధాతువులు, ప్రాణము, జీవచైతన్యం, మొత్తం తొమ్మిది, తొమ్మిది చక్రాలుగా దర్శనమిస్తుంది. వెనుకటి ప్రకరణంలో

తెల్పిన 1. మూలాధార 2. స్వాధిష్ఠాన 3. మణిపూర 4. అనాహత 5. విశుద్ధ 6. ఆజ్ఞా 7. సహస్రార 8. సహస్రారంలోని బిందువు (జీవాత్మ) ఈ దర్శనంలో సిద్ధిపొందిన ఆరితేరిన అభ్యాసకుడే శ్రీచక్రదర్శనానికి అర్హుడు. శరీరంలోని సప్తధాతువులు ప్రాణచేతన, జీవచేతన (బిందురూపం) ఈ క్రింది విధంగా క్రమంగా ఉంటాయి. (పైనుండి క్రమంగా).

1. సహస్రార కమలమందున్న బిందువుపై సమాహితం చేసి, లక్ష్యం ఉంచితే బిందు దర్శనమౌతుంది. అచట ధ్యానం చేసి ప్రాణచేతనపైలక్ష్యం చేస్తే.

2. త్రికోణ దర్శనమౌతుంది. తరువాత శుకధాతువుపై సమాహితం చేస్తే

3. వసుకోణ దర్శనమౌతుంది దాని తర్వాత మజ్జాధాతువుపై సమాహితం చేస్తే.

4. దశారయుగ్మం (పదికోణములుకల్గినరెండు చక్రములు) దర్శనమిస్తాయి. ఆ పైన అస్థి ధాతువుపై ఏకాగ్రం చేస్తే .

5. పద్నాలుగు కోణములున్న చక్ర దర్శన మౌతుంది. (మన్వస్ర) తర్వాత మేదో ధాతువు పై లక్ష్యముంచి ఏకాగ్రం చేస్తే.

6. అష్ట దళ చక్రము కన్పిస్తుంది. మాంసధాతువుపై సమాహితం చేస్తే

7. పదహారు దళముల చక్రం దర్శనమిస్తుంది. తరువాత రక్తధాతుపై లక్ష్యముంచి ఏకాగ్రం చేస్తే.

8. వృత్తత్రయ చక్రం(మూడు గుండ్రని వర్తులాలుండే) కన్పిస్తుంది. దాని తర్వాత చర్మధాతువుపైన లక్ష్యంగా ధ్యానిస్తే

9. భూపురం దర్శనమిస్తుంది.

ఇదంతా చాలా సులభంగా కన్పించవచ్చు! కాని ఈస్థాయిని చేరేందుకు ఉపాసకుడు ఏకాగ్రం చేయడంలో ఎంతో పరిపాకాన్ని పొందినప్పుడే సాధ్యం. అది అనుభవంలో తెలుస్తుందే కాని మాటలతో అర్థంకాదు. కొన్ని లౌకిక దృష్టాంతాలు ద్వారా దీని మహత్తును తెల్సుకోవచ్చు.

గణితశాస్త్రంలో ప్రతిభాశాలులైనవారు కొన్ని నిముషాలలోనేఎంతోపెద్దపెద్ద చిక్కు సమస్యలను పరిష్కరిస్తారు. సామాన్యులకు వాటిని సాధించాలంటేరోజులు పడుతుంది. అట్లేపద్యరచన ఆశువుగా గంటకు వంద పద్యాలు వంటి పోటీలలో నెగ్గేవారున్నారు. కాని ఒకపద్యం వ్రాసేందుకునెలలుపడ్తుంది కొందరికి ఇదంతా ఏమి? ఆయా రంగాలలోని ప్రతిభాశాలురు అభ్యాసం ద్వారా నిష్ణాతులైనారు. అభ్యాసశక్తియే దీనికంతా కారణం. అభ్యాసం లేని ప్రతిభరాణించదు. నిపుణతపొందలేదు. పైపేర్కొన్న

యోగానుభవాలు కూడా అటువంటివే! అభ్యాసంతోనే సాధించవలసి ఉన్నాయి.

సాధకుడు వరుసగా తొమ్మిది ధాతువులపై ఒక్కొక్కదానిపై లక్ష్యం చేస్తూ పోతే, వెంటనే ఆయా చక్రములు దర్శనమిస్తాయి. తరువాత 9 చక్రాలపైనా ఒకేసారి చేస్తే అన్నీ ఒకసారిగా కన్పించి శ్రీచక్ర దర్శనమౌతుంది. చదునుగా భూప్రస్తార శ్రీచక్రం కన్పిస్తుందని భావం.

*గమనిక :- ఈచక్రములు తొమ్మిదింటి దర్శనంలో బిందువునుండి క్రమంగా క్రిందికి భూపురం వరకు కావడమే వైదిక సమ్మతం. సనక వశిష్ఠాదులు దీన్నే సమయాచార విధానం అన్నారు. ఇదేసృష్టిక్రమం. ఈవిధంగా కాకుండా భూపురంనుండి క్రమంగా పైకి బిందువువరకూ దర్శనం చేయడం కౌళాచార విధానం. ఇది నింద్యము. దీన్నే సంహార క్రమమంటారు. ఇది ఉత్తమాధి కారులకు సమ్మతం కాదు. అధములకే! అని తంత్ర శాస్త్ర నిర్ణయం.*

## B. కూర్మ ప్రస్తార శ్రీచక్ర దర్శనము

1) సహస్రారం పై లక్ష్యముంచి ఏకాగ్రం చేస్తే బిందు దర్శనం.
2) ఆజ్ఞాచక్రం పై లక్ష్యముంచి ఏకాగ్రం చేస్తే త్రికోణ చక్ర దర్శనం.
3) విశుద్ధ చక్రం పై లక్ష్యముంచి ఏకాగ్రం చేస్తే వసుకోణ చక్ర దర్శనం.
4) అనాహత చక్రం పై లక్ష్యముంచి ఏకాగ్రం చేస్తే అంతర్దశార చక్ర దర్శనం.
5) మణిపూరక చక్రంపై లక్ష్యముంచి ఏకాగ్రం చేస్తే బహిర్దశార చక్ర దర్శనం.
6) స్వాధిష్ఠాన చక్రంపై లక్ష్యముంచి ఏకాగ్రం చేస్తే చతుర్దశార చక్ర దర్శనం.
7) మూలాధార చక్రంపై లక్ష్యముంచి ఏకాగ్రం చేస్తే షోడదళ చక్ర దర్శనం.
8) మూలాధార చక్రంపైనే లక్ష్యముంచి ఏకాగ్రం చేస్తే నాగదళ చక్ర దర్శనం.
9) సాధకుని ఆసనం క్రిందనున్న సహస్రార దళకమలం పై ఏకాగ్రం చేస్తే వృత్త త్రయం మరియు భూపుర చక్రం రెండూదర్శనమైతాయి.

ఇదే కూర్మ ప్రస్తార శ్రీచక్రం. ఇది సంకుచిత స్థితిలో దర్శనమిస్తుంది. వృత్త త్రయ, భూపురత్రయములను కలిసి ఒకటిగా లెక్కిస్తే 9 చక్రాలుగా సరిపోతాయి.

## C. మేరు ప్రస్తార శ్రీ చక్ర దర్శనము.

ఈ మేరు ప్రస్తార శ్రీ చక్రము బాహ్యపూజలలో మనకు లోకమున (ప్రతీకగ) చాలా చోట్ల కన్పిస్తుంది. ఆయా భక్తులు, సాధకులు ఆచక్ర పూజా కైంకర్యములచే ఐహిక ఆముష్మికములను వారివారి అర్హతననుసరించి పొందచుండవచ్చు. కాని బాహ్యపూజ అర్చనలల్లోనే అంత మహిమ కల్గి

యుండగా, తత్కారణము తన్మాత్రల బింబ భూతములైన శ్రీచక్ర దర్శనానుభవములు ఎంతటి మహిమాన్వితములు!

మేరు ప్రస్తార చక్రముకూడా కొన్ని సంప్రదాయాలలో ఆరోహణ క్రమంగా, కొన్ని సంప్రదాయాలల్లో అవరోహణ క్రమంగా దర్శనం చెప్పబడింది సమయ మతానుసారంగా సృష్టిక్రమ దర్శనంతో వివరిస్తున్నాం! సంహార క్రమం కౌళ మత సాంప్రదాయం కాబట్టి అది వైదికేతరులకే నిర్ణీతము. ఈ మేరు ప్రస్తార శ్రీచక్రమునకు కూర్మ ప్రస్తారము మొదిరే లక్ష్యములున్నాయి. కాని ఆదర్శనములే స్పష్టంగా, విస్తారంగా ఉండడమే మేరు ప్రస్తారములోని ప్రత్యేకతగా గ్రహింపవచ్చు!

1) శిరస్సుపైనున్న సహస్రారకమలం లక్ష్యంగా చూస్తే బిందు చక్ర దర్శనం.

2) ఆజ్ఞాచక్రంపై లక్ష్యంగా చూస్తే త్రికోణ చక్ర దర్శనం.

3) విశుద్ధ చక్రం లక్ష్యంగా చూస్తే వసుకోణ చక్ర దర్శనం.

4) అనాహత చక్రం లక్ష్యంగా చూస్తే అంతర్దశార చక్ర దర్శనం.

5) మణిపూరక చక్రం లక్ష్యంగా చూస్తే బహిర్దశార చక్ర దర్శనం.

6) స్వాధిష్ఠానచక్రం లక్ష్యంగా చూస్తే చతుర్దశార చక్ర దర్శనం.

7) మూలాధార చక్రం లక్ష్యంగా చూస్తే నాగదళ చక్ర దర్శనం.

8) మూలాధార చక్రం లక్ష్యముగా చూస్తే షోడశదళ చక్ర దర్శనం.

9) ఆసనమువలె క్రిందనుండే సహస్రదళ చక్రం లక్ష్యంగా చూస్తే వృత్త త్రయ చక్ర దర్శనం మరియు భూపురత్రయ చక్ర దర్శనం.

## 2. సూక్ష్మ శ్రీ చక్ర దర్శనం

ఈసూక్ష్మ శ్రీ చక్రాన్ని ఆరోహణ క్రమంగా చెప్పినారు.

1) ఆజ్ఞాచక్రమందున్న పూర్ణ చంద్రమండలమందు లక్ష్యముంచి సమాహితం చేస్తే, భూపుర, వృత్తత్రయ దర్శనమౌతుంది.

2) ఆపూర్ణ చంద్రమండలంలోని శనగగింజ ప్రమాణంతో ఉన్న బిందువుపై సమాహితం చేస్తే షోడశచక్ర దర్శనం.

3) పై బిందువులో ఉన్న బోధినీ శక్తిని లక్ష్యంగా సమాహితం చేస్తే నాగ దళ చక్ర దర్శనం.

4) పై బిందువు పైనున్న అర్ధచంద్రరేఖపై సమాహితం చేస్తే మన్వస్ర, చతుర్దశారచక్ర దర్శనం (14 దళములు).

5) అక్కడ ఉండే మహానాదము లక్ష్యంగా సమాహితం చేస్తే బహిర్దశార చక్ర దర్శనం.

6) లాంగలా కార(నాగలి ఆకారం) మహానాదం లక్ష్యంగా చూస్తే అంతర్దశార చక్ర దర్శనం.

7) తిర్యగ్రేఖపై సమాహితం చేస్తే వసుకోణ చక్ర దర్శనం.

8) ఋజురేఖాత్మకమైన సమని లక్ష్యంగా చూస్తే త్రికోణ చక్ర దర్శనం.

9) పై ఋజు రేఖ అంతరాళంలో ఉన్న మరొక ఋజు రేఖ ఉన్మని లక్ష్యంగా దర్శిస్తే బిందు దర్శనం.

*గమనిక :- త్రికోణ చక్రం పైనున్న సమని పై లక్ష్యం చేయగల్గిన ఉత్తమసాధకునకు వృత్తి, కదలిక లేకుండా నిల్చి ఉంటుంది. అట్లే 9 వ చక్రము బిందువుకు లక్ష్యమైన ఉన్మని దర్శనాన్ని అనుభవించే సాధకుడు(సంకల్పవికల్పాత్మక స్థితి లేని) నివృత్తి స్థితిని పొందగలడు. ఆ ఉత్తమ యోగికి ఋతంభరాప్రజ్ఞ ఉంటుంది. ఈ ప్రజ్ఞను పొందిన యోగి భూతభవిష్య ద్వర్తమానాలను తెల్సుకొనే మహిమ కల్గి ఉంటాడు.*

**పతంజలి యోగసూత్రాలలోని మొదటి సూత్రము "యోగశ్చిత్త వృత్తి నిరోధః" అనే సూత్రానికి పైన పేర్కొన్న ఈ ఋతంభరా ప్రజ్ఞయే (ఉన్మన్య వస్థయే) పరమంగమ్యం. ఆస్థితితో యోగము ముగుస్తుంది.**

## 3. కారణ శ్రీ చక్ర దర్శనం (సూక్ష్మతర శ్రీ చక్ర దర్శనం)

సాధకుడు తనలలాట మధ్యంలో సమాహితం చేస్తే(= =) వంటి ఆకృతిలో దీపకాంతి దర్శనమిస్తుంది. ఈ కాంతికి ఒక అంగుళం పైన సమాహితం చేస్తే అర్ధ చంద్రాకృతి ( ◡ ) దర్శనమిస్తుంది. వీటిలో

1) మొదటి గుర్తుపై సమాహితం చేస్తే- భూపుర చక్ర దర్శనం.

2) రెండవ గుర్తు పై సమాహితం చేస్తే - వృత్త త్రయ చక్ర దర్శనం.

అర్ధచంద్రాకృతికి ఒక అంగుళంపైన (△) త్రికోణాకృతి వెన్నెల కాంతితో దర్శనమిస్తుంది. దాన్ని యోగ పరిభాషలో రోధిని లేక భోధిని అంటారు. బ్రహ్మాదులకూ ఇది పరాప్రాప్తిని నిరోధిస్తుంది కాబట్టి దీన్ని రోధిని అన్నారు.

3) ఈ రోధిని పై సమాహితం చేస్తే - షోడశ చక్ర దర్శనం.

రోధినికి ఒక అంగుళంపై నాదము మణి ప్రభలు జిమ్ముతూ పద్మ కింజల్కముల వర్ణంతో ०/० ( బిందు ద్వయాంతరస్థ ఋజరేఖ ఉన్నది.)

4) దానిపై సమాహితం చేస్తే - నాగ దళ చక్ర దర్శనం.

5) దీనిపై ఒక అంగుళం పైన అధోముఖంగా నాగలిదండం ( ) ఆకారం లో ఉంటుంది. ఇది సాధకుని ఫాలభాగంలో ఎడమ వైపుకు ఉంది. దాన్ని నాదాంతమహానాదం అంటారు. అదిమణి ప్రభలతో పద్మకింజల్క నిభమై ఉంది. దీనిపై సమాహితం చేస్తే చతుర్దశార చక్రం దర్శనమిస్తుంది.

6) దానికి అంగుళం పైన(|) ఆకృతితో విద్యుత్ ప్రభతో ఉన్న "శక్తి" పైసమాహితం చేస్తే బహిర్దశార, అంతర్దశార చక్రములు (దశారయుగ్మం) రెండూ దర్శనమిస్తాయి.

7) పై చక్రానికి ఒక అంగుళం పైన తన క్రింది కోణంలో ఉన్న బిందువు ఉండే త్రికోణాకృతి (△) ని వ్యాపికా శక్తి గా పిలుస్తారు. దానిపై సమాహితం చేస్తే వసుకోణచక్ర దర్శనం జరుగుతుంది.

8) దానికి ఒక అంగుళంపైన (¦) ఆకృతితో సమానా అనేస్థానముంది. దానిపై సమాహిత మొనర్చినచో త్రికోణచక్ర దర్శనమౌతుంది.

9) దానికి ఒక అంగుళం పైన ( ! ) ఈ ఆకృతితో ఉన్మనా అనే చోటుంది. అది మనస్సును దాటిన స్థానము (అతి మానస) ఈ "ఉన్మనా" పై సమాహితం చేస్తే శ్రీచక్ర మధ్యగత బిందు చక్ర దర్శనము కలుగుతుంది.

*గమనిక :- పై చక్రముల స్థానములలో 1) శక్తి 2) వ్యాపికా 3) సమనా 4) ఉన్మనా అనే నాల్గింటి వద్ద (ఒక్కొక్క దాని వద్ద) పన్నెండు గురుసూర్యులు కలిసి వెలిగితే కల్గే ప్రకాశం వెలువడుతుంది. అని శాస్త్ర వచనం.*



# అధ్యాయము - 5

## శ్రీచక్రము - ఉపాసన

"ఉపాసన" శబ్దంలోనే ఎంతో స్ఫూర్తి ఉంది. ఉప-సమీపే అంటే దగ్గర అని అర్థం. ఆసన-కూర్చుండడం. మనకిష్టమైన రూపాన్ని నిత్యం సన్నిహితంగా ఉంచుకోవడం. ఇది రెండు రకాలు 1) బాహ్యాం 2) అంతరం.

బాహ్య వస్తు పరికరములు, విగ్రహములు, యంత్రములతో చేసేది బాహ్యం. కేవలం సమాహితంతో సూక్ష్మదేహమునందు చేసేది అంతరం. వీటినే 1) అంతర్యాగం 2) బహిర్యాగం అని పిలుస్తారు. దేశకాల శక్తులను బట్టి బాహ్యమైన ఉపాసన విధానములు వేరైనను, దాని వ్యవస్థ మాత్రమొక్కటే. చిత్తశుద్ధి, పరీ పాకములను బట్టి అంతర్యాగము 3 రకాలు:-

1) సకలము (ఆజ్ఞాచక్ర పర్యంతము చేసే ఉపాసన).
2) సకల నిష్కళము (ఉన్మని స్థాన పర్యంతం చేసే ఉపాసన).
3) నిష్కళము (పరమస్థానంలో చేసే ఉపాసన).

ఈమూడింటి కంటె మిన్నయైనది జీవన్ముక్తులు అనుభవించేస్థితి.

అంతరుపాసకులలో శ్రేష్ఠులగు వారే శ్రీ విద్యలో అంతర్యాగానికి అర్హులని అధికారశాస్త్ర వాక్యం. శ్రీ శంకర భగవత్పాదులు భాష్యమున ఉపాసనను గురించి ఈవిధంగా నిర్వచించినారు. "**ఆజ్ఞాంతం సకలం ప్రోక్తం తతస్సకల నిష్కలం. ఉన్మన్యంతం పరేస్థానే నిష్కలంచ త్రిధాస్థితం.**"

"**ఉపాసనంనామ :- యథాశాస్త్రం ఉపాస్యస్య అర్థస్య విషయీకరణేనసామిప్యముపగమ్య తైలధారావత్సమాన ప్రత్యయ ప్రవాహేణ, దీర్ఘకాలం యదాసనం తదుపాసన మా చక్షతే**"

**భావం:** - ఉపాసన అంటే శాస్త్రవిధానాన్ని అనుసరించి ఉపాసించ వలసిన వస్తువును(దేవతమొదలైనవి) ధ్యానం ద్వారా దర్శించి (భావించి), సమీప మందు నిల్చి, ఎడ తెగ కుండా తైలధార వలె సమానమైన విశ్వాస ప్రవాహంతో (అందు చలింపనిధ్యానంతో) చాలా కాలము అధ్యేయ మందే నిల్చి, ఉండటమే ఉపాసన అని చెప్పబడింది.

## శ్రీ చక్రోపాసకులలోని తరగతులు

***మొదటి తరగతి వారు :-*** గురువు ద్వారా మంత్రోపదేశం పొంది నియమంగా జపం చేసి, శ్రీ చక్రాన్ని గాని, దేవీ విగ్రహాన్ని గాని బాహ్యంగా నిలుపుకొని కన్నులతో చూస్తూ, చేతులతో పుష్పాదులతో అర్చించేవారు క్రమంగా మంత్రోచ్చారణ చేస్తూ పూజసల్పుతారు. వీరు స్థూలోపాసకులు. వీరిది బహిర్యాగము.

***రెండవ తరగతి వారు :-*** శ్రీ విద్యా మంత్రాన్ని సద్గురు ముఖతః విని, ఆపరాశక్తి మంత్రమే "పరా శక్తి దేవత" అని దృఢంగా నిశ్చయించు కొని ఆ మంత్రంలోని 3 కూటములు (భాగములు) పరాశక్తిరూపంగా ధ్యానిస్తూ ఉంటారు. వీరిది సూక్ష్మోపాసన. ఇదే అంతర్యాగము.

పంచ దశీ మంత్రంలోని 3 కూటములు

1) వాగ్భవ కూటము - శ్రీదేవి ముఖపద్మముగా
2) మధ్యకూటము - కంఠమునుండి నడుము వరకు ఉన్నభాగంగా
3) శక్తి కూటము - నడుము నుండి పాదములవరకు ఉన్న విభాగము.

***మూడవ తరగతి వారు :-*** చాలా ఉత్తమస్థాయికి చెందినవారు. అనేక జన్మ పుణ్యవాసనా సంస్కారంచే మనస్సును ఏకాగ్రం చేసి, అభ్యాసంలో పరిపాకం పొంది, అంతర్ముఖులై, శ్రీచక్ర దర్శనాన్ని తమ దేహంలోని సూక్ష్మశరీరంలో చేస్తూ, ఆయాచక్ర విశేషాలు, అక్కడ ఉండే దేవతాశక్తులను పాసించేవారు. వీరి ఉపాసనే శ్రీశంకరాచార్యుల నిర్వచనానికి సరిపోలుతుంది. పై మూడు తరగతులు ఒకటి కన్నా మరొకటి ఉత్తమోత్తమమైనవి.

*గమనిక :- ఈ మూడు తరగతులకు అతీతమైన స్థితిపొందిన ఉపాసకులు అఖండానంద స్వరూపులై శ్రీ లలితా పరా శక్తి సాయుజ్యము పొందిన మహా పురుషులు.*

పై స్థితులను లలితా సహస్ర నామ స్తోత్రం లో పేర్కొన్నారు.

**అంతర్ముఖ సమారాధ్యా ; బహిర్ముఖ సుదుర్లభా**

అంతర్ముఖు( అంతర్యాగం) లై ఆరాధింపతగినది శ్రీవిద్య. (బహిర్ముఖ) బహిర్యాగంచే బొత్తిగా దుర్లభమైనది.

**"స్వాత్మానందలవీభూత బ్రహ్మాద్యానందసంతతిః"** అని లలితా స్వరూపం చెప్పబడింది. స్వాత్మా నందంలో బ్రహ్మాదుల ఆనందము లవములుగా మారినాయి. స్వాత్మానందం సముద్రమైతే బ్రహ్మాదుల ఆనందం

నీటి తుంపురులని భావం. అఖండానందమే శ్రీలలితా పరమేశ్వరి ఈ స్థితిని పొందడమే శ్రీ విద్య శ్రీ చక్రోపాసనకు పరమ కేంద్రమై ఉంది. ఆస్థితి శతకోటి జన్మ సుకృత పుణ్యముల చేసినా, దుర్లభమైనదని శంకరులవారు వివేక చూడామణిలో పేర్కొన్నారు.

**శ్రీవిద్యా విశిష్టత:-** సామాన్యజీవులందరూ భోగములనుండి దూరం కాలేరు. కోర్కెలను విడిచి పెట్టలేరు. కేవలం కోర్కెలను తుచ్ఛ కామాన్ని తీర్చేందుకుపకరించేవి, స్వార్థలాభానికి, లోక ప్రచారణకు, ధనార్జనకు పని కొచ్చేవి చతుష్షష్ఠితంత్రములు. ఇవి వశ్య, ఉచ్ఛాటన, విద్వేషణ, మరణాదులతో లోక ద్రోహకరంగా తయారైనాయి. ఈతంత్రములు నీచధూర్తులకే అని చెప్పబడింది. అవి కూడా జుగుప్సాకరమైన హింసా కృత్యములతో సాధింపవలసి ఉన్నాయి. కాబట్టి నింద్యములు. క్షుద్రములు. కాని శ్రీవిద్య భోగమోక్షములను రెంటినీ ప్రసాదించేది. అవ్యాజకరుణా మూర్తులైన పార్వతీ పరమేశ్వరులు లోకానికి ప్రసాదించినారు. వేద సమ్మతమై, వశిష్ఠాది ఋషులచే, శ్రీ గౌడ పాద, శంకరాదులచే ప్రవర్తితమై ఉపాసకులకు శ్రీచక్ర ( శ్రీవిద్య) తంత్రము సముద్ధరింపబడింది. కాబట్టి ఉపాసకులు ధర్మ విరుద్ధము కాని అర్థకామాలను పొంది, ఆపైన వారివారి సుకృత పరిపాకాన్ని అనుసరించి అద్వైతానందస్వరూపమైన జీవన్ముక్తి సుఖాన్ని పొంద గలరు. ఇదే శ్రీవిద్య యొక్క ప్రభావవంతమైన విశిష్ఠత.

శ్రీ గురువులు పైన తెల్పిన తరగతుల ఉపాసకులలో ఉత్తమమైన తరగతికి చెందిన ఉపాసన చేయడానికి తగిన సోపాన క్రమాన్ని, సులభమైన ప్రణాళిక నేర్పరచి, జగత్తునుద్ధరించేందుకు కృషిచేసినారు. తర్వాతి ప్రకరణంలో శ్రీ విద్య, శ్రీ చక్ర ఉపాసనలో సిద్ధిపొందినవారు ఏఏ స్థానాలలో ఏఏ శుభ ఫలితాలను పొంద గలరో వివరించబోతున్నాము.

## శ్రీచక్రము - నవావరణములు

### 1. భూపురం(చతురస్రము)(త్రైలోక్యమోహనచక్రము):-

ఇది ప్రథమావరణము ఈచక్రానికి పూర్వ, పశ్చిమ, ఉత్తర, దక్షిణ దిక్కులల్లో గణపతి, వటుక, దుర్గా, క్షేత్రపాలక దేవతలు దర్శన మిస్తారు. ఉపాసకుడు మొదట గణపతిని ధ్యానించి తర్వాత మిగిలిన దేవతలను ధ్యానించి, వారి అనుగ్రహం పొందిన తర్వాత ఈచక్రమునందున్న ఫలములను

పొందగలడు.

ఈ చక్రము షట్చక్రములలో క్రింద ఉండే మూలాధారచక్రం కింద ఊర్ధ్వముఖమై ఒకవిధమైన ఎర్రని రంగులో ఉన్న అష్టదళపద్మముకింద మరొక సహస్రదళ పద్మము, ఆసనరూపమైన నడిదిమ్మెపై దర్శనమిస్తుంది. ఇదే త్రైలోక్య మోహన చక్రము.

ఈ చక్రము ముత్యాల రంగు కాంతితో మాణిక్య కాంతులు విరజిమ్ముతూ ఉన్నది. సాధకుడు "లం" అనే పృథ్వీతత్వాన్ని ఉపాసించవలె. ఇది బ్రహ్మ విష్ణు శివాత్మకము. సత్త్వరజస్తమోగుణములు మూడు దీని స్వభావంగా ఉంటాయి. దీనికి రతి, స్థాయీ భావము శృంగారం రసము, అనుభవము పొందే సాధకుడు శృంగార రసానుభవస్థితిని అనుభవించగలడు. ఈభూపురచక్రం చతురస్రంలో మూడు రేఖలున్నాయి. మొదటి రేఖపై ప్రకటయోగినీగణముంది. వారిని దర్శించి, నమస్కరించి రేఖపై అనుమతిని పొందడం సాధకుని విధి. వీరు యోగినీ రూపములలో బంగారు మైచాయతో పాశాంకుశధారిణులై ఉన్నారు. వీరంతా అణిమాది సిద్ధులొసగు శక్తులు.

| అష్ట దిక్కులు | అష్టసిద్ధులు | అష్ట దిక్కులు | అష్టసిద్ధులు |
|---|---|---|---|
| దక్షిణము | అణిమాసిద్ధి | ఈశాన్య | వశిత్వసిద్ధి |
| పశ్చిమము | లఘిమాసిద్ధి | ఆగ్నేయము | ప్రాకామ్య సిద్ధి |
| ఉత్తరము | గరిమాసిద్ధి | నైరుతి | భుక్తి సిద్ధి |
| తూర్పు | మహిమాసిద్ధి. | పశ్చిమ,నైరుతి మధ్య | ఇచ్ఛా సిద్ధి |
| వాయవ్య | ఈశిత్వసిద్ధి | తూరుఈశాన్యమధ్య | సర్వకామ్యసిద్ధి |

వీటిని ఆరాధించి సాధకుడు రెండవ రేఖపై క్రమంగా అష్ట భైరవులను వారితొడలపై ఉన్నఅష్టమాతృకలను ఆరాధించాల్సి ఉంటుంది. అష్టభైరవులు గజ,చర్మాంబరధారులై శ్యామ వర్ణంతో మూడు కన్నులతో, భ్రూమముడులతో, భయంకరముఖులై కూర్చున్నారు. చేతులలో శూల - దండ- వేతాళ - కపాళ - క్షుద్రఘంటికలు ధరించినారు. వారి తొడలపై బ్రహ్మ మొదలైన దేవతలున్నారు. వారి నారాధించవల్సిన క్రమం ఈవిధంగా ఉంటుంది.

పశ్చిమ దిక్కు నందు అసితాంగ భైరవుడు, ఆయన తొడపై బ్రాహ్మి దేవత పసుపు పచ్చని మైచాయతో నాల్గు మొగములతో శోభిస్తూ వరద - అభయ - కుండిక - అక్షమాలను ధరించి ఉంటుంది.

ఉత్తర దిక్కు నందు రురుభైరవుడు, ఆయన తొడపై మాహేశ్వరి తెల్లని వర్ణంతో, మూడు కన్నులు కల్గి, నాల్గు చేతులలో శూల, కపాల, జింక పరశువు లను కల్గిఉంటుంది.

తూర్పు దిక్కు నందు చండభైరవుడు, ఆయనతొడపై కౌమారీ దేవత పసుపు పచ్చని రంగుతో, నాల్గు చేతులలో వరద - అభయం- శక్తి- తోమరములను ధరించి, అసురేశ్వరిగా ఉన్నది.

దక్షిణదిక్కున క్రోధభైరవుని తొడపై వైష్ణవదేవత శ్యామవర్ణంతో, దివ్యభూషణ భూషితగా, 4 చేతులల్లో శంఖు, చక్ర, గదా, పద్మములను ధరించి విరాజిల్లుతున్నది.

వాయవ్యదిశలో ఉన్మత్త భైరవుడు- ఆయన తొడపై వారాహిదేవి, శ్యామల వర్ణంతో, వరాహముఖంతో , హల, ముసల, ఖడ్గ, ఖేటములను ధరించి, చతుర్బాహువులతో ఉన్నది.

ఈశాన్య దిక్కున కపాల భైరవుని అంకమందు ఐంద్రీ శక్తి నల్లని శరీర వర్ణముతో వజ్రం, ఉత్పలం ధరించిన రెండు చేతులతో దర్శనమిస్తుంది.

ఆగ్నేయ దిక్కున భీషణ భైరవుడు- ఆయన తొడపైనచాముండా మాత నల్లని వర్ణంతో, శూల, ఢమరుక, ఖడ్గ, వేతాళములను ధరించి ( కుడివైపు), నాగ, భేటక, ఘంటా, కపాలములను ధరించి (ఎడమవైపు) ఎనిమిది బాహువులతో నాల్గు ముఖములతో విరాజిల్లు తున్నది.

నైఋతి దిక్కున- సంహార భైరవుడు భయంకరాకృతిలో ఉన్నాడు. అతని తొడపైన మహాలక్ష్మి దేవత బంగారు కాంతితో, నాల్గుచేతులతో, 2 పద్మములు, అద్దము, మాతలుంగ ఫలములను ధరించి దర్శన మిస్తుంది.

ఈఅష్టమాతృకలను, అష్టభైరవులను ప్రసన్నులను చేసుకొని, సాధకుడు భూపుర చక్ర తృతీయ రేఖయందున్న శక్తులను ఉపాసించాలి. ఆశక్తులు ఈక్రమంలో ఉన్నాయి.

పశ్చిమాదిగా సర్వసంక్షోభిణి, సర్వవిద్రావిణి, సర్వాకర్షిణి, సర్వవశంకరి, సర్వోన్మాదిని, సర్వమహాంకుశి, సర్వఖేచరి, సర్వబీజ, సర్వయోని, సర్వ

ధరించి, వారి వారి పేర్లకు తగిన ముఖభంగిమలతో దర్శనమిస్తారు. వారినారాధించి సాధకుడు సర్వసంక్షోభిణీముద్ర ధరించి ఆవరణచక్ర దేవతను, అణిమాది సిద్ధులకు ముందు భాగములో అధివసించి ఉన్న శక్తిని దర్శించాలి.

ఈ త్రైలోక్య మోహన చక్ర దేవత పేరు త్రిపురాంబా దేవి. ఆ తల్లి రక్త వర్ణము గల మేనిచాయతో త్రినేత్రయై పాశాంకుశాలను ధరించి ఉన్నది. చతుష్షష్టి యోగినీ శక్తులతో పరివేష్టించి ఉన్నది. ఆ ప్రకటయోగిను లంతా ఒకే రకమైన వేష భూషణములతో ఉన్నారు. ఉపాసకుడు భక్తి పురస్సరంగా చక్ర దేవతను ధ్యానించి, ఆతల్లి అనుగ్రహాన్ని పొందితే గాని, అభీష్టార్థములు సిద్ధించవు.

అణిమాదిసిద్ధులన్నీ చక్రదేవత ఆజ్ఞతో సాధకునికి వశమైతున్నాయి. సర్వసంక్షోభిణీశక్తులన్నీ పొందవచ్చు. త్రిలోకములను తనకిచ్చవచ్చినట్లు సమ్మోహింప చేయగలడు. పృధివీతత్వానికి సంబంధించిన యంత్రాదులపైన ఆధిపత్యం లభిస్తుంది. ఇదీ త్రైలోక్యమోహన చక్ర విశేష మహిమ.

వృత్తత్రయము కూడ ఈ చక్రములోనే చేరినది. అక్కడి మూడు వర్తుల రేఖలు సూర్య, చంద్ర, అగ్ని రూపాలతో ఉన్నాయి. వాటియందు ఆరోహణ క్రమంలో దివ్యౌఘ గురువు లున్నారు. వారి పేర్లివి. 1) పరప్రకాశకులు 2) పరశివులు 3) పర శక్తి 4) కౌలేశ 5) శుక్లదేవి 6) పరేశ 7) కామేశ్వరీ దేవి.

సాధకుడీ దివ్యౌఘ గురువులను ధ్యానించి, వారిని ప్రసన్నులను చేసుకున్న తర్వాత ఆరోహణ క్రమంలో రెండవవృత్త రేఖపైన ఉండే సిద్ధౌఘ గురువుల అనుగ్రహం పొందాల్సి ఉంటుంది. వారి పేర్లివి.

1) భోగ 2) క్రీడ 3) సమయ 4) సహజ 5) దేవ 6) పరా 7) పర. మొదటివృత్తరేఖపైన 1) గగన 2) విశఅవ 3) విమల 4) మదన 5) భువన 6) నీలాత్మ 7) ప్రియ అనే పేర్లున్న మానవౌఘ గురువులున్నారు.

వారి ఆశీస్సులు పొందిన తర్వాత ఉపాసకుడు తన పరమేష్ఠిగురువు, పరమగురువు, గురువులను ధ్యానాదులతో ప్రసన్నులను చేసుకోవాలి. ఈదివ్యౌఘ, సిద్ధౌఘ, మానవౌఘ గురుదేవుల అనుగ్రహప్రాప్తి కల్గినప్పుడే ప్రధమావరణమైన త్రైలోక్యమోహన చక్రసిద్ధులు ఉపాసకునకు లభింప గలవు.

## 2) సర్వాశాపరిపూరక చక్రం:-

ఇది ద్వితీయావరణము. మూలాధారచక్రంలోని మధ్య దిమ్మెపై ఏకాగ్రం చేస్తే 16 దళములతో ఈ చక్రం దర్శన మిస్తుంది. ఇది చంద్ర బింబం వలె తెల్లగా ఉండి, "సం" బీజాన్ని కల్గి ఉంటుంది. ఇందలి రసము వీరము. ఈ చక్రంలోని 16 దళాలపైన పదహారు స్వరాలు (అచ్చులు) "అ"నుండి "అః" వరకున్నాయి. ఈ చక్రాధిష్ఠానదేవత దళముల మధ్యనుంటుంది. ఆమె ముందున్న దళము నుండి ప్రదక్షిణం క్రమంలో ఒక్కొక్క దళంపై ఒక్కొక్క దేవత జపాకుసుమవర్ణంతో రెండు చేతులలో పాశాంకుశాలను, మరి రెండు చేతులలో అక్షమాల, అమృత కలశాన్ని ధరించి ఉంటుంది. వీరు మొత్తం 16 మంది. వారి పేర్లు - వారి నుండి పొందునగు సిద్ధులు ఈ క్రింది విధంగా ఉన్నాయి. సాధకుడు సర్వవిద్రావిణి ముద్రధరించి, ఈదేవతలను ఉపాసించి, అనుమతి పొంది, చక్రాధిష్ఠాత్రిని సేవించాలి.

| దేవత | - సిద్ధి | దేవత | - సిద్ధి |
|---|---|---|---|
| 1) కామాకర్షిణి | - ఏకోర్కెనైనా ఆకర్షించు శక్తి | 9) చిత్తాకర్షిణి | - ఏమనస్సునైనా ,, |
| 2) బుద్ధ్యాకర్షిణి | - ఏబుధినైనా ,, | 10) ధైర్యాకర్షిణి | - ఎవనిధైర్యాన్నైనా ,, |
| 3) అహంకారా కర్షిణి | - ఎవని అహంకారాన్నైనా ,, | 11) నామాకర్షిణి | - ఏపేరునైనా ,, |
| 4) శబ్దాకర్షిణి | - ఏశబ్దాన్నైనా ,, | 12) బీజాకర్షిణి | - ఏబీజాన్నైనా ,, |
| 5) స్పర్శా కర్షిణి | - ఏస్పర్శనైనా ,, | 13) అమృతాకర్షిణి | - అమృతాన్ని ,, |
| 6) రూపాకర్షిణి | - ఏరూపాన్నైనా ,, | 14) స్మృత్యాకర్షిణి | - ఎవనిస్మృతినైనా ,, |
| 7) రసాకర్షిణి | - ఏరసాన్నైనా ,, | 15) శరీరాకర్షిణి | - ఏ శరీరాన్నైనా ,, |
| 8) గంధాకర్షిణి | - ఏవాసననైనా ,, | 16) ఆత్మాకర్షిణి | - ఏజీవాత్మనైనా ,, |

ఈ పదహారు శక్తులు గుప్తయోగినులుగా పేరుపొందినారు. ఈసర్వాశా పరిపూరక చక్రాధిష్ఠాన దేవత త్రిపురేశి. ఆమె కామాకర్షణ శక్తి కెదురుగా అధివసించి ఉంది. జపాకుసుమ (దాసానిపువ్వు) రంగులో ఎర్రగా ఉండి, మూడకన్నులతో, పాశ, శూలములను ధరించి ఉంటుంది. ఈదేవి కిరువైపుల లఘిమాసిద్ధి, సర్వ విద్రావిణి శక్తులు సేవిస్తుంటాయి.

ఇంత వరకు పేర్కొన్న రెండు చక్రములు విశేషములు తెల్సుకొన్న ఉపాసకులకు మార్గము నిర్నిరోధము, నిష్కంటకము, నిరుపద్రవము, నిరాయాసము, నిశ్శ్రేయస ప్రాప్తి నొందించునదై ఉండవలెనునే ఉద్దేశ్యముతో, వివరించ బడినాయి.

ఈసర్వాశాపరిపూరక చక్రం అన్ని కోర్కెలను తీరుస్తుంది. దీనియందు బ్రహ్మ వేదశక్తులతో కూడి ఉంటాడు. తన ఆశయసాధనకు ఇతరులను బాధించడమే ఈచక్రోపాసన సిద్ధిగా ఉంది.

*గమనిక :- కొందరి సాంప్రదాయంలో ఈచక్రంలోని 16 దళాలలో షోడశనిత్యాశక్తులను ఆరాధించవలెనని ఉన్నది. కాని శ్రీగురువులు బిందు త్రికోణమధ్యభాగాన్నే షోడశనిత్యాస్థానంగా తెల్పినారు. ఈరెండు ఆవరణములు, చెప్పబోయే మూడవ ఆవరణమును, ఉపాసకులు దర్శనమాత్ర తృప్తులై, ఉపాసనలో అధిక శ్రద్ధనవలంబించాల్సి ఉంటుందని సమయాచారతత్పరులైన ఋషుల ఆదేశం.*

## 3. సర్వసంక్షోభిణీ చక్రవము.

ఇది మూడవ ఆవరణం. స్వాధిష్ఠానకమలంలోని దివ్యమలను సమాహితం చేస్తే సర్వసంక్షోభిణీచక్రం దర్శనమిస్తుంది. ఇది జపాకుసుమ వర్ణంతో విరాజిల్లుతూంది. అష్టదళములు కల్గి, "హం" బీజంతో కన్పిస్తుంది. సాధకునికి కరుణరసం కల్గుతుంది. అష్టదళములలోని గుప్తతర యోగినీ శక్తులను ప్రసన్నంచేసుకొని, చక్రాధిష్ఠానదేవతను దర్శించాలి. అష్టదళము లలోని యోగినీ శక్తులు బంధూక పుష్పవర్ణంతో, మూడు కన్నులు, ఒక ముఖం కల్గి, రక్త వస్త్రములు ధరించి, నాల్గు చేతులలో అక్షమాల, పుస్తక, అభయ, వరద ముద్రలు ధరించి ఉంటారు. దివ్య భూషణ భూషితలైన వీరి మధ్య చక్రాధిదేవత త్రిపురసుందరి అధివసించి ఉంటుంది. ఆతల్లికి ఇరువైపుల సర్వాకర్షణ శక్తి, మహిమా సిద్ధి సేవిస్తుంటారు. ఈచక్రంలో శివుడు దర్శనమిస్తాడు. ఇది శైవచక్రము. చక్రాధిష్ఠానదేవతకు వెనుకవైపు దళంలో "అనంగకుసుమ" దేవతను మొదలుకొని తూర్పువైపుగా 8 దిక్కులందు 8 మంది దేవతలున్నారు. అనులోమంగా వీరిని ధ్యానించి, తర్వాత త్రిపురసుందరిని ఉపాసించాలి.

ఈ ఎనిమిది సిద్ధులు స్త్రీలను కలవరపర్చేవి. స్త్రీల చిత్త వికారము ఈ 8 రకములుగా ఉంటుంది. వీటినే మన్మధ( అనంగ) వికారాలనవచ్చు. అవి

1) అనంగ కుసుమ 2) అనంగ మేఖలా 3) అనంగ మదనా 4) అనంగ మదనాతురా 5) అనంగరేఖా 6) అనంగ వేగా 7) అనంగాంకుశా 8)

అనంగమాలినీ. సర్వసంక్షోభిణీ చక్ర అధినాయకి త్రిపుర సుందరి. ఆమె బంధూక కుసుమశోభితగా ప్రకాశిస్తూ దర్శనమిస్తుంది. త్రినేత్ర దివ్యాభరణ భూషిత. చతుర్బాహు విరాజిత. అందు పాశ, అంకుశ, ధనుర్బాణములను ధరించి ఉంటుంది. ఈమె కరుణ రసాంతరిత.

*గమనిక :-* ఈమూడు చక్రాలు సహస్రార, మూలాధార, స్వాధిష్ఠాన చక్రాలల్లో ఉన్నాయి. వాటిని ఉపాసించడం తామిస్ర పద్ధతి. తుచ్ఛకా మాతురులైన వారికే ఈ ఉపాసనగా గౌడపాదుల వంటి సమయాచార ప్రవర్తకులు నియమించినారు. అట్టివారు పరహింస, పరస్త్రీ వశ్యాది లోకద్రోహకార్యాలను చేస్తారని, అది కౌళాచార మార్గమని నిషేధించినారు. స్వాధిష్ఠానం వరకు దర్శనము మాత్రమే అని, ఉపాసన కూడదని నిషేధించి, పరిత్యాజ్యముగా హెచ్చరించినారు.

ఈ మూడు చక్రములకు "సర్వసంక్షోభిణి" మొదలు కొని క్రిందకు 1) సృష్టి సృష్టి 2) సృష్టి స్థితి 3) సృష్టి లయ అనే సంజ్ఞలుంచినారు. 1) సృష్టి సృష్టి అంటే సృష్టిలోనే మరొక సృష్టి. అంటే పొత్తి కడుపు ప్రదేశం, గర్భాశయం. ఇక్కడే శుక్ల శోణిత సంయోగం జరిగి జీవోత్పత్తి ప్రారంభమౌతుంది. 2) సృష్టి స్థితి అంటే సృష్టించబడిన పిండం అవయవాలను, జీవచైతన్య ప్రాణాదులను పొందుతుంది. 3) సృష్టిలయం అంటే సామాన్య జీవులు (నీచస్థితి లో ఉన్నవారికి) గండం ద్వారా ప్రాణాలను విడుస్తున్నారు అని భావించ వచ్చు. ఏది ఏమైనప్పటికీ, ఈచక్రసిద్ధి ఇతరులను బాధించి కలత పెట్టుతుంది. ఈమూడు చక్రాలలో పూర్వామ్నాయాలను అర్చింపవలెననే సంప్రదాయమున్నది.

### 4. సర్వసౌభాగ్యదాయక చక్రం

ఇది నాలుగవ ఆవరణం. మణిపూర చక్ర కర్ణికలో లక్ష్యసమాహితం చేస్తే సర్వసౌభాగ్యదాయక చక్రం దర్శనమిస్తుంది. 14 దళాలతో దాడిమీ కుసుమ ప్రభలతో (దానిమ్మ పువ్వుకాంతి) ప్రకాశిస్తుంది. 14లోకాలు14దళాల రూపంలో దీనియందున్నాయి. ఉపాసకుడు ఈచక్ర దర్శనంలో "భయానకరసాను భవం" పొందుతాడు. ఈచక్ర దళాలలో ఉన్న దేవతలు సంప్రదాయ యోగినులు. ఈచక్రేశ్వరి త్రిపుర వాసిని. ఈమె 14 మంది సంప్రదాయ యోగినుల మధ్య అధివసించి ఉంది. సాధకుడు ముందుగా వీరి అనుగ్రహం పొంది చక్రదేవిని దర్శించాల్సి ఉంటుంది.

ఈ చక్రదేవి, 14మంది దేవతలలోని సర్వసంక్షోభిణి శక్తి ఎదురుగా భద్రపీఠంపై కూర్చొని ఉంటుంది. ఆమె మల్లెమొగ్గల వంటి, చంద్రకాంతి వంటి, తెల్లని వెలుగుతో ప్రకాశిస్తుంది. పీనప యోధర. పాశ, అంకుశములను రెండు చేతుల్లో ధరించి, వర, అభయ ముద్రలతో దర్శనమిస్తుంది. ఆమె కిరువైపుల వశ్యముద్రాశక్తి, ఈశిత్వసిద్ధి, దివ్యదేహధారిణులై, సేవిస్తున్నారు. అక్కడే రుద్రుడున్నాడు.

***14 దేవతల వివరము:*** - వీరు ఇంద్రగోప పురుగు రంగులో, మధుపాన మదవిరాజితలై, మనోహరా కృతులతో ఉన్నారు. నాల్గు భుజాలతో పాశ, అంకుశ, దర్పణ, పాన పాత్రలను ధరించి ఉంటారు.

| వారి పేర్లు | | వారిచ్చే సిద్ధులు |
|---|---|---|
| 1) సర్వసంక్షోభిణి | - | ఈమె సర్వాన్ని సంక్షోభింపచేస్తుంది. |
| 2) సర్వ విద్రావిణి | - | సర్వులను పరిగెత్తింపగలదు. |
| 3) సర్వాకర్షిణి | - | సర్వులను ఆకర్షించగలదు. |
| 4) సర్వాహ్లాదనిక | - | అందరిని ఆనందింపచేయగలదు. |
| 5) సర్వ సమ్మోహిని | - | అందరినీ మోహింపచేయగలదు. |
| 6) సర్వ స్తంభిని | - | అందరినీ స్తంభింప చేయగలదు. |
| 7) సర్వ జృంభిని | - | అందరినీక్రోధంతోలేదాఉత్సాహంతో విజృంభింపచేయగలదు. |
| 8) సర్వ వశంకరి | - | అందరినీ వశం చేసుకొనేది. |
| 9) సర్వ రంజనికా | - | అందరినీ రంజింపచేస్తుంది. |
| 10) సర్వోన్మాదికా | - | అందరికీ పిచ్చి పట్టిస్తుంది. |
| 11) సర్వార్థదాయిని | - | అన్ని కోర్కెలను ప్రసాదిస్తుంది. |
| 12) సర్వ సంపత్పూరిణి | - | అన్ని సంపదలను పూరిస్తుంది. |
| 13) సర్వ మంత్రమయి | - | అన్ని మంత్రాలను పొందిస్తుంది. |
| 14) సర్వద్వంద్వ క్షయకరీ | - | ద్వంద్వస్థితులను నశింపజేస్తుంది. |

**ఒక ముఖ్యవిషయం :-** వెనుకటి 3 చక్రములలోని సిద్ధులు లోకాన్ని బాధింపచేయగల్గేవి. కాని ఈచక్రంలోని సిద్ధులు ఏప్రాణినీ హింసించవు. అందుకే ఉపాసనను ఈ చక్రం నుండే ప్రారంభించడం శ్రేయోదాయకం అని నిర్ణయించబడినది. మణి పూరకచక్రంలో "అగ్ని" ఉంది. ఈ చక్రం అగ్నిష్టోమాత్మకం. క్రింది 3 చక్రములలో

అగ్ని లేదు. అవి తామిస్రములు. ఈ సర్వ సౌభాగ్యదాయక చక్రంలో చతుర్దశ దేవతలను ధ్యానిస్తే సాధకునికి చతుర్దశ విద్యలు సిద్ధిస్తాయి.

చతుర్దశ (14) విద్యలు :- 4 వేదములు (ఋగ్యజుస్సామాధర్వణములు)6 వేదాంగములు -(శిక్ష, వ్యాకరణ, ఛంధః, మీమాంస, నిరుక్తం, జ్యోతిషం, కల్పం) న్యాయ శాస్త్రం, పురాణం, ధర్మ శాస్త్రం.

## 5. సర్వార్థ సాధక చక్రము

ఇది ఐదవ ఆవరణం. ఈ చక్రాన్ని బహిర్దశార చక్రమంటారు. అనాహత కమల కర్ణికలో సమాహితంచేస్తే దర్శించ వచ్చు. సింధూర వర్ణంతో ప్రకాశిస్తూ దీనిలో పది దళాలున్నాయి. దీన్ని దశావతారాత్మకంగా పేర్కొంటారు. ఉపాసకునికి ఈ చక్రో పాసనలో భీభత్సరసానుభూతి కల్గుతుంది. పదిదళాలలో పది మంది కులయోగినీశక్తులున్నారు. చక్రాధిష్ఠాన దేవత త్రిపురాశ్రీ. ఈమెకు ఎదురుగా సర్వసిద్ధి ప్రదాదేవి ఉంటుంది. ఆమెనుండి వామావర్తముగా మిగిలిన తొమ్మిది మంది ఉన్నారు. అందరూ ఒకే రూపంతో విరాజిల్లుతున్నారు. జపాపుష్పవపుస్సుందర వర్చస్వినులు. మణి విభూషణ ధారులను పాశ, అంకుశ, అభయ, వరద ముద్రలతో నుండే వీరిని దర్శించి, చక్రదేవిని దర్శించడం క్రమం.

త్రిపురాశ్రీ జపాపుష్పకాంతితో, పాశ, అంకుశ ధారిణియై అనర్ఘరత్నఖచిత భూషణవిరాజితగా దర్శనమిస్తుంది. ఆమె కుభయ పార్శ్వములతో వశిత్వ సిద్ధి, సర్వోన్మాదన ముద్రిక, సేవిస్తూ ఉంటారు. ఈచక్ర మందు నారాయణమూర్తి దర్శనమిస్తాడు.

| *దశదేవతలు* | - | *సిద్ధులు* |
|---|---|---|
| 1) సర్వసిద్ధిప్రదా | - | అన్నింటిని సిద్ధింపచేస్తుంది. |
| 2) సర్వసంపత్ప్రదా | - | అన్ని సంపదలనిస్తుంది. |
| 3) సర్వ ప్రియంకరీ | - | అందరికీ ప్రియం కల్గిస్తుంది. |
| 4) సర్వమంగళ కారిణీ | - | అన్ని మంగళములనిస్తుంది. |
| 5) సర్వకామప్రదా | - | అన్ని కోర్కెలను తీరుస్తుంది. |
| 6) సర్వ దుఃఖ విమోచనీ | - | అన్ని దుఃఖాలనుండి విముక్తి కల్గిస్తుంది. |
| 7) సర్వ మృత్యుప్రశమనీ | - | అన్ని మృత్యువులను పోగొట్టుతుంది. |
| 8) సర్వ విఘ్న నివారిణీ | - | అన్ని ఆటంకాలను తొలగిస్తుంది. |

9) సర్వాంగ సుందరీ - అన్ని అంగాలకు సౌందర్యాన్ని కల్గిస్తుంది.

10) సర్వ సౌభాగ్యదాయినీ - అన్ని భాగ్యాలనిస్తుంది.

ఈ దశకోణాలలోనే వరుసగా 1) దిక్ 2) వాయు 3) సూర్య 4) వరుణ 5) అశ్విని 6) అగ్ని 7) ఇంద్ర 8) ఉపేంద్ర 9) మృత్యు 10) వైకారిక అనే దేవతలున్నారు. ఉపాసకుడు వారిని కూడా దర్శించి, వారి అనుగ్రహాన్ని పొందడం అవసరం.

## 6. సర్వరక్షాకర చక్రము

ఇది షష్ఠమ ఆవరణం. దీనినే అంతర్దశారం అంటారు. ఈచక్రము జపాకుసుమ వర్ణవిలసితమై ఉంది. "రం" బీజాత్మకమై అగ్ని ప్రకృతికమై ఉంది. ఈచక్ర దేవి త్రిపురమాలిని. ఈమె ఎదుట ఉన్న దళంలో "సర్వజ్ఞ" అనేశక్తి ఉంది. అక్కడినుండి వామావర్తంగా, అపసవ్యంగా, వరుసగా 9 మంది దేవతలున్నారు. వీరినే "నిగర్భ యోగినులు" అంటారు. ఉపాసకుడు ఈపది మంది యోగినుల మధ్య అధివసించి యున్న చక్రాధిదేవతను దర్శించి, ఉపాసించవలె. ఈదేవి తెల్లని పద్మ కాంతితో ప్రకాశిస్తుంది. పాశ, అంకుశ, ధనుస్సు, బాణములను నాల్గు చేతులలో ధరించి, అనేక దివ్యభూషణ విభూషితగా దర్శన మిస్తుంది. ఆమె ఇరువైపుల మహాంకుశ శక్తి, ప్రాకామ్యసిద్ధి సేవిస్తూ ఉంటాయి.

ఆమాత ప్రసన్నయైన దళములలోని 10 మంది దేవతలు అనుగ్రహించి ఫలములిస్తారు. వారు ఉదయసూర్యునిబంగారు కాంతితో ప్రకాశిస్తున్నారు. అందరు జ్ఞానముద్రను ధరించి, టంకము, పాశము, వరదముద్రలతో విరాజిల్లు తున్నారు. వారిచ్చు సిద్ధులిట్లున్నాయి.

**దేవత - సిద్ధి**

1) సర్వజ్ఞ - అన్నీ తెలుసుకోగల్గే శక్తి.

2) సర్వ శక్తి - అన్నింటిలో సత్తాకల్గి ఉండడం.

3) సర్వైశ్వర్య ఫలప్రదా- అన్ని ఐశ్వర్యాలనివ్వడం.

4) సర్వజ్ఞానమయీ - సమస్త జ్ఞానాన్ని పొందడం.

5) సర్వ వ్యాధివినాశినీ- అన్ని రోగాలను పోగొట్టడం.

6) సర్వాధారస్వరూపా- అంతకు ఆధారమైన శక్తి.

వలెను. 4,5,6 చక్రాలలో దక్షిణామ్నాయాన్ని అర్చింపవలసి ఉంది. దశ దళములలో సాధకుడు దశేంద్రియములను దర్శించి ధ్యానించి, దళముల సంధులలో దశవిధప్రాణ కళలను దర్శింప వలసి ఉంటుంది.

## 7. సర్వరోగ హరచక్రం

ఇది సప్తమావరణం. లంబిక యందు సమాహితం చేస్తే ఈచక్ర దర్శనం లభిస్తుంది. నోటిలో అంగుటియందు వ్రేలాడే ఒక చిన్న గ్రంధి లంభిక. దీన్నే చిరు నాలుక అంటారు.

హఠయోగ పద్ధతిలో "నాలుకను వెనుకకు మడిచి ఆచిరునాలుకను స్పృశించి నిల్పే అభ్యాసంలో సిద్ధులైన వారిని లంబికా యోగసిద్ధుల" ని పిలుస్తారు. వీరికి అమృతరస పానానుభవము కల్గునని తద్వారా అజరామర సిద్ధి పొందుతారని యోగ శాస్త్ర నిర్ణయం.

సర్వరోగ హరచక్రం లంబికలో ఉంది. ఇది అష్ట శక్తులతో, పద్మరాగమణి వర్ణరంజితాలైన ఎనిమిది దళములతో కన్పిస్తుంది. కకార ప్రకృతికము. సాధకుడీ సాధనలో హాస్యరసానుభూతి పొందుతాడు. ఈచక్ర మధ్యమందు నెలకొన్న చక్రేశ్వరికి ఎదుటనున్న దళము మొదలుకొని అపసవ్యక్రమంలో రహస్య యోగినులు 8మంది ఉన్నారు. వారంతా దీని రంగులో ఉండి, నాల్గు చేతులలో ధనుస్సు, బాణములు, అభయ, వరదముద్రలతో విలసిల్లుతున్నారు. వారిని దర్శించి, వారి అనుమతితో చక్రదేవిని ధ్యానించాల్సి ఉంది. ఆమె, వశిని దేవతకు ఎదురుగా ఉన్నది. జపాకుసుమమైచాయతో (దాసాని పువ్వు) ప్రకాశిస్తూంది. చతుర్భుజములతో ధనుర్బాణ పాశాంకుశాలను దాల్చి, ఇరువైపుల ఖేచరీ ముద్ర, భుక్తిసిద్ధి సేవిస్తూ ఉండగా, విరాజిల్లు దేవిని ఉపాసకుడు దర్శించగలడు. ఆమెతో పాటు ఉత్తరామ్నాయాన్ని ధ్యానించాలి. అష్ట దళంలోని దేవతల పేర్లు వారిచ్చే సిద్ధులుట్లున్నాయి.

| పేరు | - | ఫలసిద్ధి |
|---|---|---|
| 1) వశిని | - | ఇంద్రియాలను వశం చేసుకునే శక్తి. |
| 2) కౌమారి | - | కౌమారావస్థలోని ఉత్సాహం. |
| 3) మోదిని | - | అన్నింటిలో సంతోషం చెందే శక్తి. |
| 4) విమలా | - | ఏసందర్భంలోనైనా స్వచ్ఛంగా ఉండేశక్తి. |

5) అరుణా - దేవీరూపము నందలి భక్తి.
6) జయినీ - ఏ పరిస్థితిలోనైనా జయం పొందగల్గడం.
7) సర్వేశి - ఏసంఘంలోనైనా గొప్పదనం.
8) కౌలినీ - మూలాధారాది ఆజ్ఞాంత చక్రాలలోని శ్రీచక్ర దేవీ అనుగ్రహం.

ఈచక్రోపాసన వల్ల సాధకుడు ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధిభౌతిక రోగాలను పోగొట్టుకొని ప్రస్థానం చేయగలడు.

**ఈచక్రంలో ధ్యాన దర్శనములు చేయవలసిన విధానం:-**

ఈ సర్వ రోగ హరచక్రము (అష్టదళము)నకు, త్రికోణ చక్రమునకు మధ్య భాగంలో సమాహితం చేస్తే; సదాశివ, పరాశక్తుల యొక్క ఆయుధములు దర్శనమిస్తాయి. కోణాగ్రదేశములో పశ్చిమ నుండి నాల్గు దిక్కులలో,

1) బాణశక్తి దేవత కామేశ్వరి. 2) త్రికోణ దక్షిణపార్శ్వంలో ధనుశ్శక్తి.
3) ఉత్తర దిక్కున అంకుశశక్తి. 4) తూర్పు దిక్కున పాశశక్తి.

జతలుగా ఉంటాయి. 2 ధనుస్సులు 2 పాశములు 2అంకుశములు 5 బాణములు + 5 బాణములు. ఈఆయుధ శక్తులు దివ్య దేహధారిణులై ఒక్కొక్క ఆయుధాన్ని రెండుగా తలపై ధరించినారు. ఎర్రని మైచాయతో మెరుపు తీగల గుంపువలె మెరిసిపోతున్నారు. యౌవనోన్మాదంతో నిండి ఉండి, వరద, అభయ ముద్రలను దాల్చి ఉంటారు. ఉపాసకులు వీరిని ధ్యానించాలి.

2పంచబాణములు-2 పంచతన్మాత్రలు- విజృంభణరూపములు, క్రియాశక్త్యాత్మికములు.

2 ధనుస్సులు- మోహనరూపములు, ఇచ్ఛాశక్త్యాత్మకములు.

2 పాశములు- వశీకారరూపములు - రాగస్వరూపములు.

2 అంకుశములు - క్రోధాకారములు - జ్ఞానశక్తి మయములు.

## 8. సర్వసిద్ధిప్రద చక్రవము.

ఇది అష్టమావరణము. ఉపాసకుడు ఆజ్ఞాచక్రాన్ని లక్ష్యంగా సమాహితం చేస్తే ఈచక్రాన్ని దర్శింపగలడు. ఇది త్రికోణాకృతిగా ఉంది. మూడు రేఖలు మూడు శక్తితత్త్వములుగా ఉన్నాయి. త్రిగుణాత్మకం. నాదప్రకృతికము. బంధూక పుష్పవర్ణం. దీని దర్శనంలో సాధకుడు అద్భుత రసానుభవం పొందుతాడు. ఈచక్రములోని శక్తులు అతి రహస్య యోగినులు.

కోణాగ్రంలో కామేశ్వరీ దేవి. ఈమె రుద్రశక్తి, శరత్కాల చంద్రులు వందమంది ఒకేసారి ప్రకాశిస్తే ఎంత తేజస్సుగా ఉంటుందో, అంత తేజస్సుతో వెలుగుతూ ఉంది. ఒక చేతిలో పుస్తకం, మరొక చేతిలో పూదండ, రెండు చేతులలో వరద అభయ ముద్రలు ధరించి ఉంటుంది. సాధకుడు ఈతల్లిని ఉపాసించి, అనుగ్రహం పొంది దక్షిణ కోణమందు వజ్రేశ్వరీ దేవిని దర్శిస్తాడు. ఈమె విష్ణు శక్తి, ఉదయసూర్యకాంతితో ప్రకాశించే మైచాయతో, చెఱకు విల్లు, పుష్ప బాణములు వరద- అభయ ముద్రలను నాల్గు చేతులలో ధరించి ఉన్నది. ఆమెను ఉపాసించి ఉత్తర కోణ మందలి భగమాలా దేవిని దర్శిస్తాడు సాధకుడు. ఈమె బ్రహ్మశక్తి. మైచాయ పదహారు వన్నెబంగారు మి[illegible] గొలుపు తుంటాయి. చతుర్బాహువులలో పాశ, అంకుశ, జ్ఞాన, వరదముద్రలను కల్గి ఉంటుంది. ఉపాసకుడు ఈతల్లిని సేవించి, చక్రాధిష్ఠాన దేవత శ్రీ త్రిపురాంబాదేవిని దర్శించవలె.

ఈతల్లి ఇచ్ఛాశక్తి స్వరూపిణి. అరుణారుణ వర్ణదేహదీధితులతో సంధ్యారాగాన్ని వ్యాపింపజేస్తూ ఉంది. సౌందర్యశోభలను విరజిమ్ముతూ మంగళములన్నీ రూపెత్తినట్లున్నది. చతుర్బాహువులలో ధనుర్బాణములు, పాశాంకుశములు ధరించి ఉంది. సర్వబీజముద్రాశక్తి ఆమె పార్శ్వమున సేవిస్తూ ఉంటుంది. ఆభగవతిని, ఆమహేశ్వరిని ఉపాసించి సాధకుడు సర్వసిద్ధులు పొంది కృతార్థుడైతాడు.

గమనిక :- ఈత్రికోణ చక్ర మధ్యమందుండే బిందువు ఇచ్ఛాశక్త్య భిన్నము. అదే ప్రకాశాత్మిక, పశ్యంతీ నాదాత్మిక, సత్త్వగుణ ప్రధానమైన "అ" కారమాతృక అని ఉపాసించవలసి ఉన్నది. ఉపాసనలో నాదము "పశ్యంతి" గా అనుభవమౌతుంది.

## 9. సర్వానంద మయచక్రం

ఇది నవమావరణం. ఈచక్రము బిందు చక్రము. ఈబిందువు సహస్రార చక్రమందున్న చంద్రమండలంలో ఉంది. ఉపాసకుడు ఇంతవరకు పొందిన అనుభవాలతో ఉపాసనలో పరమావధి సమీపించినట్లే.

సహస్ర దళగత చంద్రమండలములో సమాహితమొనర్చితే బిందు చక్రదర్శనమైతుంది. అది సహస్రసూర్యుల కాంతి వలె ప్రకాశిస్తూ ఉంది. సాధకునికి శాంత రసం అనుభవానికొస్తుంది. పరాపరరహస్యయోగిని అనేశక్తి దర్శనమిస్తుంది. ఆమె మూల ప్రకృతి. ఈబిందు చక్రంలో సుధాసింధువు

(అమృత సముద్రం) ను దర్శిస్తాము. ఆహా! ఏమి భాగ్యము! ఆసుధాసింధు మధ్య ప్రదేశంలో మణిద్వీపదర్శనమౌతుంది. ఆద్వీపకాంతులు ఇంద్ర ధనుస్సుల శబలిత కాంతులను విరజిమ్ముతూంటుంది. ఆద్వీపములో కల్పవృక్షాలు, పారిజాతవృక్షాలతో నిండిన ఉద్యానవనం దివ్యసురభిళసుందర మంధరమై ఉన్నది. ఉపాసకుడు ఈప్రదేశాలన్నీ జగన్మాత భక్తి రసభరిత మత్తచిత్తంతో అనుభవం పొంది, ముందు చెప్పబోయే దర్శనాలు చేయగలడు.

ఈ విశిష్టస్థానాలను దూర్వాస ఋషికృత **"ఆర్యాద్విశతి"** లో వర్ణించినారు. ఈ సన్నివేశమహామహా సౌందర్యములు స్మరణమాత్రంతోనే అనేక జన్మ దురితాఘశోషణములు. శ్రీపరాభట్టారిక భవ్యకటాక్ష కాంతి పరివేషభూషణములు. పరమప్రేమరస నిర్భర విశేష పోషణములు.

కల్పవృక్ష ఉద్యాన మధ్యప్రదేశంలో ఒక నీపవనముంది. (కడిమితోట) దానిమధ్య చింతామణి భవన దర్శనమౌతుంది. ఈప్రదేశాలన్నింటి దగ్గర శ్రీలలితా పరమేశ్వరి పరివార దేవతలు ఎందరో తత్తత్ప్రదేశ పరిపాలనలో వ్యగ్రులై ఉంటారు. ఉపాసకుడు యథోచిత పద్ధతిలో వారి వారి దర్శనాలను పొందగలడు. ఇది ఆయా ఉపాసకుల అనేక జన్మ శుభవాసనా వాసిత భాగ్యపరిపాకమునుసరించి ఉంటుంది. ఆమణిద్వీప మధ్య ఉన్న చింతామణి భవన మధ్య వున్న విశిష్ట రత్న భూషణ ప్రాయ భవనమే శ్రీలలితా పరాభట్టారిక శ్రీకామేశ్వరీదేవి విలసిల్లే స్థానము. ఆజగన్మాత దర్శనమహత్తర భాగ్యము పొంది అచ్యుతానందాన్ని పొందుటకు ప్రయత్నపరులమౌదాం!

# అధ్యాయము-6.

## ఉపక్రమణిక:-

ఈ ప్రకరణంలో సర్వానందమయ చక్రదర్శనంలోని స్వర్లోకము, సుధాసింధువు, మణి ద్వీపము, చింతామణి భవనములను గురించిన వివరములు తెలుపబడుతున్నాయి. ఈదర్శనములలో సుప్రసిద్ధులైన శ్రీసనత్కుమార, దుర్వాస మహర్షి వంటి మహానుభావుల రచనలు శ్రీవిద్యోపాసకులకు పరమగమ్యము. శ్రీదేవీ భాగవతం(ద్వాదశస్కంధం) బ్రహ్మాండపురాణం, లలితోపాఖ్యానము, శ్రీలలితా సహస్రనామ రహస్య స్తోత్రం, దుర్వాసమహర్షి కృత "ఆర్యాద్విశతి"మొదలైన గ్రంథాలలో, మరికొన్ని తంత్ర గ్రంథాలలో శ్రీపరాభట్టారికా లోక వర్ణనలున్నాయి.

వీటినన్నింటినీ విపులంగా తెల్సుకున్నప్పుడు సాధకునికి దర్శనంలో పరిపూర్ణత సాధ్యమౌతుంది. అక్కడి సన్నివేశాలు, ఆయాప్రాకారాలలోని దేవతాగణము, వారి సేవావిధులు, ప్రవేశ పద్ధతులు, సత్యలోక వైకుంఠ, కైలాస లోకాలకు పైనున్న సత్యలోక విస్తారవైభవాలను యధాశక్తి వివరించడానికే ఈప్రయత్నం. ఆదివ్యలోకాతి వైభవాలను భావించడమే గొప్ప భాగ్యము! కుహనా యధార్థవాదులు, భౌతిక వాదులు వీటన్నింటిని కల్పనారచనలన వచ్చు! కాని వాటి రచయిత లందరూ ఋషులు. యోగశక్తితో ఆయా లోకాలలో సంచరించి వాటిని దర్శించినవారు. లేకుంటే ప్రతిచిన్ని అంశాన్ని అంత అద్భుతంగా వర్ణించలేరు. కల్పన కిక్కడ అవకాశమే లేదు! ఈవిశ్వాసం కల్గి ఉన్న ఆస్తికులు, సాధకులు శ్రద్ధతో తెలుసు కున్నప్పుడు దే[illegible]కు పాత్రులు కాగలరు.

శ్లో|| సుధాసింధోర్మధ్యే, సురవిటపివాటీపరివృతే
మణిద్వీపే నీపోపవనవతి చింతామణిగృహే
శివాకారే మంచే, పరమశివపర్యంకనిలయాం
భజన్తి త్వాం ధన్యాః కతిచన చిదానందలహరీం!

- శ్రీశంకరభగవత్పాదుల శివానందలహరి.

ఆజగజ్జనని చిదానందలహరి. ఆమెను కొద్దిమంది మాత్రమే (ధన్యులు) సేవిస్తున్నారు. ఆతల్లి ఉండే లోకంలోని సుధాసింధువు, **మణిద్వీపం, చింతామణి** గృహం వంటివానిని సూచిస్తూ శంకరుల వారు **పరాభట్టారికను స్తుతించినారు.**

**అనేక కోటి బ్రహ్మాండజననైన పరదేవత మహిమ అనంతం. ఊహాతీతం బ్రహ్మాదులు, సహస్రముఖులు కూడా ఆమహిమ వర్ణించేందుకు శక్యులుకారు. ఆశక్తి "ఏతత్తదిత్యనిర్దేశ్యా."** ఇది అది అని నిర్ణయించేందుకు **శక్యం కానిది కదా!**

**ఇచ్ఛామాత్రంగానే పరాభట్టారిక తనకొక లోకాన్ని నిర్మించుకుంది. అది సత్య, వైకుంఠ, కైలాస లోకాలకన్నా చాలా విస్తారమైనది.** సృష్టిలోని సౌందర్య విభవ విస్తార సమృద్ధులకు ఆ లోకమే పరాకాష్ఠ. దాని పేరు సర్వలోకము. అందలి భాగాలేసుధాసాగరం, మణిద్వీపం, చింతామణిగృహం మొదలైనవి. సుధాసింధు స్మరణ మాత్రంలోనే సంసారతాపం నశించి పరమశాంతం అనుభవమౌతుంది. అది అనేక జన్మ త్రివిధ పాపనోదనచణము.

ఆసుధాసింధువు అలల తాకుడులచే ఏర్పడిన తుంపురుల కాంతి తీరములో అనేక రత్నకాంతులు విరజిమ్ము వృక్షాలు బారులు తీర్చినట్లు పొడగట్టుతుంది. ఆ మణుల దీవి చుట్టూ సుధాసముద్రముననౌకా విహారం చేసే దేవీభక్తులున్నారు. ఆ నౌకలు రాజహంసల్లా కనిపిస్తాయి. ఆ మణి ద్వీపం 18 ప్రాకారాలు కల్గి చింతామణిగృహం ఉంది. ఆ 18 ప్రాకారాలు 18 రకాలుగా ఉన్నాయి. అసలు ఈ 18 సంఖ్యే ఆధ్యాత్మిక సంకేతము. 18 సంఖ్య ఈక్రింది విధంగా 18 తత్వములను సూచిస్తుంది.

కర్మేంద్రియాలు 5 + జ్ఞానేంద్రియాలు 5 + పంచభూతాలు 5 + మనస్సు 1 + బుద్ధి 1 + అహంకారం 1 + = మొత్తం 18. ఈ 18 తత్వాలను దాటి నప్పుడే పరాశక్తి దర్శనానికి అధికారం భాగ్యం కలుతుంది. భారతీయ అధ్యాత్మ వాఙ్మయంలో ముఖ్యంగా మహాభారతంలో 18 పర్వములు, భగవద్గీత 18 అధ్యాయాలు భారతయుద్ధం 18 రోజులు, అట్లే 18 పురాణాలు, 18 ఉపపురాణాలు వంటి 18 సంఖ్యలోని సంకేతం ఇదే.

## చింతామణి గృహప్రాకారాల వర్ణన:-

**1) లోహప్రాకారం** :- 4 ద్వారాలతో, సప్తయోజన విస్తీర్ణంతో ఉంది పరాదేవి లోక ప్రవేశం 4 ద్వారాల నుండి జరుగుతుంది. దేవ గంధర్వాదులు వారి వారి వాహనాలతో బారులు దీరి ప్రవేశానుమతికై ప్రతీక్షిస్తుంటారు. ఆప్రాకారాన్ని రక్షించేవారు దివ్య శస్త్రాస్త్ర పాణులై నిర్ణీత పద్ధతిలో ప్రవేశాన్ని కల్గిస్తారు. విమానచరులు గూడా ప్రాకారం ముందే నిలువవలసి ఉంటుంది.

**2) కంచు ప్రాకారం** :- ఇది సప్త యోజన సమున్నతం. దీనిలో అనేక చిత్ర చిత్ర తరుశోభిత ఉద్యానవనాలు, సర్వర్తు పుష్ప ఫలభరితాలైన వృక్షాలతో, బహు సరోవిరాజిత హంసకారండవాది జలపక్షి కూజిత మధుర ధ్వనులతో మనోహరంగా ఉంటాయి. అంతే కాక మత్తమధుప శుక శారికాది విచిత్ర వర్ణ విహంగ కూజితమై, మయూరనాట్య శోభాదర్శనీయమై, హరిణీ హరిణ విహరణ రంగ రమణీయమై ఉంది. పూదేనియలు చిరుకాలువలై పారుతుంటాయి. దేవీ పరిచారికాగణం కాపుంటుంది. దేవీభక్తులు విహారం సల్పుతుంటారు.

**3) తామ్రము ప్రాకారం**:- ఇది కూడా సప్తయోజన సమున్నతమే. ఇందు కల్పవృక్షోద్యానముంది. ఈవృక్షాలు సువర్ణవర్ణ పత్రాలు రత్నబీజయుక్త

ఫలాలను కల్గి ఉంటాయి. వీటి పుష్పముల పరిమళం దశయోజన పర్యంతం ప్రసరిస్తుంటుంది. వసంతుడు మధుశ్రీ, మాధవశ్రీ, అనే ప్రియ పత్నులతో ఆవనంలో విహరిస్తుంటాడు. గంధర్వ దంపతుల గానములు కోలాహలము వనవిహంగ కలస్వర వికస్వరమై ఉంటుంది.

**4) సీసప్రాకారం:** - సప్తయోజన సమున్నత ప్రాకారము. తామ్ర సీస ప్రాకారాలమధ్య ప్రదేశము సంతాన వృక్షమండితము. ఈవనాలకు అధిపతి గ్రిష్మర్తువు. ఇతడు శుచిశ్రీ, శుకశ్రీ లనే ప్రియ పత్నులతో విహరిస్తుంటాడు. ఈప్రాకార మధ్య ప్రాతంలో దివ్యులు సిద్ధులు తమతమ విలాసినీ బృందాలతో విహారమొనరిస్తుంటారు.

**5) ఇత్తడి ప్రాకారము** :- సీస, ఇత్తడి ప్రాకారాల మధ్యప్రదేశము హరిచందననందనోద్యాన శోభితము. మేఘవాహనుడైన వర్షర్తువు దీనికిరాజు. ఈయనతన 12 మంది ప్రియసఖులతో హరివిల్లును ధరించి, ఉరుములే శంఖధ్వానములై, వర్షధారలే బాణధారలుగా పాలిస్తున్నాడు.

**6) పంచలోహప్రాకారము** :- సప్తయోజన సమున్నతమైన ఈ పంచలోహప్రాకారానికి, ఇత్తడి ప్రాకారానికి మధ్యప్రాంతము మందారవన వాటికలతో శోభిల్లుతూ ఉంటుంది. శరదృతురాజు దీని అధిపతి. అతడు ఇష్టలక్ష్మి, ఊర్జలక్ష్మి అనే తన ఇష్టసఖులతో విహరిస్తుంటాడు. నానావిధసిద్ధ గణాలకుకూడా ఇది విహారస్థలము.

**7) రజిత ప్రాకారము** :- ఇది తళతళలాడు శిఖరాలతో ఉంది. ఇది సుదృఢవినిర్మితము. ఈరెండింటికి మధ్యదేశంలో పారిజాతవనాలు సొబగులీనుతుంటాయి. హేమంతర్తురాజు తనసఖులు సహశ్రీ, సహ్య శ్రీ లతో గూడి విహరిస్తుంటాడు. ఇక్కడ శ్రీమహారాజ్ఞీ పరిచర్యాకుశలులైన దివ్యదేవతా గణాలు వ్యగ్రులై ఉంటారు.

**8) సువర్ణప్రాకారము** :- సప్త యోజనాల ఎత్తు గల్గినదీ ప్రాకారము. వెండి, బంగారు ప్రాకారాల మధ్యభాగము పుష్పపల్లవ శోభాభరితము. కదంబ (కడిమి) వన పంక్తులు ప్రవర్ధమానంగా ఉన్నాయి. శిశిరర్తు రాజు తపశ్రీ తపస్యశ్రీలనే ప్రియసఖులతో విహరిస్తుంటాడు. మహాసిద్ధ గణాలు దేవ ధ్యాన తత్పరులై ఉన్నారు.

**9) పుష్యరాగమణి ప్రాకారము:**- ఇక్కడి వనోపవనములన్నీ

పుష్యరాగమణి శోభావిలాసితాలు. ఈ కోటలో ప్రతి బ్రహ్మాండంలో ఉండే దిక్పాలకులైన లోకపాలకులు, దేవీభక్తినిర్భరులై, భయసంభ్రమసేవావ్యగ్రులై ఉంటారు. తూర్పుదిక్కున ఇంద్రుడు, ఆగ్నేయంలో అగ్ని, దక్షిణాన యముడు, నైఋతి దిక్కులో నిర్ఋతి, పశ్చిమ దిక్కున మత్స్యవాహనుడై వరుణుడు, వాయవ్యాన ధ్వజహస్తుడై పరివారంతో కూడిన వాయుదేవు డున్నాడు. ఉత్తరాన యక్షలోకముంది. తదధిపతి కుబేరుడు వృద్ధి, బుద్ధి అనే పత్నులతో నవనిధులతో నున్నాడు. ఈశాన్యాన రుద్ర లోకముంది. ఉగ్రక్రోధ రూషిత నేత్రుడైన రుద్రుడు, శూలాద్యాయుధధారులైన తనతో సమానులైన రుద్రగణముతో, రుద్రాణీయుతుడై, భద్రకాళి మొదలైన మాతృకలతో శక్తి, డామర, వీరభద్రాది గణాలకధిపతిగా ఈశాన్యాన్ని కాస్తున్నాడు. వీరంతా సమష్టిదిక్పాలురు. అంటే అన్ని బ్రహ్మాండాలలోని దిక్పాలు రకందరికీ వీరే అధికారులు.

**10) పద్మరాగమణి ప్రాకారము** :- దశయోజన సమున్నత ప్రాకారమిది. ఇందలి భూభాగాలు, వనాలు, కాసారాలన్నీ పద్మరాగమణి ఖచితాలే. మణిస్తంభములతో విరాజిల్లే అనేక శతమండపాలతో శోభిల్లుతుంది. ఈకోటలో 64 కళలు శక్తిరూపాలను ధరించి, ఒక్కొక్కరు ప్రత్యేకలోకాన్ని నిర్మించుకొని నివసిస్తున్నారు. వీరంతా మహాభీకరాగ్ని జ్వాలా పరివృత జిహ్వలతో, వికటభ్రూకుటీ భీషణ లోచనాలతో, తమ తమశక్తి సైన్యాలతో సర్వ సన్నద్ధులై ఉంటారు. వీరిలో ప్రతి ఒక్కరికీ నూరు అక్షౌహిణుల వీరనారీ భటనివహముంది. ఈసైన్యాలన్నీ భయంకర దంష్ట్రాలతో, కరాళవదనలై, అనేక దివ్యాయుధాలను ధరించి సన్నద్ధంగా ఉంటాయి. ఈవిధంగా 64 శక్తి సేవాలోకాలు ఈప్రాకారంలో ఉన్నాయి.

**11) గోమేధికమణి ప్రాకారము** :- పదియోజనాల ఎత్తు గోపురద్వారాలు శృంఖలాబద్ధమై రక్షాగుప్తిని పొంది ఉంటాయి. వజ్ర ఖచితాలైన మహాసౌధాలు, దీర్చి దిద్దబడిన రాజవీధులు, అలంకరించబడిన చతుష్పదాలతో విరాజిల్లుతుంటుంది. శ్రీభువనేశ్వరీ పరిచారికలు ఇక్కడ నివసిస్తుంటారు. ఒక్కొక్క పరిచారికకు ఒక్కొక్క లక్షముంది దాసీ జన మున్నారు. పరిచారికలు భువనేశ్వరీమాతకు అలంకరిస్తారు. కొందరు శృంగారసామాగ్రిని సిద్ధపరచి చేతుల్లో పట్టుకొని ఉంటారు. మరికొందరు హారనూపురాది భూషణములనలంకరిస్తారు. వీరంతా శృంగార మదపతులైన

యువతులు వీరు అనంగరూప, అనంగమదన వంటి పేర్లను కల్గి ఉన్నారు. వీరి విభూతి విభవాలు ఎనిమిది దిక్కులకు ప్రసరిస్తుంటాయి. అంతః పురాలలో మందిర ప్రాంగణాలలో మెరుపు తీగలవలె సంభ్రమ సంచారాలతో నూపురరావాలు ఘల్లుఘల్లుమంటూంటే, కనుసన్నలతోనే ఆజ్ఞాపాలకులతో అన్నిపనులను నిర్వర్తింప చేస్తుంటారు.

**13) వైడూర్య ప్రాకారము** :- గోపుర ద్వారాలంకృతమై పదియోజనాల ఎత్తు కల్గి ఉంటుంది. వైడూర్యమణిమయ ప్రాసాదాలు, వాపీకూపతటాకాలు, వైడూర్యమణిఖచితసోపానాలతో అత్యంత మనోహరంగా ఉంటాయి. ఇది అష్టమాతృకలస్థానము. ప్రతి బ్రహ్మాండంలోని మాతృకల సమష్టి అధికారిణులు వీరు. బ్రహ్మి, మాహేశ్వరి, కౌమారి, వైష్ణవి, వారాహి, ఇంద్రాణి, చాముండి, మహాలక్ష్మి అనే పేర్లతో, తమ తమ పరి వారాలతో ప్రత్యేకమైన ప్రాకారాలతో జగత్కళ్యాణకృత్యాలను నిర్వర్తిస్తూ ఉంటారు వీరు. ఈప్రాకారంలోనే పరమేశ్వరి వాహనాలు సర్వాలంకార శోభితలై, సర్వపరికరసన్నద్ధలై నిల్చి ఉంటాయి. అవికోట్ల సంఖ్యలో ఉంటాయి. పార్శ్వరక్షకులు, వారి అనుచరులు, సారథులు, ఆకాశాన్నితాకే ధ్వజాలు రెపరెపలాడుతుంటాయి. హంస, గరుడ, సింహ, గజ, అశ్వ, మయూర వృషభముల వంటి అన్ని రకాల జంతువులను పూన్చిన రథాలున్నాయి.

**14) ఇంద్రనీల మణిప్రాకారము**:- పది యోజనాల ఎత్తు విశాల వీధులు, రాజమందిరాలతో మనోహరంగా ఉంటాయి. భవనాలన్నీ ఇంద్రనీలమణిమయాలే. ఈప్రాకారం షోడశ(16) దళాలలో ఉండే పద్మాకారంలో ఉంది. సర్వవిభవసముజ్వలం. షోడశ శక్తులకాలవాలం. ఆశక్తుల పేర్లివి. కరాళి, వికరాళి, ఉమా, సరస్వతి, శ్రీదుర్గ, ఉష, లక్ష్మి, శృతి, స్మృతి, ధృతి, శ్రద్ధ, మేధ, మతి, కాంతి. వీరు ఇంద్రనీలమేఘశ్యామలములైన దివ్య దేహాలతో కరవాలాలను ధరించి ఉంటారు. వీరు శ్రీమహారాజ్ఞికి సేనాపతులు.

**15 ముక్తామణిప్రాకారము** :- ఇదికూడా పది యోజనాల ఎత్తు ఉంది. ఆభూభాగమంతా అష్టదళపద్మం ఆకారంలో శోభిస్తుంటుంది. పరమేశ్వరితో సమాన ఆకారములు కల్గి, ఆయుధ ధారిణులైన అష్టమంత్రిణులుండేదిక్కడే! వారంతా మహాపాండిత్య ప్రఖ్యాతలు.

సకలబ్రహ్మాండాల రాజకీయవార్తలను జ్ఞాన శక్తిద్వారా సేకరించి మహాదేవికి మంత్రాంగం నడుపుతుంటారు. వీరు సర్వకార్యకౌశల్యప్రావీణ్యలు. దేవీ కార్య దురంధరలు. చతురలు. శ్రీ మహారాజ్ఞిమనోభావాలను గుర్తెరిగి, క్షణాలల్లో ఆమె ఆజ్ఞలను అమలు చేస్తారు. వీరి పేర్లు అనంగకుసుమ, అనంగ కుసుమాతుర, అనంగమదన, అనంగమదనాతుర, భువనపాల, గగనవేగ, శశిరేఖ, గగనరేఖ.

వీరెల్ల పరాభట్టారిక వలెనే అరుణవిగ్రహాలు. పాశ, అంకుశ, వర, అభయ ముద్రాయుత చతుర్బాహుసంయుక్తలు. క్షణక్షణము ఈ విశ్వసంబంధమైన వార్తలు, రాజకీయాధికారాలు, మార్పులు శ్రీమహారాజ్ఞికి వినిపించి తగిన వ్యవహారాన్ని నిర్వహించడంలో దక్షలై, శ్రీరాజ్ఞితో సమానభోగాలను, అధికారాలను కల్గి ఉన్నారు.

**16) మరకతమణి ప్రాకారము** :- ఇది కూడా 10 యోజనాల ఎత్తుంటుంది. ఇచటి సౌందర్యాలు వర్ణనాతీతాలు. ఈప్రదేశమంతా షట్కోణాకారాంలో ఉంది. బ్రహ్మాదులందరూ ఆకోణాలలో స్వీయ లోకాలను నిర్మించు కొని ఉన్నారు.

తూర్పు కోణంలో బ్రహ్మగాయత్రీ సహితుడై, కుండిక, అక్షమాల వరదండ హస్తాలతో విరాజిల్లుతున్నాడు. గాయత్రీమాత కూడా బ్రహ్మవలెనే నాలుగు చేతులలో పైన పేర్కొనవాటినే ధరించి విలసిల్లుతుంది. వేదాలు, శాస్త్రాలు, స్మృతులు, పురాణాలు రూపాలను ధరించి గాయత్రీదేవిని సేవిస్తుంటాయి. నైఋతి కోణంలో శంఖ, చక్ర గదా పద్మాలను ధరించి సావిత్రి, వాయు కోణంలో పరశువు (గండ్రగొడ్డలి) అక్షమాల, వర, అభయ ముద్రలను ధరించి మహారుద్రుడు సమస్త రుద్రులతో వసించి ఉంటాడు. అగ్ని కోణంలో రత్నకుంభం, మణికరండం (పెట్టె) ధనదుడు కుబేరుడు, మహాలక్ష్మి ఉంటారు. వరుణకోణంలో రతీ సమేతుడై మన్మధుడుంటాడు. శృంగార రసంలోని భేదాలు రూపుగైకొని, పాశ, అంకుశ ధనుర్బాణాలను ధరించి ఉంటాయి. ఈశాన్య కోణంలో వీరుడైన గణపతి పుష్టితో కూడి, పాశ అంకుశాలను ధరించి విఘ్నాలను తరిమికొడ్తూ ఉంటాడు.

**17 ప్రవాళప్రాకారము** :- ఈప్రాకారం కుంకుమారుణవర్ణ దీప్తులతో శతయోజనసమున్నతమై అలరారుతూంది. ఇక్కడ పంచభూతాలకు సమానమైన కాంతులుండి, పంచభూత శక్తులుంటాయి.

**18) నవరత్న ప్రాకారము :-** చిత్ర చిత్ర రత్నకాంతులతోను విరజిమ్ముతుంటుంది. అనేక యోజన సమున్నతము. భవనాలన్నీ నవరత్నమయాలే. ఇక్కడ ఆమ్నాయ దేవతలుంటారు. శ్రీమహారాజ్ఞి ఎన్నిఅవతారాలను దాల్చిందో ఆఅవతారమూర్తులన్నీ ఇక్కడ వెలుగొందుతుంటాయి. మహా విద్యా, మహా భేదాలన్నీ రూపుదాల్చి ఉన్నాయి. వీరంతా ఆవరణ దేవతలు కోటి సూర్యప్రభా భాసమానలు. సప్త కోటి మహా మంత్ర దేవతలు దివ్యమూర్తులను ధరించి ప్రకాశిస్తున్నారు. ఈ ప్రాకారాన్ని దాటి వెడలితే మధ్యప్రదేశంలోనే చింతామణి భవనము ఉంది.

## చింతామణి భవనము

నవరత్న ప్రాకార మధ్యప్రదేశంలోని చింతామణి భవనం అద్భుతములకెల్ల అద్భుతమైన సృష్టి. అహో! దాన్ని వర్ణించడానికి సహస్రముఖు లెందరైనా చాలరు. ఆపరాశక్తి మానసీసృష్టి ఇది. దానివిస్తీర్ణం ఎటుచూసినా సహస్ర యోజనా లుంటుంది. అంతరిక్షాననే నిల్చి, వెలుగుతూంది. నిరంతరం పద్మం వలె ఒక సారి సంకోచిస్తూ, ఒకసారి వికసిస్తూ ఉంటుంది. అన్ని బ్రహ్మాండాల నుండి శ్రీదేవ్యుపాసకులు వచ్చి, దర్శన ప్రవేశాలను పొంది ధన్యులైతారు.

ఆభవనతేజః పుంజము ఏదో అనిర్వాచ్యమహాభూతమా అనిపిస్తుంది. ధగధగత్కాంతుల ప్రసారము దుర్నిరీక్ష్యమై, ఇంద్రధనుస్సహస్ర ప్రభాప్రసరణ ప్రదర్శన విశేషమునిమ్మీలిత మధురాను భవాన్ని ప్రసాదిస్తుంది. ఒక్క చింతామణిని దర్శిస్తేనే మనకు కోర్కెలు తీర్చుకోవాలనే భావాలు రేకెత్తుతాయోమోకాని, చింతామణి మయభవనాన్ని దర్శిస్తే, కోర్కెలనంత సాగరాలై, కోర్కెలనేవిఏమో, అవి అడగడమేమో తెలియలేనిస్థితి కల్గుతుందా? లేకుంటే అవి అధికాధికంగా లభించడం వల్ల కోర్కెలంటేనే మొగం మొత్తు తుందా? ఆప్తకామత్వానికి ఇదే అర్థమా? లేక **"నిష్కామానామేవ శ్రీవిద్యాసిద్ధిః"** అనే అభిహితోక్తి ప్రకారం నిష్కాములకే (కోర్కెలు లేనివారికే) శ్రీవిద్య సిద్ధిస్తుంది. అనేది నిలుస్తుందా? అని ఆలోచిస్తే రెండవదే సరైనది. ఇది స్తిమితగంభీరానుభవస్థితిలో వెలువడిన నిర్వచనమంటే సరిపోతుంది.

శ్రీ విద్యాసిద్ధిని పొందిన వారికే చింతామణి భవన దర్శనం లభిస్తుంది. అక్కడి మందిరాలు, సహస్రస్తంభమండపాలు, గోపురాలు, ద్వారాలు, గవాక్షాలు, కొన్ని చంద్రకాంత మణిమయాలు. కొన్ని సూర్య కాంత

మణిమయాలు మరికొన్ని విద్యుత్కాంతమణిమయాలై తోస్తాయి. అవన్నీ చింతామణులలోని రకాలేమో! ఈచింతామణి భవనమునకున్న లాలిత్యము, చాకచక్యసౌందర్యము, కౌశల్యము, ఎంతో అద్భుతము! ఎంతమంది విశ్వకర్మలు, మయబ్రహ్మలు కల్పినా ఇంతటి అద్భుతసృష్టి సాధ్యం కాదు. ఈస్మరణంతోనే మనమంతా ధన్యులమైనాము.

ఆజగజ్జనని శ్రీరాజరాజేశ్వరి భక్తులకు ఉపాసకులకు సేవా భాగ్యాన్ని కల్పించే మండపాలు నాల్గున్నాయి. అవి అనేక సూర్యప్రభలతో విరాజిల్లు తున్నాయి. వేయి స్తంభాల మండపాలు. ప్రతిస్తంభం విలక్షణ విచిత్ర రచనా సౌందర్యంతో అలరారుతుంది. అపురూప శిల్ప శోభిత వితానాలు, దివ్య పరిమళధూపవాసనా వాసితాలు. ప్రతి మంటపం చుట్టూ కాశ్మీరవనము. మల్లికావనము, పుష్కలవనము ( ఇది కస్తూరిపరిమళముగల పుష్ప విశేషవనము) లున్నాయి. ఈ వనముల సుగంధ చందన వ్యాప్తి మణిద్వీపాని కంతా ఉంటుంది. ఇవన్నీ వాపీకూపకేళీసరస్సులు. రత్న సోపాన నిర్మితాలు. సుధారస పూరితాలు. మదబంభర స్వరాలు. నాదబ్రహ్మోపసంధాయకాలు.

**1) శృంగారమండపము :-** దేవ గంధర్వ నారీమణులిక్కడ అమ్మవారి మహిమలు గానంచేస్తుంటారు. దేవనర్తకీ గణనాట్యవిశేషవిలాసాలు అనేక కోటి బ్రహ్మాండాలనుండి ఏతెంచిన కోట్ల సంఖ్యలో బ్రహ్మాణీబ్రహ్మలు, లక్ష్మీనారాయణులు, గౌరీశంకరులు, దివ్యౌఘ, సిద్ధౌఘ, మానవౌఘాలు, సతీ సమేతంగా వచ్చిన దిక్పాలకకోట్లు, శ్రీచక్రగత చక్రేశ్వరులు, మంత్రిణీ దండినీ ముఖ్యులు, శ్రీచక్రగత సర్వదేవతాశక్తులు, దేవగంధర్వ యక్షకిన్నెర కింపురుషాదిదేవగణాలు, బ్రహ్మర్షిసంఘాలు, దేవర్షిసంఘాలు, రాజర్షి సంఘాలు, అమ్మవారి భక్తిరసభరిత చిత్తాలతో భయవినయ సంయుత శరీరాలతో సేవిస్తుంటారు. వారంతా శ్రీవిద్యాసిద్ధులే! అనేకకోటి బ్రహ్మాండజననిని, శ్రీమహారాజ్ఞి, శ్రీ రాజరాజేశ్వరి సభామండప మధ్యంలో దివ్యరత్నఖచిత శ్రీమత్సింహాసనేశ్వరియగుచు తనసేవావసరము ఆ మండపంలో ప్రసాదిస్తుంది.

**2) ముక్తి మండపం :-** చింతామణి భవనంలోని మండపాలన్నీ ఒకటవశృంగారమండపంలోని సన్నివేశాలనే పోలిఉంటాయి. ఈముక్తి మండపంలో శ్రీపరాశక్తి అధికార భూమికలో ఉన్న మహానీయులకు ముక్తిని ప్రసాదిస్తుంది.

**3) జ్ఞానమండపం :-** ఇక్కడ పరమేశ్వరి జ్ఞానాన్ని ప్రసాదించి, ధన్యులను జేస్తుంది. ముక్తినిచ్చి, మళ్ళీ జ్ఞానాన్నివ్వడం ఏమి? అని ఆలోచిస్తే **"జ్ఞానాదేవతు కైవల్యం"** అని గదా నిర్వచనం. ఇక్కడిముక్తిని క్రమముక్తిగా అర్థం చేసుకోవల్సిఉంది. ముక్తిమండపం క్రమముక్తిని, జ్ఞానమండపం సద్యోముక్తిని ప్రసాదిస్తాయి. లేదా సామీప్య, సారూప్య, సాయుజ్యముక్తులలో సామీప్య, సారూప్యాలను ముక్తిమండపం ప్రసాదిస్తే, జ్ఞానమండపం తత్త్వజ్ఞానాన్ని ఉపదేశించి ధన్యులను చేస్తుంది.

**4) జగద్రక్షణ మండపము:-** దీనిలో శ్రీమహారాజ్ఞి జగద్రక్షణను గూర్చిన వ్యవహారాలను మంత్రిణులతో తత్తదధికారిణులతో సంప్రదించడం, దుష్టశిక్షణకార్యాలు, శిష్టరక్షణ కార్యాలునిర్వహిస్తూ, అధికారులకు ఆజ్ఞనివ్వడం వంటి జగద్వ్యవహారాలను నడుపుతుంటుంది.

పై నాల్గు మండపాల తర్వాత చింతామణి భవనంలో శ్రీదేవి అంతఃపురభవనం ఉంది. పూర్వోక్త భవన చతుష్టయం కన్న మిన్నగా, మహావిభవసమృద్ధి విశిష్టమై ప్రకాశిస్తూంటుంది. ఆయంతర్భవనంలో ఒక పర్యంకం ఉంది. అది తొమ్మిది సోపానాలను కల్గి ఉంటుంది. ఈతొమ్మిది సోపానాలు నవశక్త్యాత్మకాలై దివ్యమణి రచితాలై ఉన్నాయి. ఆమంచానికి ఆధారంగా (నాల్గుకోళ్ళు) బ్రహ్మ, విష్ణువు, రుద్రుడు, సదాశివుడున్నాడు. దీన్నే **"పంచ బ్రహ్మాసనం"** లేదా **"పంచప్రేతాసన"** మని పిలుస్తారు. దీనికి కారణం, పైన పేర్కొన్న వారంతా నిశ్చలత్వం పొంది ప్రేతాలవలె ఉండడమే.

ఆపర్యంకంలో మహాదేవుడైన కామేశ్వరుడు అతని వామాంకంపై (ఎడమ తొడపై) శ్రీకామేశ్వరీ (జగజ్జనని భువనేశ్వరి) అధివసించి ఉంటారు.

ఆ మహాశక్తి అఖిలబ్రహ్మరూపిణి. సృష్ట్యాదిలో క్రీడార్థమై తన దక్షిణ భాగాననుండి ఈమహాదేవుని సృష్టించింది. తానే రెండు రూపాలుగా మారింది. ఆమహా దేవుడే కామేశ్వరుడు. ఈస్వామి కోటి మన్మథుల సౌందర్య రాశియై విరాజిల్లుతున్నాడు. మందహాసంతో ఆనందాన్ని స్ఫురింపజేస్తున్నాడు

**కామేశ్వరుడు- నిత్య నిరతిశయ సుఖస్వరూప బ్రహ్మము.**
**కామేశ్వరి- మహామాయాశక్తి - బ్రహ్మవిద్య. వీరే శివశక్తులు.**

కామేశ్వరుడు కోటిసూర్య ప్రభా భాసమానుడై, కోటి చంద్ర ప్రసన్నతతో విరాజిల్లుతూ, నిత్యనవయౌవన శోభితుడై ఉన్నాడు. ఆయన

వామాంకంపై నిత్య యౌవన మాంగళ్య శ్రీకామేశ్వరి ఉంది.

ఆతల్లి సౌందర్యం, అలంకారాలు వర్ణనాతీతాలు. శ్రీశంకర భగవత్పాదులు అమ్మవారి సౌందర్యలహరిని లోకాన ప్రవహింపజేసి ధన్యమొనర్చినారు. దేవీభాగవత, లలితోపాఖ్యానాది గ్రంధాలలో అద్భుత వర్ణనలున్నాయి. శంకరులకు కూడా అనేమాత్మక శివ, సుందర తత్త్వము సగుణ రూపమైనప్పుడు అనంతమైన ఆసౌందర్యాన్ని ఎందరెందరు ఎంతెంత వర్ణిస్తే, అంతంత కృతార్థులౌతారు.

శ్రీమాత వాగ్విభూతులొసగి, వశిన్యాదులైన వాగ్దేవతాశక్తులద్వారా భక్తజనోద్ధరణకై, కరుణతో శ్రీలలితా సహస్రరహస్యనామాలను ప్రసాదించింది. ఇవన్నీ ఆదేవి సౌందర్యతత్త్వవర్ణనలే. వాటిలో మచ్చునకు కొన్ని తెలుసుకుందాం!

## శ్రీదేవి సౌందర్యం:-

శ్రీమాత కోటి సూర్యుల, కోటి చంద్రుల ప్రకాశంతో దర్శనమిస్తుంది. ఆమహఃపుంజం అరుణ వర్ణంతో ( దానిమ్మ పువ్వు వంటి రంగు) చింతామణి భవనాన్ని, మణి ద్వీపాన్నే కాక బ్రహ్మాండాలనే వెలిగిస్తుంది. అందులో అవ్యాజకరుణ రసముత్పన్నమౌతుంది. ఈప్రకాశాని కాధారమైన శ్రీలలితా మహేశ్వరి మహాలావణ్య నిధి. కోటి కోటి రతుల సౌందర్యం ఆ తల్లి రూపానికి సాటిరాదు. ఆమె ముఖం రాకాచంద్రతిరస్కారి. లలిత లలితంగా యౌవనము నిండుకొన్నప్రాయము. అందుకే **"లలితాదేవి"** గావిరాజిల్లుతుంది.

రమణీయమైన నాల్గు హస్తాలతో పుండ్రేక్షు, పంచతన్మాత్రబాణాలు, పాశాంకుశాలను ధరించి ఉంది, అరుణారుణ వస్త్రాలను ధరించి ఉన్నది. శిరముపై అర్ధ చంద్ర భూషణముంది. ఫాలభాగము అర్ధచంద్రాకృతిగా ఉంది. శంకరులు ఈ భాగంలో అద్భుత వర్ణన చేసినారు. పై రెండు అర్ధచంద్రాలను వ్యత్యయంగా అతికితే పూర్ణచంద్రుడైతాడన్నారు. అహో! ఏమి వర్ణనావైదుష్యం!

**ఇక్కడ ఒక విషయం గమనించవలసి ఉంది. అమ్మవారి ఫాలతలం అర్ధచంద్రాకృతి కలదైనా, ఉపాసకునికి దర్శనంలో తల్లిఫాలతలంలో ఇంద్ర ధనుఃప్రభలు దర్శనమిస్తాయని లలితా సహస్రనామావళిలో చెప్పబడింది.**

శ్రీమాత మూడు కన్నులు కల్గి ఉన్నది. మధ్యనుండే మూడవకన్ను మాత్రం అర్ధనిమీలితమా అనిపిస్తుంది. కన్నులు వికసించిన తెల్ల తామరల వలెనున్నాయి. దివ్యానర్ఘ రత్నాలను తాపిన కిరీటం అందంగా అమరి ఉన్నది. ఆకిరీటంలో సన్నని కురువిందమణులు కూర్చబడినాయి. అక్కడక్కడ జాలరులు వ్రేలాడు తున్నాయి. కిరీటం క్రిందిభాగంలో చంద్రరేఖ అమరి ఉంది. అమ్మ అలికం (నుదురు) అష్టమీ చంద్రుణ్ణి విడంబిస్తుంది. నుదుట కస్తూరీ తిలకం తీర్చబడింది. గండు తుమ్మెదల బారుల బురిడించు శిరోజాలు సుగంధ ద్రవ్యమిళిత దివ్యతీర్థకవోష్ణజలాలు స్నానం చేయించి, దివ్యాగురు ధూపసంస్కారమొనరించి, పారిజాత సౌగంధిక [illegible] కాది పుష్పాలతో అలంక రించి, లక్షలకు మించిన పరిచారికాగుణములు చతుష్షష్టి (64) ఉపచారాలతో అమ్మవారినలంకరిస్తారు.

ఆభ్రూయుగ్మంలో ఇంద్రధనుస్సుల వంపులు పొంపిరి పోతున్నాయి. ఆతల్లి కపోలాలు పద్మరాగ మణి దర్పణాలు అమహారాజ్ఞి సర్వాన వద్య వంద్య. సర్వాభరణ భూషిత. శిరస్సుపైన అనర్ఘరత్నకిరీటకాంతులు. శిరోరత్నకాంతులు పైకెగసి మెరసిపోతున్నాయి. పాపటపైన మాణిక్యాలు పొదిగిన పతకము మెరుస్తూంది. తారాకాంతులను తలదన్నే అడ్డబాస(నాసాభరణం) ముఖాని కొక క్రొత్త శోభను తెస్తుంది. చెవుల కమ్మలు సూర్య చంద్ర మండలాలే! అచుబుక శ్రీ సౌందర్యానికి తగిన సాదృశ్యమింత వరకు భావుకులకు దొరక లేదే! ఆమె అధరము సహజ రక్తిమకుతోడు తాంబూలరక్తిమ గలిసి ద్విగుణీకృత రాగాన్ని పొందింది. సుపక్వదాడిమీ బీజాలవలె దంతాలున్నాయి. ఆమె చిరునగవులోని మాధుర్యం మధురస సాగరమే! ఆయమ్మ కంఠం త్రిరేఖాయుతమై శంఖంవలె ఉంది. ఆతల్లి పాలిండ్లు అందున్న వాత్సల్య రసక్షీరములను గజానన, షడాననులు త్రావి ఇప్పటికీ బ్రహ్మచారులై ఉన్నారని శ్రీశంకరుల వర్ణన. ఈవిధంగా అమ్మవారిని ప్రత్యంగ వర్ణనతో స్తుతించి భక్త లోకాన్ని ఉద్ధరించినారు శంకరులు.

ఆమె కంఠమున ధరించిన రత్నహారాలు ఎన్నెన్నోరకాలు. రత్నగ్రైవేయ భూషణంగా చింతాకు పతకమునందు వ్రేలాడే మంచి ముత్యాలహారాలు ఎంతో అందంగా ఉన్నాయి. ముత్యాలు వజ్రాలతో పొదిగిన మొలనూలు ఒడ్డాణము బిగించ బడినది. పాదకమలాలు, మణిమయనూపురాలను ధరించి, ఒప్పారు తున్నాయి.

అమృతంబు సుమముగా నాసినముక్త మనస్కుముబూని ధ్యానార్జితముగ్

ఆ తల్లి ఈసృష్టిలో ఉండే సౌందర్యాలకే సౌందర్యమై లావణ్యాలకే లావణ్యమై, శృంగారరససీమాంతరేఖగా శ్రీచక్రనగర సామ్రాజ్ఞి ఆభువనేశ్వరి, ఆరాజరాజేశ్వరి, ఆత్రిపురేశ్వరి ఆలలితా పరాభట్టారిక దర్శనం ప్రసాదిస్తూ ఉంది. అహో! మహాభాగ్యము! మహాభాగ్యము! అన్ని బ్రహ్మాండాలలోని శ్రీచక్ర శ్రీవిద్యోపాసకులు బ్రహ్మాదిదేవతలు, పరిచారికా గణములై సేవిస్తున్నారు. ఎడమవైపు మహాలక్ష్మి, కుడివైపు మహా సరస్వతి చామరగ్రాహిణులై వీస్తున్నారు. ఇచ్ఛా, జ్ఞాన, క్రియాశక్తులు నిత్యసన్నద్ధలై కొలుస్తున్నారు. పరశక్తులు లజ్జా, తుష్టి, పుష్టి, కీర్తి, కాంతి, క్షమా, దయా, బుద్ధి, మేధా, స్మృతి, లక్ష్మి, జయ, విజయ, అజిత, అపరాజిత, నిత్యా, విలాసిని, దోగ్ధ్రీ, అఘోరా, మంగళాసనా అనేవారు సేవాపరాయణలై నిల్చి ఉన్నారు. శంఖ, పద్మాది నవనిధుల సుధాసింధువులో చేరే రత్ననివహాలు, సప్తధాతు పరిప్లుతాలైన మహానదులన్నీ మూర్తిదాల్చి సేవిస్తున్నాయి. పరాభట్టారికనె ఈక్షణసృష్టబ్రహ్మాండకోటిర ఒక్కసారి చూపుసారిస్తేచాలు. బ్రహ్మాండాలు కోట్లు సృష్టించబడతాయి. ఒకక్రీగంటి చూపుతో కోటి మహా లక్ష్ములు కింకరులై నిలుస్తారు. ఆతల్లి కృపాకటాక్షాన్ని అర్థిస్తూ శంకరులు సౌందర్య లహరీ స్తోత్రంలో శరణు కోరుతున్నారు.

శ్లో॥ నెదృశాద్రాఘీయస్యా దరదళిత నీలోత్పలరుచా
దవీయాంసం దీనం స్నపయ కృపయా మామపిశివే!
అనేనాయం ధన్యోభవతి నచతేహానిరియతా
వనేవా హర్మ్యేవా సమకరనిపాతో హిమకరః॥

ఆ తల్లి బ్రహ్మవిష్ణ్వాదుల కిరీట రత్న నీరాజిత పదాంబుజయై, జగదానంద జననియై, జగద్రంజనకారియై, జగదాకర్షకారియై, జగత్కారణ రూపియై, సర్వ సౌభాగ్యసుందరియై సర్వమంత్రమయై, సర్వతంత్రమయై, సర్వ మంత్ర సౌభాగ్య సుందరియై, సర్వానందమయ చక్రస్వామినియైన పరమానంద రూపంతో ఉంది. ఉపాసకుడిక్కడ తదభిన్నమైన త్రిపుర సుందరీ దేవిని ప్రాప్తి, సిద్ధి, యోని, ముద్రాశక్తులతో కూడి దర్శించాల్సి ఉంటుంది. ధ్యానింపవలసి ఉంటుంది. ఈదర్శనాన్ని అనుభవంతో పొందగల్గిన ఉపాసకుడు శ్రీ విద్యాకాండలో పరిపూర్ణుడైనట్లే! శ్రీశంకరులు ఈమహాదర్శనము ఏకొద్దిమందికే పొంద సాధ్యమని, వారే ధన్యులని సెలవిచ్చినారుగదా!

## నిత్యాశక్తుల దర్శనవివరణ

శ్రీచక్ర శ్రీవిద్యోపాసనలో చివరిది నిత్యాశక్తుల ఉపాసన. షోడశదళచక్రంలో దీన్నిగురించి కొంతతెల్పబడింది. బిందుత్రికోణాల మధ్య ఈ నిత్యాశక్తులు దర్శనమిస్తాయి. బిందువునందు సమాహితం చేస్తే **"మహానిత్యాకళ"** కన్పిస్తుంది. ఆమెనుపాసించి స్వాగ్రకోణంనుండి ప్రారంభించి కుడివైపు ఆగ్నేయకోణంవరకు, తూర్పునఉండే అర్ధరేఖను అనుసరించి ఆగ్నేయకోణంవరకు, తూర్పునఉండే అర్ధరేఖను అనుసరించి ఆగ్నేయా దశాంతరంగా, ఉత్తరరేఖననుసరించి ఈశాన్యాది పశ్చిమాంతంగా- (అం-ఆం-ఇం-ఈం-ఉం-ఊం-ఋం-ౠం-ఌం-ౡం-ఏం-ఐం-ఓం-ఔం) అనే 15 పంచదశస్వరాలను (అచ్చులను) నిల్పుకొని, వాటిపైన అపసవ్యక్రమంతో కామేశ్వరాధినిత్యలను దర్శించి ఉపాసించాలి. బిందుమధ్యలో "అః" అనే ఆకారంలో షోడశియైనమహానిత్యను దర్శిస్తాడు. (స్వరములంటేఅచ్చులు).




పైన తెల్పిన క్రమంలో ప్రతిరోజూ అన్ని నిత్యలను ఉపాసించుకోవాలి. మరొకపద్ధతినుసరించి శుక్లపక్షములో అనులోమంగా అంటే1-15వరకు, కృష్ణపక్షంలో విలోమంగా 15-1 వరకు ఏరోజు ఏతిథి ఉంటుందో ఆతిథి నిత్యను ఉపాసించాలి.

సహస్రారచక్రంలోని చంద్రమండలం షోడశకళాపూర్ణము. ఇక్కడ ఉండే బిందువులోనే శివశక్త్యాత్మికమైన ధృవకళ ఉంది. ఈ ధృవకళనుండే 15 కళలు శుక్ల పాడ్యమినుండి పౌర్ణమివరకు పెరుగుతూ పోతాయి. ధృవకళతో కలిపి 16 కళలు. కృష్ణపక్షంలో క్రమంగా తగ్గుతూ అమావాస్యనాటికి ఏకళా ఉండదు. బాహ్యజగత్తులో ఇదిమనకు నిత్యానుభవమే! అట్లేమనశరీరంలో కూడా పంచదశకళల వృద్ధిక్షయాలు జరుగుతున్నాయని శృతులు, ఆగమప్రవక్తలు, ఋషులు స్పష్టపరచినారు.

జ్యోతిశాస్త్రంలో, చంద్రునిలోని 16 కళలు శుక్లకృష్ణపక్షాలలో వృద్ధిక్షయాలను పొందడానికికారణం, ఆకళలు సూర్యమండలంలో

చేరుతూ, మళ్ళీవచ్చి చంద్రమండలంలో చేర్తాయని, చెప్పబడింది. సూర్యచంద్రుల గతిభేదంలోనే రాత్రింబవళ్ళు ఏర్పడుతున్నాయని మనకు అనుభవంలో ఉన్నవిషయమే! అట్లే శరీరంలో కూడా అహో రాత్రులభేదం ఉందని తెలుసు కోవలసి ఉంది. ఈభేదముకూడా భ్రూమధ్యస్థ ఆజ్ఞాచక్రంవరకేనని, ఆపైన తురీయకూటములో సహస్రారంలో ఉండే చంద్రమండలం నిత్యషోడశ కళాపరిపూర్ణమని, అదిరాత్రిపగలు లేని ఒక జ్యోత్స్నాలోకమని చెప్పబడింది. ఉపాసకులు వారివారి పరిపాకాన్ని బట్టి ఆయాఅనుభవాలను పొందగలము.

శ్రీవిద్య శ్రీచక్రవిద్యలో ఈనిత్యాఉపాసన చాలా ముఖ్యమైనదిగదా! ఉపనిషత్తులల్లో ఎంతో విశేషంగా పేర్కొనబడింది. శుక్లపక్షతిధులు, ఆరాత్రుల పేర్లు, పవళ్ళపేర్లు, కృష్ణపక్షతిధులు ఆరాత్రుల పవళ్ళ పేర్లు చెప్తూ "సరఘా" అనేదాన్ని (తేనెటీగల తుట్టె) మన్మధుడు పంచ దశాక్షరాత్మకా విద్యాగా కనుగొన్నాడని చెప్పబడింది. దానినుండి మధుస్రావాలు పవళ్ళు వర్షిస్తున్నాయి. రాత్రికూడబెట్టుకుంటాయి. ఈవిధానాన్ని ఎవరైతే తెల్సు కుంటారో వారు కాలజ్ఞానులు వారే వాంఛితార్థ సిద్ధులౌతారు.

ఆతేనెటీగల తెట్టే(సరఘా)సుధాసింధువు బిందుస్థానం ఈనిత్యా పరివర్తనం గురించి ఇంకా సౌందర్యలహరివ్యాఖ్యలో శ్రీ లొల్లలక్ష్మీ ధర పండితులు, నిగమాగమరహస్యవేత్తలు, మహాప్రసిద్ధులైన సమయ పండితులు అనేక గ్రంధాలలో వివరించినారు. ఆ ఉపాసన విధానమీవిధంగా ఉంటుంది.

ఉపాసకుడు తనశరీరంలో ఎల్లప్పుడూ సంచరించే ఇడా పింగళా నాడులలోని ప్రాణశక్తులు సూర్యచంద్రులని తెలుసుకుంటాడు. ఇడానాడి సూర్యనాడి, పింగళనాడి చంద్రనాడి. ఈ సూర్యచంద్ర సంచారం అహోరాత్రులు జరుగుతూనే ఉంటుంది. చంద్రుడు పింగళనాడీ మార్గంలో సంచరిస్తూ, 72 వేల నాడుల మార్గాన్ని అమృతంతో తడుపుతుంటాడు. సూర్యుడు ఇడానాడీ మార్గం పై సంచరిస్తూ చంద్రనిచే తడపబడిన అమృతసేచన బిందువులను ఎండింపచేస్తాడు. వీరిద్దరి సంచారంలో తిధుల వృద్ధిక్షయాలు జరుగుతాయి. వీరిద్దరూ మూలాధారంచక్రంలో ఎప్పుడు కలుస్తారో, అదే అమావాస్యతిథిగా ఉంటుంది. సూర్యకిరణ సంపర్కముతో చంద్రునిలోని అమృతం అంతా ఎండిపోయినప్పుడు ఆధారకుండంలో కుండలినీ శక్తి నిద్రిస్తుంది. ఆకుండలినీ నిద్రావస్థే కృష్ణపక్షం.

యోగి సమాహిత చిత్తుడై, సూర్యచంద్రుల సంచారాన్ని, ప్రాణవాయు స్తంభనంతో నిలుపగల్గినప్పుడు వారు తమశక్తులనుకోల్పోతారు. అంటే అమృతసేచనం, అమృతశోషణం చేయలేరు. అంతేకాక వాయుప్రేరణ వల్ల పైనున్న స్వాధిష్ఠాన చక్రంలోని అగ్నివల్ల అమృత కుండం ఆరిపోగా, నిరాహారమై వేడిభరించలేక కుండలిని నిద్రలేచి పామువలె ఫూత్కార మొనరిస్తూ, పెకెగసివెళ్తూ గ్రంధిత్రయాన్ని సహస్ర్రదళ కమలమధ్యంలోని చంద్ర మండలాన్ని కొరికికాటు వేస్తుంది. ఆకాటు వల్ల చంద్రమండలం నుండి అమృతధారలు జారి ఆజ్ఞాచక్రంపైన ఉండే మరోచంద్రమండలంపై ప్రవహిస్తుంది. ఆజ్ఞాచక్ర చంద్రమండలంనుండి స్రవించే ధారలు శరీరాన్నంతటినీ తడుపుతాయి. అందువల్ల ఆజ్ఞాచక్రంపైనున్న [illegible]ని కళలు 15 పంచదశనిత్యలై (తిథులై) ఉన్నాయి. ఆ 15 వానికి క్రిందనున్న విశుద్ధ చక్రాన్ని ఆశ్రయించి, చుట్టూ పరిభ్రమిస్తున్నాయి.

సహస్రదళ కమలమధ్య భాగంలో ఉండే చంద్రమండలం బిందుస్థానం. అక్కడున్న కల - చిన్మయ, ఆనందరూప, ఆత్మ - అని పేర్కొనబడుతుంది. ఆకలే త్రిపుర సుందరీ దేవి. ఈప్రకారం శుక్లపక్షంలోనే కుండలినీ ప్రబోధం చేయడానికి యోగులకు సాధ్యమౌతుంది. కృష్ణపక్షములో శక్యం కాదనడం రహస్యం! శుక్లపక్ష తిథులన్నీ పూర్ణిమ (పౌర్ణమాసి) అనే తిథిలో అంతర్భూతాలౌతున్నాయి. అట్లే కృష్ణపక్ష తిథులన్నీ అమావాస్యలో అంతర్భూతాలౌతున్నాయి.

**ఆజ్ఞాచక్ర గత చంద్రునిలోని 15 కళలు సహస్రార చంద్రునిలోని ఒక ధృవకళ కలిసి మొత్తం 16 కళలౌతున్నాయి. విశుద్ధచక్రం ఆజ్ఞాచక్రం కింది ఉంది. దానిలోని 16 దళాల కణాలలో 15 కళలు నిత్యారూపతిథి దేవతలూ సహస్ర దళంలోని "పరాకళ" యే ఒక్క ప్రతిబింబ స్ఫురణమే! ఈపరాకళనే "సాదాఖ్యతత్త్వకళ"** అంటారు. 16 కళలను, నిత్యా(తిథి) దేవతలను విశుద్ధ చక్ర గత షోడశదళాలలో సమాహితం చేసి, దర్శనం పొందవలసి ఉంటుంది. ఈ షోడశ దళాలలో ప్రాగాది (తూర్పు మొదలు కొని) దర్శనం క్రమం.

**నిత్యాశక్తుల వివరణ:–**

**1) కామేశ్వరి :-** రక్తవర్ణ. రక్తవస్త్రధారి. రక్తగంధ, రక్తవర్ణభూషణ. పాశాంకుశ ధనుర్బాణ హస్త.

**2) భగవమాలిని** :- తెల్లనివర్ణం. తెల్లని వస్త్రాలను, సూర్య కాంత మాలను ధరించి ఉంది. పాశాంకుశ అక్షమాల పుస్తక హస్తయై విరాజిల్లు తుంది.

**3) నిత్యక్లిన్నా** :- తెల్లనిఛాయతో వరద, అభయ ముద్రలు దాల్చి ప్రకాశిస్తుంది.

**4) భేరుండా** :- ఎర్రని మేనిచాయతో, ఎర్రనివలువలు ధరించి, ఎర్రని సొమ్ములు ధరించి, ద్విభుజయై ముండ, వేదధారిణిగా ప్రకాశిస్తుంది.

**5) వహ్నివాసినీ** :- పచ్చనివర్ణంతో ద్విభుజయై దర్శనమిస్తుంది.

**6) వ్రజేశ్వరి** :-తెల్లనికాంతితో ద్విభుజయై అభయ, వరద, ముద్రలనుధరించి ఉంటుంది.

**7) శివదూతీ** :- ఈ శక్తి ఖడ్గ,చర్మ, వరద, అక్షమాలలు ధరించి చతుర్భుజయై ఉంటుంది.

**8) త్వరితా** :- నల్లని మేనిఛాయతో చతుర్భుజయై, ఖడ్గాదులను ధరించి ఉంటుంది.

**10) మహానిత్యా** :- ఈ దేవత అష్టకోణాలున్న సింహాసనంపై కూర్చుంది. అష్టసిద్ధులనిస్తుంది.

**11) నీలపతాకా** :- పాశాంకుశధారిణి. ఈమె ఉండే ప్రదేశంపై నీలపతాకం ఉంటుంది.

**12) విజయా** :- భయంకరరూపంతో, ఉగ్రాస్త్రధారిణియై ఉంటుంది.

**13) సర్వమంగళా** :- రక్తవర్ణ శరీర. రెండుచేతులలో పద్మాలను ధరించి కన్పిస్తుంది.

**14) జ్వాలమాలినీ** :- తెల్లని రంగులో ఉండి, మూడుకన్నులతో ప్రకాశిస్తుంది.

**15) విచిత్రా** :- శ్వేతవర్ణ. తెల్లని తామరలను ధరించి చిత్రంగా తిప్పుతుంటుంది. అనేక దివ్యాభరణ శోభిత.

**16) పరాకళ** :- ప్రతిబింబస్ఫురణంగా నిల్చి ఉంటుంది. ఆకృతి గోచరముకాదు. త్రిపురసుందరిగా ధ్యానించాలి.

*గమనిక:- విశుద్ధచక్రంలోని 16 కోణాలలో 16 స్వరాలు (అం మొదలైనవి) దర్శించి, వాటిపై 16 నిత్యలనుపాసించాలి. వీరు కాలస్వరూపిణులు, శాశ్వతాధికారిణులు. అందుకే నిత్యమైనారు. ఉపాసకుడు శుక్ల పక్షపాడ్యమినుండి క్రమంగా పూర్ణిమవరకు ఏతిథికి ఏదేవి*

అధికారిణో, ఆతిథికి ఆదేవిని ఉపాసించాలి. కృష్ణ పక్షంలో విలోమంగా అంటే వెనుక నుండి (విచిత్రా నుండి కామేశ్వరి వరకు) ఆయాతిథులలో ఆయానిత్యలను ఉపాసించాలి ఈవిధంగా నిత్యాధ్యానం చేసే సాధకుడు సర్వ సౌభాగ్యాలను పొందుతాడు. ఈనిత్యా పూజవిధానం కాలదుష్ప్రభావాన్ని సాధకునిపై ప్రసరింపనీయదు. తగిన ఫలాన్నిచ్చి కాలాన్ని అనుకూలంగా మార్చి అభీష్టాలను అనుగ్రహిస్తుంది.

## నిత్యాచక్రవము : 1. శుక్లపక్షము

| తిథి | నిత్యా నామం | దిన నామం | రాత్రి నామం |
|---|---|---|---|
| 1 | కామేశ్వరి | సంజ్ఞానం | దర్శ |
| 2 | భగమాలిని | విజ్ఞానం | ద్రష్ట |
| 3 | నిత్యక్లిన్న | ప్రజ్ఞానం | దర్శిత |
| 4 | భేరుండ | జానత్ | విశ్వరూప |
| 5 | వహ్నివాసిన | అభిజానత్ | సుదర్శన |
| 6 | వజ్రేశ్వరి | సంకల్పమానం | అప్యాయమాన |
| 7 | శివదూతి | ప్రకల్పమానం | ఆప్యాయమాన |
| 8 | త్వరిత | ఉపకల్పమానం | ఆప్యాయ |
| 9 | కులసుందరి | ఉపక్లప్తం | సూనృత |
| 10 | మహానిత్యా | క్లప్తం | ఇర |
| 11 | నీలపతాక | శ్రేయం | ఆపూర్యమాణ |
| 12 | విజయ | వశీయం | పూర్యమాణ |
| 13 | సర్వమంగళి | ఆయత్ | పూరయంతి |
| 14 | జ్వాలామాలినీ | సంభూతం | పూర్ణ |
| 15 | చిత్రా | భూతం | పౌర్ణమాస |

## 2. కృష్ణ పక్షము

| తిథి | నిత్యా నామం | దిన నామం | రాత్రి నామం |
|---|---|---|---|
| 1 | చిత్రా | ప్రస్తుతం | సుత |
| 2 | జ్వాలమాలిని | విష్టుతం | సుస్వతి |
| 3 | సర్వమంగళ | సంస్తుతం | ప్రస్తుత |
| 4 | విజయ | కళ్యాణం | సూయమాన |
| 5 | నీలపతాక | విశ్వరూపం | అభిసూయమాన |
| 6 | నిత్య | శుక్రం | ప్రీతి |
| 7 | కులసుందరి | అమృతం | ప్రప |
| 8 | త్వరిత | తేజస్వి | సంప |
| 9 | శివదూతి | తేజం | తృప్తి |

| | | | |
|---|---|---|---|
| 10 | వజ్రేశ్వరి | సమిద్ధం | తర్పయంతి |
| 11 | వహ్నివాసిని | అరుణం | కాంత |
| 12 | భేరుండ | భానుమత | కామ్య |
| 13 | నిత్యక్లిన్న | మరీచిమత్ | కామజాత |
| 14 | భగమాలిని | అభిక్షప్త | ఆయుష్మతి |
| 15 | కామేశ్వరి | తపస్విత్ | కామదుఘ. |



# అధ్యాయము 7

## పంచాశద్వర్ణముల ఉత్పత్తి స్థితులు – పరిచయం

నామారూపములు అవిభాజ్యములు. శబ్దార్థములవంటివి. సత్య అసత్యసమ్మేళనము నామరూపాత్మక జగత్తు. ఈనామరూపాలు ఒకేసారి పరాశక్తి నుండి ఉద్భవించినాయి. శరీరవృక్షపటంలో అవ్యక్త త్రికోణాకారంగా పరాశక్తి, ప్రకాశబిందువు నుండి, శివ, శక్తుల సమ్మేళన శక్తిగా పరిణమించింది. పరమాత్మ ప్రకాశబిందువున్నది. ఈరెంటి మిశ్రమమే అ-హం. ఈసమ్మేళనమే త్రికోణరూపశక్తి. కామకల పరాశక్తి ఈత్రికోణరూపమునుండే నామారూపాత్మక జగత్తు ఒక్కసారిగా ఉద్భవించింది.

బిందువు "పరా" స్థానము. 1) పరా 2) పశ్యంతి 3) మధ్యమ 4) వైఖరి. అనే నాల్గు అవస్థలు పొందుతుంది శబ్దము. చివరికి బైటకు విన్పించేదే వైఖరి. ఈ నాల్గు శక్తులే 50 అక్షరాలకు ఆధారం. వాటి నుండే శబ్దాలు, వేదాలు, ఉపనిషత్తులు మున్నగు వాఙ్మయమంతా సృష్టించబడింది.

ఒక అక్షరాన్ని ఉచ్చరించాలంటే సహస్రారమధ్యలో ఉన్నసాక్షిస్థానంలో మనం తెలుసుకోలేని స్ఫురణ కల్గుతుంది. ఆఇచ్ఛ పరావాడి ద్వారా మూలాధారాన్ని చేరి (మూలాధారం పశ్యంతి) అక్కడినుండి స్వాధిష్ఠాన మణిపూరాలను దాటి అనాహతాన్ని చేరి, (అనాహతం మధ్యమ) అక్కడి నుండి కంఠంలో ఉండే విశుద్ధ కమలాన్ని పొందినపుడు వైఖరిగా మారి మనకు విన్పిస్తుంది. పరా, పశ్యంతి మధ్యమస్థానాలు తేజోమయాలు. వాటిని మనం తెలుసుకోలేము. పరావాగ్దేవత (వాక్కు) వైఖరీ రూపమయ్యేంతవరకు జరిగే ప్రక్రియా వేగాన్ని అంచనావేయలేము. ఊహించలేనంతటి వేగంగా ఈప్రక్రియ జరుగుతుంది. దాన్ని యోగీశ్వరులు మాత్రమే తెలుసుకోగలరు. మన

సంకల్పాలు ఆలోచనలన్నీ శబ్ద రూపాలే! అవి వైఖరీ రూపాన్ని పొందడం లేదు. మధ్యమరూపంలోనే ఉండి అనాహత చక్రంలోనే నిలుస్తున్నాయి. త్రికోణచక్రము పశ్యంతి, మధ్యమ, శక్తులకు మూలకారణమై ఉంది. త్రికోణ చక్రమందున్న మూడురేఖలే అకారాది మాతృకలకు తేజోరూపాలుగా అవ్యక్తంగా ఉన్నాయి. త్రికోణంలోని మూడుకోణాలు ఐం-క్లీం-సౌః అనే బీజాల స్వరూపమై ఉన్నాయి. ఈ బీజములు త్రివర్ణ తేజోవర్ణాలు. ఈపరాది మాతృకలే నవచక్రరూప శ్రీ చక్రాకారాన్ని పొందుతున్నాయి. ఏబిందుతత్త్వ రూప పరాశక్తి తేజస్సువల్ల త్రికోణచక్రముత్పన్నమయిందో ఆతేజస్సువల్లనే శ్రీచక్ర నిర్మాణం జరిగింది.

శ్రీచక్రంలో అధోముఖంగా 5 త్రికోణ చక్రాలు... ఊర్ధ్వముఖంగా నాల్గు యోనిచక్రాలున్నాయి. 5 అధోముఖ యోనిచక్రాలకు అధిదేవతలుగా 1) వామా 2) జ్యేష్ఠ 3) రౌద్రీ 4) అంబికా 5) పశ్యంతి అనే దేవతలున్నారు. ఊర్ధ్వముఖయోనిచక్రాలకు 1) ఇఛ్ఛా 2) జ్ఞాన 3) క్రియా 4) శాంతా అనే శక్తులు ఆదిదేవతలుగానున్నాయి. ఈకోణాలందున్న నవ శక్తులు అ-హం- అనే ఆత్మమంత్రరూప అక్షరద్వయం కలిసి 11 శక్తులు వీటికి పశ్యంతి కారణశక్తిదీన్ని అవ్యక్తం అని కూడా పిలుస్తారు. అవ్యక్తమంటే అత్యంత వ్యక్తం అని అర్థం. వర్ణ విభజన లేకుండా ఉంది. అని చెప్పుకోవచ్చు.

గోవు ప్రసవించే స్థితిలో దూడ తలమాత్రమే బయటకు వచ్చిన స్థితి అవ్యక్తస్థితి అది మగా? ఆడా? అని తెలియని స్థితి. అదే అవ్యక్తస్థితి. దానితో పశ్యంతిని పోల్చినారు.

**నవశక్తుల ప్రభావం**

*1) వామా : తనలోని ప్రపంచాన్ని వెడలగ్రక్కేది.*

*2) జేష్ఠ : సర్వమంగళకారిణి.*

*3) రౌద్రీ : సర్వరోగ విద్రావిణి. సమస్త ఇష్టఫలదాయిని.*

*4) అంబికా: సర్వాతిశాయి అయిన స్వాత్మ స్ఫురణను కల్గించే శక్తి.*

*5) ఇఛ్ఛా : కోరుకునే శక్తి.*

*6) జ్ఞానా : తెలుసుకునే శక్తి.*

*7) క్రియా : పని చేయగలిగే శక్తి.*

*8) పశ్యంతి (వైఖరి): అవ్యక్తశక్తి.*

*9) శాంతా : (చిద్రూపా) స్వప్రాశక శక్తి.*

*10) పరాశక్తి.* *11) సర్వసమష్టికామకళ.*

ఈ 11 శక్తులకు కారణశక్తి త్రికోణచక్రము. పరాబిందు తేజం త్రికోణశక్తిగా దీనిలో చేరి జగత్సృష్టికి, శ్రీ చక్రోత్పత్తికి కారణమవుతుంది.

వైఖరీరూప శబ్దబ్రహ్మోత్పత్తికి బిందురూప "పరా" ప్రథమావస్థ. బిందు వికసనం వల్ల త్రికోణచక్రాకృతి పొందినప్పుడే "పశ్యంతి" ద్వితీయావస్థ. ఆనాదమునుండి నవనాదాలు ఉత్పన్నమవుతున్నాయి. వీటికి వామాది నవశక్తులకు పశ్యంతి త్రికోణ చక్రం కారణం.

**మధ్యమాశక్తి స్థూలసూక్ష్మ భేదములతో రెండు రకాలు. నవ వర్గాల స్థితిలో నవనాదాలస్థితిలో సూక్ష్మమధ్యమ.**

*గమనిక :- నవనాదాలను గురించి షట్చక్రవిద్యలలో అనాహత చక్ర ప్రకరణంలో చెప్పబడింది.*

ఈనాదాలను ఉపాసకుడు అభ్యాసపరిపాకంతో వింటూక్రమంగా పరానాదంలో లయింపజేస్తాడు. దీన్నే మనోలయసాధన అంటారు. నాద బ్రహ్మోపాసన అన్నా ఇదే. త్యాగరాజు ప్రణవోపాసకుడు. అందుకే ఆయన "నాదోపాసన చేసి శంకరనారాయణ విధులు వెలిసిరి" అని పలికినారు. మాండూక్యోపనిషత్తు, గౌడపాదకారికలు ఈనాదోపాసనను సవివరంగా ఉపదేశించినాయి. అ-ఉ-మ-మ కలిసి ప్రణవం (ఓం)గా ఏర్పడుతుంది. అదే సర్వజగత్తుకు మూలము.

స్థూలమధ్యమ :- మధ్యమావైఖరుల మధ్యభాగంనుండి నవవర్గాలు ఆకృతి పొందినాయి. అవి 1) అ 2) క 3) చ 4) ట 5) త 6) ప 7) య 8) శ 9) క్ష.

అకారాది స్వరాలు (అచ్చులు) 16. 8 హ్రస్వము, 8 దీర్ఘములు. (బిందువిసర్గలతో కలిసి) వైఖరి వాక్కు యొక్క చివరిస్థితి. ఇది పంచాశత (50) వర్ణాలతో స్పష్టంగా వినబడుతుంది. స్థూలమధ్యమ స్థితిలోనే లిపి కల్పించబడుతుంది. వాక్కు అసలు స్వరూపం తేజోమయమే.

**తేజోమయీవాక్ అని ఉపషద్వాక్యము**

కారణ కార్యములకు అభేదము కాబట్టి పంచాశత్ వర్ణాలు (50) మాతృకలే. పరాశక్తి రూపములే. ఆబిందురూప పరాతేజస్సు త్రికోణంగా త్రికోణ తేజః పుంజ కిరణాలు నాదయుత వర్ణాలుగా చతుర్దశార పర్యంతం ప్రసరించినాయి.

## వసుకోణం (అష్టకోణం)

శ-ష-స-ప-ఫ-బ-భ-మ-లుగా

అంతర్దశారము 10- త.థ.ద.ధ.న.ట.ఠ.డ.ఢ.ణ.-లుగా

బహిర్దశారము 10- చ.ఛ.జ.ఝ.ఞ.క.ఖ.గ.ఘ.-లుగా

చతుర్దశారము 14- అ.ఆ.ఇ.ఈ.ఉ.ఊ.ఋ.ౠ.ఌ.ౡ.ఎ.ఏ. ఐ.ఒ.ఓ.ఔ.-లుగా

వర్ణములు(బీజములు-అక్షరములు)మాతృకలు తేజో (శబ్ద) యుతంగా ఉన్నాయి. ఇంక 8 అక్షరములు మిగిలినవి. య.ర.ల.వ.ళ.క్ష ం-ః (బిందువిసర్గలు). ఇవి ధ్వనితేజాలు పైన తెలుపబడిన కోణాలలో ఆక్రింది భాగాలలో అంతర్భూతం చెంది ఉన్నాయి.

యవర్ణం - వాయురూపం. రవర్ణం - తేజోరూపం.

లవర్ణం - భూపురచక్రం. వవర్ణం - అమృత రూపంగా షోడశారమందు చేరి ఉంది. ళ-ల వర్ణాలకు భేదం లేదు. క్షవర్ణం - కషల సమిష్టి. శ్రీచక్ర ఊర్ధ్వబిందురూపము యొక్క వికసనమే (ం,ః) త్రికోణమందున్నాయి. ఈవిధంగా పైన వివరించిన 42 వర్ణములు ఈ 8 వర్ణాలు కలిసి 50 వర్ణమాతృకలు (పంచాశద్వర్ణమాతృకలు).

దేవీ సహస్రనామావళిలో మాతృకారూపిణ్యైనమః

అని పేర్కొనబడింది. ఈమాతృకలే అష్టకోణంలో అ-క-చ-ట-త-ప-య-శ వర్ణాలు షోడశారంలో (అనుండి అః వరకు) 16 అచ్చులు పశ్యంతి మధ్యమ వైఖరి శక్తులే పై రెండు చక్రాలలో తేజోమయ మయిన అక్షర రూపిణులుగా ఉన్నారు. షోడశదళచక్రం పైన వృత్తత్రయం, పరాబిందు తేజో రూపాలయిన సూర్య చంద్రాగ్నులు ఉన్నారు. భూపుర చక్రంలో ఉన్న చతురస్ర రేఖలలో పశ్యంతి మధ్యమావైఖరులు విశ్రమిస్తున్నాయి. ఈవిధంగా నాదాత్మక జగత్తుకు ముఖ్యకారణమయిన వర్ణములు నాదయుతో తేజోరూపంగానై నవచక్ర విలసిత శ్రీచక్ర రూపిణిగా పరాశక్తి నిలిచింది. వర్ణ మాతృకలు ఏకాక్షరి, ద్వ్యక్షరి, త్ర్యక్షరి, పంచాక్షరి, షడక్షరి, సప్తాక్షరి, అష్టాక్షరి, నవాక్షరి, పంచదశాక్షరి, షోడశాక్షరిగా మంత్రదేవతలై ఉపాసకుల అభీష్టాలను తీర్చి అనుగ్రహిస్తున్నారు.

విభూతి యోగంలో శ్రీకృష్ణుడు **ప్రణవస్సర్వవేదేషు** అని ప్రకటించి నాడు. మాండూక్యాది ఉపనిషత్తులు కూడా సర్వసృష్టికి ప్రణవమే

మూలమని ఉపదేశిస్తున్నాయి. మంత్రోచ్చారణ, జపము వంటి విధానాలలోని మూలభూతమయిన తత్త్వరహస్యాన్ని ఈసందర్భంలో వివరించుకోవడం అవసరం.

## అక్షరశక్తి (మంత్రప్రభావం)

మహాభారతం ఆది పర్వంలో మృత సంజీవినీ విద్య వృత్తాంతంలో శుక్రాచార్యుడు దేవగురు పుత్రుడయిన కచునికి మృత సంజీవినీవిద్యను నేర్పించే సంధర్భంలో చెప్పబడిన పద్యం ఉదహరించడం అవసరం.

రాక్షసుల కుటిలోపాయానికి , సురాపానంతో పాటు తన కడుపులో చేరిన కచున్ని బ్రతికించి అక్కడే సంజీవినీ విద్యనుపదేశించినాడు. ఆవిద్యతో తన పొట్టచీల్చుకుని వచ్చి మళ్ళీ తనను బతికించమని కచునికి చెప్పినాడు. కచుడట్లే చేసినాడు. ఆ సందర్భములో శుక్రుడు పునరుజ్జీవితుడైనాడని చెప్తున్నాయ

అతనిచేత సంజీవితుడై వెలిఁగె
దనుజమంత్రి ఉచ్చారణ దక్షుచేత
అభిహితంబగు శబ్దంబునట్లు పోలె.

**తాత్పర్యము** :- ఉచ్చారణలో సమర్థుడైన వానిచే శబ్దమేవిధంగా సంజీవితమవుతుందో ఆవిధంగా శుక్రుడు సంజీవితుడైనాడు. దీన్నిబట్టి సమర్థమైన శబ్దోచ్చారణ ఎంత ప్రభావమంతమయిందో అర్థమవుతుంది. ఉచ్చారణలో సమర్థత ఉన్నప్పుడే ఆశబ్దానికి జీవం ఉంటుంది. లేకుంటే ఆశబ్దం జీవశక్తి లేని శవప్రాయమే. శబ్దాన్ని సమర్థవంతంగా ఉచ్చరించడం అంటే ఏమి? అని ఆలోచిస్తే వేదము ఉచ్చరించడంలో స్వరం ఉంటుంది. ఇది 3 రకాలు అ) ఉదాత్తము ఆ) అనుదాత్తము ఇ) స్వరితము. ఈమూడు రకాలను నిర్దుష్టంగా ఉచ్చరించడం వేదోచ్చారణలోని సమర్థత. అట్లే, బీజాక్షరాలు మంత్రాలు ఉచ్చరించడంలో కూడా ఈనిర్దుష్టత అత్యవసరం. అపుడే అది ఫలితం ఇస్తుంది. పర, పశ్యంతి, మధ్యమ స్థానాలను దాటి శబ్దం వైఖరీరూపాన్ని పొందే టప్పటికి కంఠంలోని స్వర యంత్రంలోని ఏయే స్థానాలను ఏయే విధంగా చేరి బైటికి రావలెనో తెలుసుకొని ఉచ్చరించి నపుడే అవి తేజస్సుతో ప్రకాశిస్తాయి. న్యాసంలోగాని జపంలో గాని ఉపాసకునికి అభ్యుదయం కల్గించేది మంత్రోచ్చారణే. ఈక్రమానికి వ్యతిరిక్తమయితే ఫలం రాకపోగా హానికల్గుతుంది. అందుకేఉచ్చారణవిధానం నిర్దుష్టంగా పరంపరగా అనుశ్రుతంగా

ఉన్న కొందరికి మాత్రమే వేదోచ్చారణకు మంత్ర జపానికి అధికారం ఉంటుందని శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. కేవలం వర్ణ పక్షపాతంతో ఆశాస్త్రాలు రాయబడినాయని విమర్శించడం కేవలం అవివేకం. వేదోచ్చారణను అభ్యసింప జేసేందుకే శిక్ష, వ్యాకరణం, ఛందం, నిరుక్తం మొదలయిన వేదాంగా లేర్పడినాయి.

## బీజాక్షరాలు

ప్రతి బీజాక్షరానికి బిందు ( ం ) లేదా ( మ్ ) పొల్లుతో కూడిన మకారము ఎందుకు చేర్చబడుతుందో ఆలోచిస్తే ఈవిధంగా తీర్మానించవచ్చు. మకారంలో ఉండే అకారాన్ని తీసివేసి అర్ధమాత్రకాలవాచ్యమయిన బిందువును చేరి ఉన్నపుడు బిందుస్థానంలో ఉండే శివశక్తి సముద్దీపితం చేయబడుతుంది. అంతేకాకుండా వసుకోణంలో "మ" వర్ణతేజస్సు ఉంది. అది పైనున్న త్రికోణరూపపశ్యంతి శక్తికి సన్నిహితమై ఉండడం వల్ల బిందురూప పరాశక్తికి చేరుస్తుంది. అనగా కారణాన్ని చేరి ఆశక్తి సాధకునికి అభీష్టాలను తీర్చేందుకు ప్రసన్నురాలవుతుంది. అటువంటి నిగుఢమయిన తత్త్వయోగశాస్త్ర రహస్యాలను మహర్షులు గాఢ సమాధిస్థితిలో చూచి, విని మంత్ర ద్రష్టలన్న తున్నారు. వాటిని యథాశాస్త్రంగా ఉపాసించినపుడే అభ్యాసకుడు అభ్యుదయ పూర్వక నిశ్శ్రేయస్సును పొందగలడు.

మంత్రోచ్చారణలో సమర్థతతోపాటు ఆబీజంలో ఇమిడి ఉన్న అర్థాన్ని తెలుసుకుని జపం చేసినప్పుడే మంత్రప్రభావం ప్రసరిస్తుంది. కేవలం అర్థం చేసుకోవడమే కాకుండా ఆఅర్థాన్ని భావంలో నిల్పుకొని, సక్రమోచ్చారణతో ఏకాగ్రంగా జపం చేయడం చాలా అవసరం, బీజాక్షరంలో ఎంతో శక్తి వంతమయిన దేవతా స్వరూపం ఇమిడి ఉంటుంది. అసలు బీజమంటే విత్తనం అని అర్థం. ఆవిత్తనంలో మహావృక్షం సూక్ష్మరూపంలో ఉన్నట్లే బీజాక్షరంలో మహాద్భుత శక్తి సూక్ష్మరూపంలో ఉంటుంది.

బీజాక్షరముల జపం దాదాపు 14,15,16 అక్షరములుగల మంత్రముల వరకు ఉంటుంది. ఆపైన సంఖ్యతోనున్న మంత్రములు మాలామంత్రములని చెప్పబడినది. అక్షరసంఖ్య తగ్గే కొద్దీ ఏకాగ్రత ఎక్కువవుతుంది. మనస్సును సూక్ష్మప్రదేశంపై నిల్పగలం. ఒకే బీజాక్షరంపైనే మనస్సును ఏకాగ్రం చేసేందుకు, ఎక్కువ అక్షరాలమీద నిల్పేందుకు మధ్యగల తేడా సువిదితమే. ఉచ్చారణలో సమర్థతపొందడానికి నియమనిష్ఠలతో కూడిన జీవితం చాలా

అవసరం. సంధ్యావందనం అగ్నికార్యం మొదలయిన వాటిని సకాలానికి యథాశాస్త్రంగా అనుష్టించే వ్యక్తి యొక్క ఉచ్ఛారణ మాత్రమే ఫలాన్నిస్తుంది. శ్రీభాస్కరరాయలు అర్థాన్ని తెలుసుకుని భావించక చేసే జపపారాయణాదులు సల్పేవాణ్ణి గంధం చెక్కలను మోసే గాడిదగా అభివర్ణించినాడు.

**"తజ్జపస్తదర్థ భావనం"** - పతంజలి యోగ సూత్రం

జపమంటే ఆశబ్దార్థాన్ని భావించడమే అని అర్థం.

**"అమంత్ర్యాక్షరోనాస్తి నాస్తి మూలమనౌషదం**
**అయోగ్యః పురుషోనాస్తి యోజకః స్తత్ర దుర్లభః."**

**తాత్పర్యము :-** మంత్రంకాని అక్షరంలేదు. ఓషధికాని చెట్టు వేరు లేదు. యోగ్యుడుకాని మనిషిలేడు. కాని వాటి వాటిని సక్రమంగా జతపరిచేవాడే దుర్లభం.

అంటే దేనిని ఏవిధంగా సాధిస్తే దేనికి పనికి వస్తుందో, ఎవనికి ఏవిధంగా శిక్షణ ఇవ్వాలో తెలిసినవాడు. (గురువు, శాస్త్రజ్ఞుడు) మాత్రం సాధారణంగా దొరకడు.

ఇటువంటి ఉపదేశాలన్నీ ప్రకృతి అంతా మహాశక్తి వంతమని, దాన్ని గుర్తించడమే కష్టమని, చాటుతున్నాయి కదా! ఉపాసకుడు బృహజ్జ్యోతిర్విద్య వరకు ఉత్తీర్ణుడై సమాహితం చేసిన ఏవస్తువునైనా, ఏప్రదేశాన్నైనా, తేజోరూపంగా దర్శనం పొందినప్పుడే ఈశ్రీచక్ర దర్శనంలోని అద్భుత తేజఃప్రపంచాన్ని దర్శించగలడు. ఒకవేళ వేరే పద్ధతిలో ఆఅద్భుత తేజః ప్రపంచాన్ని చూడగల్గిన మహానుభావులుండినచో వారికి మా హృదయ పూర్వక ప్రణామాలు అర్పిస్తాము. అట్టి అనుభవాన్ని పొందేందుకు క్రమమయిన ఆధ్యాత్మదర్శన విద్యాప్రణాళికను ఆశ్రయించడం సుఖకరమని తెల్పుతున్నాం.

అక్షరమాతృకలు వర్ణరూపిణులుగా దర్శనమిస్తారు. అందుకే అక్షరాలకు వర్ణాలని పేరు. ఈ అక్షరమాతృకల వర్ణము ఆతేజస్సువ్యాపించిన మండల విస్తీర్ణం ఈక్రింది విధంగా ఉంటుంది.

| అక్షరమాతృకలు | వర్ణము | మండల విస్తీర్ణము |
|---|---|---|
| I) అచ్చులు | ధూమ్రవర్ణము | |
| (అ నుండి అః వరకు) | (బూడిద రంగు) | |
| 1) అ కారము | " | 80 లక్షల యోజనాలు |
| 2) ఆ కారము | " | 160 " |
| 3) ఇ కారము | " | 90 " |
| 4) ఈ కారము | " | 180 " |
| 5) ఉ కారము | " | 1 కోటి యోజనాలు |
| 6) ఊ కారము | " | 2 " |
| 7) ఋ కారము | " | 50 లక్షల యోజనాలు |
| 8) ౠ కారము | " | 1 కోటి యోజనాలు |
| 9) ఌ కారము | " | 1 " |
| 10) ౡకారము | " | 1 " |
| 11) ఏ కారము | " | 150 లక్షల యోజనాలు |
| 12) ఐ కారము | " | 150 లక్షల యోజనాలు |
| 13) ఓ కారము | " | 150 " |
| 14) ఔ కారము | " | 150 " |
| 15) బిందు (ం) | " | 160 " |
| 16) విసర్గ (ః) | " | 160 " |
| ii) క నుండి ఠ వరకు | సింధూరవర్ణము | 40 లక్షల యోజనాలు |
| III) డ నుండి ఫ వరకు | శ్వేత వర్ణము | 40 " |
| IV) బ నుండి ల వరకు | కెంపువర్ణము | 40 " |
| V) వ నుండి స వరకు | బంగారు వర్ణము | 40 " |
| VI) హ నుండి క్ష వరకు | విద్యుత్కాంతి | 40 " |

*Note :- ళ లకారంలో అంతర్భాగము.*

## వర్ణమాతృకల ఆకారవిశేషాలు.

**I) అ నుండి అః వరకు (స్వరములు).**

దేవతారూపాలను దాల్చి ఉంటాయి. 8 చేతులలో పాశ, అంకుశ, వరద, అభయ, జ్ఞానముద్రలు పుస్తక అక్షమాల కమండలములను ధరించి ఉంటారు.

**II) క నుండి మ వరకు (స్పర్శములు)** :- నాలుగు చేతులతో పాశ, అంకుశ, అక్షమాల కమండలం ధరించి దర్శనమిస్తారు.

III) య, వ, రలు (అంతస్థములు).

నాలుగు చేతులలో పాశ, అంకుశ, అభయ ముద్రలను ధరించి దర్శనమిస్తారు.

IV) శ, ష, స, హ (ఊష్మములు).

పాశ, అంకుశ, అక్షమాల వరద హస్తులై దర్శనమిస్తారు.

V) హ, ళ.

నాలుగు చేతులలో పాశ, అంకుశ, ఇక్షుశరాసన పుష్పబాణాలు ధరించి దర్శనమిస్తారు.

ఉపాసకునికి ఆరంగులో ఆ విస్తీర్ణమండలం దర్శనమైతూ, ఆమండల మధ్యంలో ఆయా మాతృకాదేవతా శక్తులు దర్శనమిస్తారు.

VI) మాతృకావర్ణము.

పంచాశత్ వర్ణమాతృకలు (50) 8 వర్గాలుగా ఉన్నారు.

అవర్గము (16). కవర్గము (5). చవర్గము (5). టవర్గము (5). తవర్గము (5). పవర్గము (5). యవర్గము (4). శవర్గము (5).

వసుకోణంలోని వసిన్యాది 8 వాగ్దేవతలు 8 కోణాల్లో ఉంటారు. వీరి తేజస్సులు ఒకటి గ్రంధాకర్షిణి, రెండు రసాకర్షిణి, మూడు రూపాకర్షిణి, నాలుగు స్పర్శాకర్షిణి. అట్లే 12 మంది యోగినులు 1) విద్యా 2) వేచికా 3) మోచికా 4) అమృతా 5) దీపికా 6) జ్ఞాన 7) ఆపాయనీ 8) వాపినీ 9) మేధా 10) వ్యోమరూపా 11) సిద్ధిరూపా 12) లక్ష్మీ.

వసిన్యాది వాగ్దేవతా తేజస్సులు అకారాది స్వరాలలో చేరి 8 వర్గాలైన వర్ణమాతృకాతాత్మకములయినవి. ఆవర్ణమాతృకలు పైన తెలిపిన 12 యోగినీశక్తులు ద్వారాలై ఉన్ననాలుగు ఆకర్షిణీశక్తులు కలిసి 20 కళలో అంతర్దశార బహిఃర్దశార చక్రంలో నిల్చి ఉన్నాయి. ఈవిధంగా 50 వర్ణమాతృకలు శ్రీచక్రంలోని 8 చక్రాలలో తేజోరూపంగా ప్రసరించి వ్యాపించి ఉన్నాయి.

పరమాతృకా దేవీశక్తి ప్రసన్నురాలిని చేసుకొన్న సాధకుడు మహా పండితుడు, మహాకవి అవుతాడు. ఉపాసకుడు అన్ని చక్రాలను సమాహిత శక్తితో సులభంగా చూసేస్థితిలో వింశతి కళాశక్తుల దర్శనం చేసినచో, వారు శుద్ధస్ఫటిక వర్ణవిరాజితలై కన్పిస్తారు. ఉపాసనలో కృతార్థుడైన వాని ప్రభావాన్ని, వానిపై పరాశక్తి చూపే కృపను వర్ణిస్తూ శ్రీ శంకర భగవత్పాదులు సౌందర్యలహరిలో ఈవిధంగా వర్ణిస్తాడు.

శ్లో॥ సవిత్రీ భిర్వాచాం శశిమణి శిలాభంగ రుచిభిః
వశిన్యాద్యాభిస్త్వాం సహజనని సంచింతయతియః।
సకర్తాకావ్యానాం మహతాం భంగి రుచిభిః
వచోభిర్వాగ్దేవీ-వదన కమలా మోదమధురైః॥

తాత్పర్యము :- అమ్మా! వాక్కులను సృజించేవారు చంద్రకాంతమణుల వలె స్వేచ్ఛా శరీరాలైన వసిని మొదలైన వాగ్దేవతాశక్తులతో కూడిన నిన్ను ఎవరు ధ్యానిస్తారో ఆసాధకుడు కాళిదాసాది కవిత్వరచనవలె రుచిమంతములయిన సరస్వతీదేవి ముఖవిమల పరిమళం వెదజల్లే వాగ్గుంభనలచే రసవ త్తర కావ్యాలను రచించేందుకు సమర్థుడయిన కవి శ్రేష్ఠుడవుతున్నాడు.

ఈమాతృకాత్మికైన శక్తిని ఉపాసకుడు శీర్షాది పాదపర్యంతం ఆయా వర్ణతేజస్సులతో న్యాసం చేసుకున్న స్థితిని పొందితే మంత్రసిద్ధుడవుతాడు. ఆపురుషుని స్థూలశరీరమంతా మాతృకా తేజోమయమవుతుంది. అతడే మాతృకాస్వరూపాన్ని దాలుస్తాడు. ధ్యేయాకారంగా మారడమే యోగపరమావధికదా!

**న్యాసము :-** న్యాసమంటే మనకావల్సినచోట శక్తిని ఉంచడం అని అర్థం. ఇది అంగన్యాసం 2) కరన్యాసం 3) హృదయాదిన్యాసం అని మూడురకాలు. ఇది మళ్ళీ బాహ్యం అంతరం అని రెండురకాలు. మంత్రయోగ పద్ధతిలో మాతృకాన్యాసం మహాప్రభావవంతమయినది. కళాన్యాసం అంతకంటే ప్రభావయుతం. దీన్ని బాహ్యయంత్రాల్లో దేవతావిగ్రహాల్లో ఉపయోగిస్తారు. ప్రాణప్రతిష్ఠలో ఈకళాన్యాసాన్ని ఆగమశాస్త్రం విస్తారంగా పేర్కొంటుంది. విగ్రహాలకు యంత్రాలకు ప్రాణ ప్రతిష్ఠచేసే వ్యక్తి పైన వివరించిన స్థాయికి చెందిన మహాసిద్ధపురుషుడయితే ఆవిగ్రహములేదా యంత్రము అత్యద్భుత ప్రభావాన్ని కల్గి, అభీష్టార్థాలను ప్రసాదిస్తుంటుంది. ఆక్షేత్రం సర్వజనాకర్షంగా విరాజిల్లుతుంది. నేడు ప్రఖ్యాతి చెందిన మహా క్షేత్రాలన్నీ ఇటువంటివే. అందుకే తీర్థంకరులు, తీర్థపాదులైన మహాత్ములు తీర్థక్షేత్రాలకు మహాత్మ్యాన్ని ప్రసాదిస్తారని శాస్త్రాలు చెప్తున్నాయి.

కళామాతృకాన్యాసం, అంతర్మాతృకాన్యాసం, బహిర్మాతృకాన్యాసం వంటివి ఏదయినా గురుముఖతఃనే గ్రహింపవలసి ఉంటుంది. ఉపాసనా స్థాయిని బట్టి ఫలము పొందగలడు. **మంత్ర శుద్ధితోనే మంత్రసిద్ధి** అనే నానుడికి

అర్థం మంత్రంతో ఉపాసకుడు స్థూల, సూక్ష్మ స్వరూపాలను శుద్ధి చేసుకోవాలని. అంతే గాని మంత్రానికి శుద్ధి అని కాదు. న్యాసంలో మరొక రకం 1) సృష్టి న్యాసం 2) స్థితి న్యాసం 3) సంహార న్యాసం. దీన్ని గురించి ముందు వివరించు కుందాం!

**కళాన్యాసం** :- ఈన్యాసం సర్వశక్తి సంపుటమయిన ప్రణవంతో కూడి ఏర్పడింది. శ్రీకళా మాతృకాన్యాసమంత్రానికి ప్రజాపతిఋషి గాయత్రీ ఛందస్సు. శ్రీకళామాతృక దేవత.

| కళామాతృక | కళ | న్యాసం చేయవలసిన చోటు |
|---|---|---|
| 1) ఓం-అం | నివృత్త్యైనమః | లలాటం (నుదురు) |
| 2) ఓం-ఆం | ప్రతిష్ఠాయైనమః | ముఖము (నోరు) |
| 3) ఓం-ఇం | విద్యాయై | కుడికన్ను |
| 4) ఓం-ఈం | శాంత్యై | ఎడమకన్ను |
| 5) ఓం-ఉం | తదర్థికాయై | కుడిచెవి |
| 6) ఓం-ఊం | దీపికాయై | ఎడమచెవి |
| 7) ఓం-ఋం | రేచికాయై | కుడిముక్కురంధ్రం |
| 8) ఓం-ౠం | మోచికాయై | ఎడమముక్కురంధ్రం |
| 9) ఓం-ఌం | అపరాయై | కుడిచెంప |
| 10) ఓం-ౡం | సూక్ష్మాయై | ఎడమచెంప |
| 11) ఓం-ఏం | సూక్ష్మమృతాయై | పైపెదవి |
| 12) ఓం-ఐం | జ్ఞానామృతాయై | క్రిందిపెదవి |
| 13) ఓం-ఓం | ఆప్యాయిన్యాయై | పైపలువరుస |
| 14) ఓం-ఔం | వ్యాపిన్యై | క్రింది పలువరుస |
| 15) ఓం-అం | వ్యోమరూపాయై | శిరస్సు |
| 16) ఓం-అః | అనంతరూపాయై | నాలుకకొన |
| 17) ఓం-కం | సృష్టిరూపాయై | కుడిభుజం |
| 18) ఓం-ఖం | సమృద్ధికాయై | కుడిమోచేయి |
| 19) ఓం-గం | స్మృత్యై | కుడిచేయిమణికట్టు |
| 20) ఓం-ఘం | మేధాయై | కుడిచేయివ్రేళ్ళమొదలు |
| 21) ఓం-ఙం | కాంత్యై | కుడిచేయివ్రేళ్ళకొస |
| 22) ఓం-చం | ద్యుత్యై | ఎడమమోచేయి |
| 23) ఓం-ఛం | లక్ష్మ్యై | ఎడమమోచేయి |
| 24) ఓం -జం | స్థిరాయై | ఎడమచేయిమణికట్టు |
| 25) ఓం-ఝం | స్థిత్యై | ఎడమచేతివ్రేళ్ళమొదలు |
| 26) ఓం-ఞం | సిద్ధ్యై | ఎడమచేతివ్రేళ్ళకొసలు |

| | | |
|---|---|---|
| 27) ఓం-టం | జరాయై | కుడికాలితొడ |
| 28) ఓం-ఠం | పాలిన్యై | కుడికాలిమోకాలు |
| 29) ఓం-డం | క్షాంత్యై | కుడికాలి చీలమండలు |
| 30) ఓం-ఢం | ఈశ్వరికాయై | కుడికాలి వ్రేళ్ళమొదలు |
| 31) ఓం-ణం | రత్యైనమః | కుడికాలి వ్రేళ్ళకొనలు |
| 32) ఓం-తం | కామికాయై | ఎడమకాలితొడ |
| 33) ఓం-థం | వరదాయై | ఎడమకాలిమోకాలు |
| 34) ఓం-దం | హ్లాదిన్యై | ఎడమకాలిచీల మండలం |
| 35) ఓం-ధం | ప్రీతిసంయుతాయై | కుడికాలివ్రేళ్ళమొదలు |
| 36) ఓం-నం | దీర్ఘాయై | ఎడమకాలివ్రేళ్ళకొనలు |
| 37) ఓం-పం | తీక్ష్ణాయై | కుడిపార్శ్వము ( ప్రక్క) |
| 38) ఓం-ఫం | రౌద్ర్యైనమః | ఎడమపార్శ్వము ( ప్రక్క) |
| 39) ఓం-బం | మాయాయై | వీపు |
| 40) ఓం-భం | నిద్రాయై | బొడ్డు |
| 41) ఓం-మం | తంద్రికాయై | పొట్ట |
| 42) ఓం-యం | క్షుధాయై | హృదయం( త్వగాత్మము) |
| 43) ఓం-రం | క్రోధిన్యై | కుడిభుజం( రక్త్యాత్మకము) |
| 44) ఓం-లం | క్రియోత్కారిణ్యై | మూపురము (మెడ) |
| 45) ఓం-వం | సమృత్యుకాయై | ఎడమభుజం |
| 46) ఓం-శం | పీతాయై | హృదయాదిగ కుడి పూర్తిచేయి. ( అస్థ్యాత్మకము) |
| 47) ఓం-షం | శ్వేతాయై | హృదయాదిగ కుడి పాదము పూర్తి ( శుక్రాత్మకము) |
| 48) ఓం-షం | అరుణాయై | హృదయాదిగ కుడిపాదం పూర్తి ( శుక్రాత్మకము) |
| 49) ఓం-హం | అసితాయై | హృదయాదిగ ఎడమపాదాగ్రము |
| 50) ఓం-ళం | నతాయై | హృదయాదిగ జఠర పర్యంతం (కడుపువరకు) |

**ఓంక్షంనమః అనేనాత్మక హృదయాది ముఖపర్యంతం. ప్రత్యేకంగా న్యాసం చేయాల్సి ఉంటుంది. ఇది ప్రాణరూపాత్మకం.**

ఈకలామాతృకన్యాసం కేవలం జ్ఞానసిద్ధిని కోరేవారు చేసుకోదగి ఉంది. కారణం కళలన్నీ జ్ఞానదోహదముగా ప్రణవాత్మకంగా ఉన్నాయి. మంత్రశాస్త్రంలో ఈన్యాసాలన్నీ ఋషిదైవత ఛందస్సులతో, కరాది హృదయాదిన్యాసాలతో వివరించబడినాయి.

కలామాతృకలు - వాటివివరాలు

**1) అ నుండి అః వరకు (16):**-16 కలామాతృకలు 16 నాదాత్మికాలై సదాశివునినుండి జనించినాయి. వీరంతా పచ్చని గంధం పైపూతగా పూసుకుని నాలుగు చేతులలో అక్షమాల పుస్తకం పాశం, కపాలాలను ధరించి దర్శనమిస్తారు. వీరు బిందువు (ం) పర, పశ్యంతిలో నాదంతో కూడా జనించినవారు. ఓంకారంలోని అకారం వీరిస్థానం.

**2) కం నుండి ఞం వరకు(10):**-ఈ కలామాతృకలు 10 మంది ఎర్రని మేనిఛాయతో రెండుచేతులలో పద్మాలనుధరించి దర్శనమిస్తారు. ఓంకారంలోని ఉకారస్థానంలో ఉన్నారు. వీరు విష్ణ్వాత్మికలు (విష్ణువు నుండి జనించినవారు).

**3) టం నుండి నం వరకు (10):**- కలామాతృకలు శ్యామల వర్ణంతో నాలుగు చేతులలో శంఖ, పద్మ, అభయ, వరద ముద్రలతో విరాజిల్లు తున్నారు. వీరూ విష్ణ్వాత్మికలే. "ఓం"కారంలోని "ఉ"కారం వీరి స్థానం.

**4) పం నుండి వం (9):**-ఈ కలామాతృకలు శరత్కాల వెన్నెలమేని కాంతితో నాల్గుచేతులలో వరద, అభయ, కపాల, శూలములను ధరించి దర్శనమిస్తారు. వీరు రుద్రాత్మికలు. ఓంకారంలోని మకారం వీరిస్థానం.

**5) శం నుంచి ళం (5):**-ఈఐదు కలామాతృకలు రక్తవర్ణ దేహ కాంతులతో మెరుస్తూ నాల్గు చేతులలో వరద, అభయ, ఉలి, జింకలను ధరించి ఉపాసకులకు దర్శనమిస్తారు.

**6) అంతర్మాతృకాన్యాసం:**-ఇది అంతస్సిద్ధిని ప్రసాదిస్తుంది. షట్కమలాల్లోని దళాలలో ఈవర్ణమాతృకలను న్యాసం చేసుకోవలసి ఉంటుంది. ఏకాగ్రతతో లక్ష్యం చేసినవెంటనే యథాతథంగా దర్శనమై, స్థిరంగా నిల్చి ఉన్న పరిపాకస్థితిలోనే ఈ వర్ణమాతృకలను ఆయా నిర్దుష్టచక్రదళాలలో సాధకుడు న్యాసం చేయగలడు.

| **చక్రము -** | **దర్శించవలసిన వర్ణమాతృకలు** |
|---|---|
| విశుద్ధచక్రములోని షోడశదళాలు | అనుండి అః(16)స్వరములు |
| అనాహత పద్మం 12 దళాలు (హృదయం) | క నుండి ఠ వరకు (12) |
| మణిపూరపద్మం (నాభిస్థానం) | డ నుండి ఫ వరకు (10) |

స్వాధిష్ఠానం ( లింగమూలం) బ నుండి ల వరకు (6)
మూలాధారం (ఆసనము) వ నుండి స వరకు (4)
ఆజ్ఞాచక్రం ( భ్రూమధ్యస్థానం) హ, క్షం (2)
సహస్రార కమలం ( నడినెత్తిన) అ, క, థ (3)
రేఖలతో నున్న త్రికోణం హ, ళ, క్ష (3).

న్యాసం పూర్తి అయిన తర్వాత ఆవర్ణమాతృక యొక్క దైవీ స్వరూపాన్ని సాధకుడు దర్శిస్తాడు. ఆమె బంధూక కుసుమ వర్ణంతో (ఎర్రని) నాలుగు చేతులలో అభయవరద పాశాంకుశాలను ధరించి ఉంటుంది. ఎర్రని వస్త్రాలను ధరించి ప్రౌఢ యవ్వన విజృంభమానమయిన ఘన జఘన భారంతో ప్రోత్తుంగ స్తనభరంతో ఉంటుంది. నుదుటిపై చంద్రరేఖను దాల్చి సర్వాలంకారశోభితగా వికసిత వదనంతో త్రినేత్రయై కన్పిస్తుంది. ఆదేవిని ధ్యానించి ఉపాసకుడు న్యాసం చేసిన మాతృకలను ధ్యానిస్తే సూక్ష్మశరీరం నుండి జ్ఞాన సిద్ధి పొందేందుకు మహార్హత సాధిస్తాడు.

## బహిర్మాతృకాన్యాసం

పంచాశత్ వర్ణమాతృక(50) స్వరూపిణీ త్రిపుర సుందరీ పరాశక్తి బహిర్మాతృకాన్యాసం అన్ని తరగతుల సాధకులకు ( ఇష్టదేవతా మంత్రజపం చేసుకునే వారికి గూడ) మహాఫలాన్నిస్తుంది. ఏకాగ్రమనస్సుతో పైన చెప్పిన క్రమంలో బహిరంగములందు ఈన్యాసం చేసుకోవలసి ఉంది. ప్రతి మంత్రానికి కరన్యాస హృదయన్యాసాలు ఉంటాయి. ఈ బహిర్మాతృకా న్యాసం చేసుకుని ఈ మంత్రజపం చేసేవారికి ఆ మంత్రం శీఘ్రఫలాన్నిస్తుంది. కారణం ఈమాతృకా వర్ణములు సాధకుని దేహంలోని సర్వాంగాలను శుద్ధిచేసి జపించే మంత్రశక్తిని అన్ని అంగాలలో ప్రసరింపజేసి అతని అభీష్టసిద్ధిని శీఘ్రతరం చేస్తుంది. ఈ బహిర్మాతృకయే పరాదేవత కాబట్టి ఇతర మంత్రం ఏదీ లేకుండా దీన్నే ప్రధానంగా ప్రతిదినంన్యాసం చేసుకోవచ్చు. కాని, గురువునుండి ఉపదేశం పొందడం తప్పనిసరి. ఆవాగ్దేవత పంచాశత్ (50) వర్ణరూపిణిగా సర్వాంగాలలో వ్యాపించి ఉంది. స్వచ్ఛకాంతులను విరజిమ్మే దేహంతో మూడు కన్నులు కలిగి తలపై చంద్రరేఖను దాల్చి ఉంది. ఆదేవి పీనవక్షోరుహాఢ్య. నాల్గుచేతులలో అక్షమాల, అమృతకలశం, ముద్ర నిత్యాతేజస్సును ధరించి ఉంటుంది. ఇట్టి మూర్తిని, సాధకుడుధ్యానించాలి.

## మాతృకాన్యాసము (మరొక రకము)

1) సృష్టి, 2) స్థితి 3) సంహారన్యాసాలనే పేర్లతో ఉండే మరొకన్యాసాన్ని గురించి తెలుసుకుందాం

**1) సృష్టిన్యాసం :** – బహిర్మాతృకాన్యాస విధానమే కొద్ది మార్పులను పొందినది మాతృకలకు ముందు ప్రణవం కూర్చబడింది. శరీర స్థానములలో మార్పు ఉండదు. మాతృకకు విసర్గలు కలపడం ఒక పద్ధతి. లేదా మాతృకకు ముందు హ్రీం, శ్రీం, కూర్చడం ఒక పద్ధతి. లేదా మాతృకకు ముందు ఐం ను కూర్చి న్యాసం చేయడం ఒక పద్ధతి.

**1) ప్రణవం కూర్చబడి సృష్టి :** ఓం అం నమః, ఓం ఆం నమః! ఓం ఇం నమః! ఓం ఈం నమః!

**2) విసర్గలు కల్పిన విధానం :** ఓం ఆః నమః, ఓం ఇః నమః ఓం అః నమః

**3) మాయాబీజ లక్ష్మీబీజ సంపుటితో:** హ్రీం- శ్రీం- అం- నమః హ్రీం- శ్రీం- ఆం- నమః

**4) సారస్వత బీజసంపుటి :** ఐం- అం- నమః, ఐం- ఆం- నమః

గమనిక :- పై పద్ధతులలో ఏదో ఒక పద్ధతిలో సృష్టిన్యాసం చేసుకోవలెను.

**2) స్థితి న్యాసం** : సృష్టిన్యాసంలో మాతృకలు ఆయా శరీరాంగాలలో సృష్టించబడతారు. వారికి స్థితి ఏర్పరచాడి ఈ న్యాసం. టం, ఠం, డం నమః అంటూ క్రమంగా లలాటం నుండి మొదలు పెట్టి అన్ని స్థానాలలో న్యాసం, చేయవలసి ఉంటుంది. మాతృకను ఉచ్చరింపనవసరం లేదు.

**3) సంహార న్యాసం:** ఈ న్యాసంలో విలోమక్రమంలో (వెనకనుండి) మాతృకలను న్యాసం చేస్తాం. శరీరస్థానాలు మాత్రం పైన చెప్పిన క్రమమే. అప్పటికి న్యాసం ఈవిధంగా ఉంటుంది. ఓంక్షం నమః (లలాటం). ఓంహం నమః (ముఖం). ఓంసం నమః (కుడికన్ను). ఓంశం (కుడి చెవి). ఈ విధంగా సంహారన్యాసం చేయవలసి ఉంటుంది. వర్ణమాతృకాశక్తులను సృష్టిన్యాసం ద్వారా ఆయాశరీరాంగాలలో సృష్టించుకుని జపం లేదా ఉపాసన ముగిసే వరకు అవి స్థిరంగా ఉండేందుకుస్థితిన్యాసం. ఉపాసన లేదాజపంముగిసిన తర్వాత ఆ శక్తులను

ఉపసంహరించేందుకు, సంహారన్యాసం ఏర్పరబడినాయి. ఈవిధంగా ఆధ్యాత్మదర్శన అభ్యాసయోగ ప్రణాళిక. రాజ యోగానికే గాక, ఇతరయోగాలన్నింటికి సమన్వయం సాధిస్తున్నట్లు మనం గమనించవచ్చు. నిర్గుణోపాసనకు ఇది పరమసాధనం. ఉపనిషత్తులలో ప్రతిచోటా ఉపాసనాకాండ పేర్కొనబడింది. బాగా పరిశీలిస్తే అభ్యాసయోగం లేకుండా కేవలం చదవడం, వినడంతోనే ప్రయోజనా సిద్ధించదు. ఈ అంశాన్నే సీతారామాంజనేయ సంవాదం ఈవిధంగా వివరిస్తుంది.

సీ॥ దారుణగాఢాంధకారంబడగునే వసుధపైఁ గ్రతదీప వార్తవలన
నాకొన్నమనుజుని యాకలిదీఱునే ఘనసరసాన్న వర్ణనము వలన
సెజీ పేదవాని పేదఱికంబు వోవునే ద్రవ్యప్రభావకీర్తనము వలన
రోగ పీడితుని బల్ రోగంబుదీరునే కలితౌషధ ప్రసంగంబు వలన

తే॥ గీ॥ జండిపడి బుద్ధిలో వెలినిండి మిగుల దట్టమైనట్టి యజ్ఞాన తమము దెగునె
తర్కిత విచిత్ర శబ్దబోధంబు వలన ఫలిత యోగానుభవ దృష్టి వలన గాక!

- శ్రీ సీతారామాంజనేయసంవాదము. ప్రథమాశ్వాసము-పద్యం 96.

తా॥ దీపములనుగురించిన వార్త వినడం వల్లనే గాఢాంధకారం పోతుందా? ఆకలితో బాధపడేవానికి రకరకాల ఆహారపదార్థాలను వర్ణన విన్పిస్తే ఆకలితీరుతుందా? ధనం యొక్క ప్రభావాన్ని కీర్తించడం వల్ల పేదవాని దరిద్రం తీరుతుందా? ఔషద ప్రభావాన్ని వినిపించినంతమాత్రాన రోగి వ్యాధినయమౌతుందా? ఇవన్నీ ఏవిధంగా కావో అట్లే మన బుద్ధి నంతటినీ ఆవరించిన అజ్ఞానం కేవలం తాత్త్విక వాక్యలవల్లనే తొలగదు. యోగాభ్యాసంతో తత్త్వదర్శనం చేయడమే దానికి కావలసిన సాధనామార్గం. వేరుగతి లేదు. కాబట్టి అభ్యాసకులు, ఉపాసకులుగా మారి ఆధ్యాత్మ విద్యాసాధన ప్రణాళికను క్రమంగా అభ్యాసిస్తూ పరాప్రకృతి దేవీ కృపకు పాత్రులమై స్వాత్మానందాన్ని పొందడమే మానవజీవిత పరమార్థంగా తెల్సుకొని శ్రద్ధ, విశ్వాసములతో అభ్యాస యోగాన్ని సాధనచేయడానికి ఉద్యుక్తులం కావాలని ఆహ్వానిస్తూ, ఆ అద్భుత ప్రణాళికను లోకాని కందించిన శ్రీ శివసచ్చిదానంద స్వామి చరణారవిందాలకు నతులర్పిస్తూ ఈ "శ్రీచక్ర శ్రీ విద్యా ఉపాసన" ప్రకరణాన్ని ముగిస్తున్నాం!

# అధ్యాయము - 8

# లోకవిద్య

## ఉపోద్ఘాతం

భారతీయవిజ్ఞాన భాండాగారమైన శృతిస్మృతి పురాణాలలో ఇతిహాసాలలో ఇతరలోకాలను గూర్చిన వివరాలు విరివిగా కనిపిస్తాయి. మరణానంతరం జీవులు తమతమ పుణ్యపాపకర్మలకు తగిన లోకాలను పొందుతారని ఆలోకాలలో కొంతకాలం జీవించి ఆయాకర్మ ఫలాలను పొంది తిరిగి తగిన జన్మనెత్తుతారని భగవద్గీత మొదలైన విశేషప్రచారం పొందిన శాస్త్ర గ్రంధాలు చెప్తున్నాయి. వాటన్నింటిని మనం చూడలేదే! అసలవి ఉన్నట్లు ఋజువేమిటి? వంటి ప్రశ్నలతో సంశయాన్ని వెల్లడించే కుహనాహేతువాదుల అజ్ఞానపు కూతలను పట్టించుకోవాల్సి పని లేదు. మరి కొందరు ప్రబుద్ధులు మానవునికి సత్ప్రవర్తన అలవడజేసేందుకే ఇతరలోకాలుండేందుకు కల్పించి నారని చెప్తుంటారు. ఇటువంటి మాటలు ఏకొద్దిమందికో పరిమితం. ప్రపంచంలోని దాదాపు అన్నిమతాలు స్వర్గనరకాలను పేర్కొంటున్నాయి. జీవుడు చేసే పాపపుణ్యాలను బట్టి స్వర్గనరకాలను పొందుతారని ఘోషిస్తున్నాయి. కాని, భారతీయ వాఙ్మయంలో భూగోళ, ఖగోళ విజ్ఞానము అత్యంత ప్రాచీనమై, ఎంతో ప్రాధాన్యతను సంతరించుకుని ఉంది. ఇతర లోకాలను గురించిన వివరాలనెన్నింటినో సోపపత్తికంగా సశాస్త్రీయంగా ఋజువు చేసే ఎన్నెన్నో గ్రంధాలు భారతీయ వాఙ్మయంలో విలసిల్లినాయి. చార్వాక నాస్తిక మతములు సృష్టినుండే తమ వాదాన్ని వినిపిస్తూనే ఉన్నాయి. కాని, వాటిని పట్టించుకుని ప్రమాణంగా అంగీకరించేవారు చాలా స్వల్పము. జన్మకర్మ సిద్ధాంతం ప్రకారమే జీవుల పుట్టుక, స్థితి వినాశనాలున్నాయనేది. ఋజువవుతుంది. ఇతరలోకాలను నమ్మని స్థితిలో జన్మకర్మసిద్ధాంతము పొందదు. కాబట్టి ఇతరలోకాలున్నాయనేది కేవలం ఊహ కల్పితం కాదని యోగశాస్త్రం ఋజువు పరుస్తుంది. యోగి, కామ గమనం అంటే తనకిష్ట మయిన చోటికి పోవడం, వంటి సిద్ధులను పొందుతాడు అనే మాటలను యోగశాస్త్రం నిరూపిస్తుంది. నేటి భౌతికశాస్త్ర పరిశోధనలు అంత రిక్ష యాత్రలు ఇతరగ్రహాలకు వెళ్ళిరావడం వంటి వన్నీ మనమెలా నమ్ము తున్నామో అట్లే శాస్త్ర చోదితములైన ఇతరలోకాల వివరాలను కూడా

నమ్మడం వల్ల శ్రేయస్సును పొందుతాం. నమ్మనివారిని గురించి పెద్దలీవిధంగా అంటున్నారు.

**"శృతి తాత్పర్యమఖిలమబుధ్వా భ్రామ్యతేజడః**
**వివేకీత్వఖిలం బుధ్వాతిష్ఠత్యానంద వారిధౌ"**

**తాత్పర్యం :** - శృతి చెప్పే ప్రబోధాన్ని సంపూర్ణంగా అర్థం చేసుకోక ఎక్కడిక్కడికే అనుకుని తెలివిమాలి అజ్ఞాని మోహం పొందుతున్నాడు. కాని, వివేకి శృతి తాత్పర్యాన్ని సంపూర్ణంగాతెలుసుకుని బ్రహ్మానందంలో స్థిరుడవుతున్నాడు. ఇతరలోకాలను నమ్మడం వివేకమని భావం. దీని వివరాలన్నీ వెనుకటి ఉత్తమమానవజన్మ అనే ప్రకరణంలో చూసుకోవచ్చు.

అభ్యాసయోగి-అణుశాస్త్రవేత్త వీరిరువురూ ప్రకృతిని ..... చేందుకు సమాన ప్రయత్నం లో ఉన్నారని ఒకే గమ్యం కలిగి ఉన్నారని మనం ముందే తెలుసుకున్నాం. పదార్థ విజ్ఞాన శాస్త్రజ్ఞుడు తన విజ్ఞాన పరమావధిని సమీపించినంతనే విజ్ఞానశాస్త్రం తత్వశాస్త్రంలో లీనమై పోతుంది. మనః ప్రవృత్తులని చెప్పబడేతత్వాలు కేవలం బాహ్యభేదాలే సద్వస్తువు ఒకటే అని ఇద్దరూ తెలుసుకుంటారు. ప్రస్తుత అంశానికొస్తే కారణమయిన సత్య విషయంలో కాకుండా కార్యరూపమయిన జగత్తులోని ఖగోళ, భూగోళ విజ్ఞానంలో యోగి, భౌతిక శాస్త్రజ్ఞుల పరిశోధనలలోని తేడాలను వివరించు కోవలసి ఉంది. జగత్తుకాధారమయిన ఖగోళ, భూగోళవైదిక శాస్త్రజ్ఞుల పరిశోధనలలోని తేడాలను వివరించుకోవలసి ఉంది. జగత్తుకాధారమయిన ఖగోళ, భూగోళవైదిక శాస్త్రజ్ఞులైన ఋషులు తమయోగశక్తితో ఆయా లోకాలను దర్శించి జ్యోతిశ్చక్రగమనాన్ని ఇతర వివరాలను వేదశాస్త్ర పురాణాలలో పేర్కొన్నారు. భౌతికశాస్త్రజ్ఞులు, అంతరిక్షంలో గ్రహమండలాలను వాటిమధ్యదూరాలను వాటి భ్రమణ క్రమాన్ని యాంత్రిక సహాయంతో తెల్సుకుంటున్నారు. కాని, ఈ పరిశోధనలు ముందుకు పోయేకొద్ది వెనుకటి అంశాలు మార్పుకు లోనవుతున్నాయి. యంత్రశక్తి సామర్థ్యం పెరిగే కొద్ది పరిశోధనాపరిధి విస్తరిస్తూ కొత్త సత్యాలను ఆవిష్కరిస్తున్నాయి. కాని యోగశక్తితో దర్శించిన విషయాలు మాత్రం శాశ్వత సత్యాలు. ఎప్పటికి మారేవి కావు ఈతేడాను వివేకులు తెలుసు కోగలరు. తద్వారా యోగశక్తి ప్రభావం సువిదితమైతుంది. స్వర్గాదులయిన ఊర్ధ్వలోకాలకు రాజులు కొందరు రాకపోకలు జరిపి నట్లు పురాణేతి

హాసాలలో చెప్పబడింది. అవన్నీ భారతీయ చారిత్రక గ్రంథాలే! కేవలం కల్పనలను భావించరాదు. సూర్యవంశరాజులలో కకుత్సుడు, హరిశ్చంద్రుడు చంద్రవంశ రాజులలో దుష్యంతుడు, ధర్మరాజు, అర్జునుడు వంటి రాజులు శ్రీకృష్ణబలరామాది మహాపురుషులు సశరీరంగా స్వర్గానికి వెళ్ళివచ్చినట్లు చెప్పబడింది. కాని దేవతలు తమ దివ్యరథాలను పంపి, వారిని పిలిపించు కున్నారు. ఆదివ్యరథాలకే ఈ గమనశక్తి ఉన్నట్లనుకోవచ్చు. దీన్ని బట్టిమనం గమనించవలసిన శాస్త్రీయాంశం ఒకటుంది. నేటి అంత రిక్ష నౌకల వంటి ప్రత్యేకశక్తి ఉన్న దివ్యవిమానాలలోనే పైన పేర్కొన్నవారంతా ఊర్ధ్వలోకానికి వెళ్ళినారు.

త్రిశంకుని వృత్తాంతం రామాయణంలో విశ్వామిత్రుని ప్రభావాన్ని తెలిపే ఘట్టం. విశ్వామిత్రుడు తన తపశ్శక్తిచే మరో స్వర్గాన్ని సృష్టించినాడు. దీనికి ముందు స్వర్గానికి పంపబడిన త్రిశంకుడు స్థూలశరీరంతో పైనుండి క్రిందికి త్రోసి వేయబడినాడు. దీన్ని బట్టి ఒక ప్రత్యేక మహత్తరశక్తి సహాయం లేకుండా స్థూలశరీరంతో ఇతరలోకాలకు పోవడం శక్యం కాదని తేలుతుంది. నారద మహర్షి వంటి కొద్దిమంది సిద్ధులకు మాత్రమే స్థూలశరీరంతో ఆకాశ గమనం సాధ్యమైనట్లు కన్పిస్తున్నాయి. మరి యోగశక్తితో ఇతరలోకాలను చేరగలవనే అంశాన్ని పరిశీలించినపుడు యోగి సూక్ష్మశరీరంతోనే ఇతరలోకాలను చేరుతాడు అని తెలుస్తుంది. అంటే స్థూలశరీరం నుండి సూక్ష్మశరీరాన్ని వేడదీయగల్గినపుడే ఇది సాధ్యం. ఇతరలోకాలకు వెళ్ళిఅక్కడి జీవులతో దర్శన భాషణములు సల్పడానికి తగిన ప్రణాళికను అధ్యాత్మ దర్శన అభ్యాసయోగం అందిస్తుంది. సావిత్రి చరిత్రలో భర్త ప్రాణం తీసుకు వెళుతున్న యముణ్ణనుసరించి సావిత్రియమలోకాన్ని చేరినట్లు తెలుసుకుంటాం. యోగశాస్త్ర పరంగా ఆమె సూక్ష్మశరీరంతోనే, యమలోకానికి వెళ్ళిందని చెప్పవచ్చు. ఆమె మహాయోగీశ్వరి కదా! అందుకే శ్రీ అరవిందుల వారు తమయోగదర్శన ప్రణాళికకు పోషకంగా సావిత్రి చరిత్రనే ఒకప్రత్యేక గ్రంథంగా రచించినారు. నేటి ఖగోళ శాస్త్రజ్ఞులు వారి పరిశోధనలకు మహాయోగుల సహాయాన్ని పొందినప్పుడు లోకానికి మరింత అభ్యుదయాన్ని అందించగలరని చెప్పడంలో విప్రతిపత్తిలేదు.

# అధ్యాయము 8

# లోకవిద్య

**సంయమము:-**

పతంజలి యోగసూత్రములలో సంయమమంటే ఏమిటో వివరించబడింది. "త్రయమేకత్ర సంయమః" అంటే

1) ధారణ 2) ధ్యాన 3) సమాధి ఈమూడు ఒకచోట చేర్చి నిల్పితే దానిని సంయమము అంటాము.

**1) ధారణ:-** (ఏదైనా ఒక) లక్ష్యమందు మనస్సును స్థిరంగా నిల్పడం.

**2) ధ్యానం:-** ఆ ప్రదేశమందే ధ్యేయ రూపవృత్తి ప్రవాహమే ధ్యానము (ధ్యేయమందు నిరంతరముగ ఆవృత్తి ప్రవాహము)

**3) సమాధి:-** అనగా ధ్యేయము రూపము లేకుండా ఆ అర్థము మాత్రమే నిల్చియున్నస్థితి సమాధి.

ఈమూడు స్థితులను ఒకచోట నిల్పియుంచుటయే సంయమము. సమాధిని గూర్చిన విషయము మనకు బాగా అర్థమయ్యేందుకు ఋషులు ఎన్నో వివరములను వివరణములను (ఆసూక్ష్మస్థితులను) ఇచ్చినారు.

**"ఆధ్యాత ధ్యానే పరిత్యజ్య క్రమాద్ధ్యేయైక గోచర**
**వివాత దీపవచ్చిత్తం సమారిభిధీయతే"**

ధ్యాత (ధ్యానం చేయువాడు) ధ్యానము (అతడు చేయు ప్రక్రియ) ఈరెండింటిని విడిచిపెట్టినపుడు క్రమముగ ధ్యేయము ఒకటియే మిగిలిన స్థితి అనుభవమగును. అప్పటి అనుభవము గాలిలేని చోట ఏ కదలిక లేని దీపము వలె నుండును. ఇదియే సమాధిస్థితి. ఇటుల అనేక విధములుగ చెప్పబడినవి.

**2) ధ్యానము :-** **"ధ్యానం తైలధారావత్ సంతతావచ్ఛిన్నం"** ధ్యానమనగా ఒక పాత్రనుండి ధారగా పోయుచున్నపుడు నూనె ఏవిధముగా తెంపులేక పడుతుందో, అట్లు చిత్తవృత్తులు ధ్యేయమునందు ప్రవహించే స్థితి అని వివరించబడినది. ఈవిధానములు ఈ పరిభాషలతో కాక గ్రంథము మొదటి ప్రకరణములలో చాలామటుకు వివరించబడినాయి. అభ్యాసకుడు (ఉపాసకుడు) ఉత్తమ స్థితిని సాధించగల్గినచో అన్ని విద్యల అనుభవములు పొందగలడు.

సంశయము లేదు పౌరుషముంది. దీక్షగా సాధన చేయు భాగ్యము పొందిన వాడుపర-అపర ప్రకృతిని జయించగలరు. ఊరకవమాటలు వినుట చెప్పుటలతో ఈమహాత్కార్యములో విజయం సాధింపజూచుట అవిచారిత రమణీయమని చెప్పవలసి వస్తుంది. ఈవిజ్ఞానము అనంతమహా సాగరము. శ్రీవివేకానందస్వామి (అమెరికా) షికాగోలో ప్రపంచ సర్వమత మహాసభలో భారత విజ్ఞానమును ఇతర విజ్ఞానములను పోల్చుటకు ఒక చిన్న కథ (కూపస్థమండూక కథ)చెప్పినాడు. దానిని ఇచట స్మరించిన మనలో కొంత మందికి తమ పరిస్థితి తమకే అర్థమై కనువిప్పుకాగలదు.

ఒకచోట చిన్న బావిలో ఒక చిన్న కప్ప ఉండేది. అదేదాని ఉత్పత్తి, నివాస స్థానము. అచటికి దైవవశాత్తు సముద్రము నందు వసించుచున్న కప్ప దారితప్పి ఆబావిలోనికి వచ్చింది. ప్రమాణములోఅది చాలా పెద్దది. బావిలో నున్న కప్పకు సముద్రం కప్పను చూచి స్వజాతి గాన (కొంత అసూయతో) సంభాషింప కొంత కోర్కె కల్గి "ఏమయ్యా! నీ నివాసమెచట! ఎక్కడనుండి వచ్చినావు?" అడిగింది. "మానివాసము సముద్రము" అని బదులిచ్చింది. అంతలో బావి కప్ప "మీ సముద్రం ఇంత ఉండునా?" అని తన శక్తి మేరకు (ఒక్క గంతువేసి) ప్రశ్నించింది. సముద్రం కప్ప "ఊహు" అన్నంతనే బావికప్ప మళ్ళీ ప్రాణాల్నొగ్గబట్టి గంతువేసి "ఇంత ఉండునా మీ సముద్రం" అని అడిగింది. సముద్రం కప్ప ఒక్కనవ్వు నవ్వి "చాలా పెద్దదయ్యా!" అనగా బావికప్ప "పోవయ్యా! భలే చెప్పు తున్నావు అంతా అబద్ధం మా బావి కన్న మీ సముద్రం ఏమీగొప్పది కాదు" అన్నది. సముద్రం కప్ప అనాదరమందహాసముతో వెడలిపోయింది. ఈకథలో వలెనున్నది కొంతమంది విజ్ఞానమని చెప్పడం వల్ల ఎవరికైనా కోపం వస్తే రావచ్చు!

శ్రీ శంకర భగవత్పాదులు భగవద్గీతాభాష్యారంభమున క్రింది శ్లోకమును ఉదహరించినారు. ఆశ్లోకమే మంగళాది శ్లోకముగా మేముకూడా ఈ లోక విద్యను గురించి తెల్పుతున్నాము.

**శ్లో॥ *నారాయణః పరోఽవ్యక్తాత్ అండమవ్యక్త సంభవం***
***అండ స్యాంతస్త్విమే లోకాః సప్తద్వీపాచ మేదినీ.***

శ్రీనారాయణుడు అవ్యక్త (ప్రకృతి) తత్త్వము కంటె పరుండగా (అధికుడు) గ నున్నాడు. అవ్యక్తము నుండి అండము ఉత్పన్నమైనది. అండము లోపల ఈలోకములు ఏడు ద్వీపములు గల భూమియు నున్నవి. ఈ సందర్భము లో ఇంకొక సంగతి ముచ్చటింప వలసియుంది. భారతీయ వైద్య విజ్ఞానమునకు సంబంధించిన, ప్రచారములోనున్న, సిద్ధనాగార్జునా చార్యులు రచించిన రసరత్నా కరమందు శ్రీశైలఖండమును ఒక ప్రకరణముంది. ఆ ప్రకరణమున శ్రీశైల పర్వతములో గల అద్భుతములను గురించి చెప్పినారు. వాటిని కనుగొనవల్సిన విధానములు ఏదిక్కున ఎంతదూరమున అవి ఉన్నాయి? ఆ అద్భుత మహిమ కల్గిన వస్తువులను సంపాదించవలసిన ఒక క్రమమైన విధానమును వివరంగా తెల్పినారు. అవేవి వస్తువులన్నీ భౌతిక పదార్థములే (స్పర్శవేధులే)! అనగా ఇనుము మొదలగు వాటికి తాకించినచో ఆ ఇనుము మొదలగు లోహములన్నియు బంగారుగా మారుతాయి. ఇటువంటి ఇంకా కొన్ని రత్నములు, బంగారు గనులు ఉన్నవని తెల్పినారు. వీటిని గూర్చి భారతీయ భౌతిక శాస్త్రజ్ఞులకు తెలియలేదో లేక తెలిసినను ఇవి కథలు కల్పనలను బుద్ధి కలిగి యత్నించకున్నారో అనుకోవల్సి ఉంది. ఇతర దేశ భౌతికశాస్త్రజ్ఞులకు తెలియకపోవచ్చు. శాస్త్రజ్ఞులకు ఎవరికైనను దురభిమాన దురహంకారము లుంటే శాస్త్రపరిశోధనలో ప్రగతి సాధించ లేరని గుర్తించాలి. ఇప్పుడు మనకు అభ్యుదయ సాధనకు (సంపద బంగారు మొదలగు) భౌతిక పదార్థములతో అవసరము ఉంది. దానికి మూలభూతమైన సంపద బంగారు రత్నములు మొదలగు వస్తువులు కావల్సి ఉన్న భౌతిక శాస్త్ర పరిశోధకులు, శ్రీశైల ఖండ వృత్తాంతము పై గూడా దృష్టి మరలిస్తే దేశాభ్యుదయం సాధించుటలో కృతార్థులు కాగలరని భౌతిక శాస్త్ర పరిశోధకులకు, పరి పోషణాదికములు నిర్వహించు బాధ్యత గల రాజకీయ నేతలకు సంహా నిస్తున్నాం.

## 8.1 భూలోక విద్య

ఆధ్యాత్మ దర్శన అభ్యాసప్రణాళికలో శ్రీగురువులు కొంతమంది ఉపాసకులకు ఈలోకవిద్యలు దర్శనములు చేయించిరి. పైన తెల్పిన ధారణధ్యానసమాధులు ఒకేచోట చేరుస్థితిని సంయమము అను సంజ్ఞతో యోగాచార్యులు వ్యవహరించిరి. ఈ ప్రకరణములో సాధకుడు తన

శరీరములో [illegible] చేసినచో లోకములు, గ్రహములు [illegible] శరీరములోని దివ్యశక్తులు అను భాగములలో ఇదివరలో [illegible] మాటకు వివరించినాము. ఆ దివ్యలోక దర్శనములలో సాధకుడు అచ్చటనున్న మహాపురుషుల, వ్యక్తుల, స్థలముల దర్శనము చేయుభాగ్యం పొంది ధన్యతకు తగిన అర్హత పొందగలడు. అచట సాధకుడు వారితో సంభాషింపగలడు. అయితే ఆదివ్యులతో సంభాషణము చాలా వినయ భయభక్తులతో చేయవలసి యుండును. లేకున్నచో కొన్ని బాధలు పొందవలసి వచ్చును. అపుడు బృహజ్యోతిర్విద్య ముఖ్యముగనున్న ఆసన్నివేశమునుండి తప్పించుకొనగలడు. ఈ విషయమును శ్రీ గురు శిష్యులతో గణపతి అనునొక ఉపాసకుని వృత్తాంతం బృహజ్యోతిర్విద్యలో తెలుపబడినది.

ఉపాసకుడు తన శరీరములో నాభియందు సంయమము చేసిన భూలోకజ్ఞానము గలుగును. భూలోకమునగల పర్వత పట్టణములు, నదీనదములు, అరణ్యములు, జన సంచారములేని ప్రదేశములు, చూడగల్గుటయే ఈవిద్యలో గల అనుభవము. ఇందులో గల ప్రత్యేక విషయము, భూమి ఏడు ద్వీపములు, ఏడు సముద్రములతోనున్నది.

| ఏడు ద్వీపములు | వీటిచుట్టూఉన్న ఏడు సముద్రములు |
| --- | --- |
| 1) జంబూద్వీపము | 1. లవణసముద్రము |
| 2) ప్లక్ష ద్వీపము | 2. ఇక్షురససముద్రము |
| 3) శాల్మలీ ద్వీపము | 3. సురాసముద్రము( కల్లు) |
| 4) కుశ ద్వీపము | 4. ఘృతసముద్రము(నెయ్యి) |
| 5) క్రౌంచ ద్వీపము | 5. దధిసముద్రము ( పెరుగు) |
| 6) శాక ద్వీపము | 6. క్షీర సముద్రము (పాలు) |
| 7) పుష్కరద్వీపము | 7. స్వాదూదకసముద్రము( మంచి రుచియైన నీరు) |

**జంబూద్వీపము :–** భారతీయులమగు మనము వైదిక పౌరాణిక కర్మల యందు మొదటనే సంకల్పము చెప్పుతున్నాము. ఇది ఋషుల సాంప్రదాయము. సంకల్పము చేయువాడు తను నివసించు ప్రదేశముయొక్క సరిహద్దులు చెప్పుచు, అప్పటికాలము వివరములను ఏతిథి, ఏ యుగము, ఏమన్వంతరము మొదలగు కాలవివరము వారాంతము చెప్పుచున్నారు.

దాదాపు బ్రహ్మ సృష్టి కర్తకాలము నుండి ఈ చాంద్ర (సౌర) మాన కాలము వరకున్న వివరములు చెప్పి ప్రతి కర్మలు చేయబడుచున్నవి. ఆసంకల్పమున భూమిలోని ప్రదేశము జంబూద్వీపే భరతవర్షే (భరతఖండే) అని చెప్పుతున్నారు. అనగా మనమిపుడున్నది జంబూద్వీపమనియు, మరల ఆవర్షము లోని ఖండములలో భరతఖండమనియు ఎంతోకాలము నుండియో సిద్ధాంతమై ఉంది. సూర్యసిద్ధాంతములో ఇట్లు చెప్పబడింది.

శ్లో|| *మధ్యేసమంతా దండస్య భూగోళోవ్యోమ్నితిష్ఠతి*
*బిభ్రాణః పరమాంశక్తిః బ్రహ్మణో ధారణాత్మికాం.*

ఈ బ్రహ్మాండము మధ్యభాగమంతటను భూగోళము ఆకాశమందున్నది. ఇది బ్రహ్మయొక్క ధారణాత్మికమగు పరమశక్తిని భరించి యుంది. దాని వివరణము : ప్రకృతి నుండి మహత్తత్త్వము దానినుండి పంచ తన్మాత్రలు 1) శబ్ద 2) స్పర్శ 3) రూప 4) రస 5) గంధములు. వీటి నుండి వరుసగా ఆకాశ, వాయు, అగ్ని, జల, భూమి, అనే అయిదు మహాభూతములు జనించినవి. ఈ ఆకాశాది భూతములు వరుసగా ఒక్కొక్క గుణముతో పెరుగుచునున్నవి.

| | |
|---|---|
| 1) ఆకాశము | 1. శబ్ద గుణము |
| 2) వాయు | 2. శబ్ద స్పర్శలు |
| 3) అగ్ని | 3. శబ్ద స్పర్శ రూపములు |
| 4) జల | 4. శబ్ద స్పర్శ రూప రసములు |
| 5) భూమి | 5. శబ్ద స్పర్శ రస గంధములు |

అంతే కాక ప్రతి భూతము తన గుణము 4 భాగములు, మిగిలిన భూతముల గుణములు 4 భాగములుగ ఏర్పడి యున్నాయి. ప్రతిభూతమున అయిదు గుణములున్నాయి. తన గుణం అర్ధమును (½) మిగిలిన భూతగుణములు నాలు ఒక అర్ధమును (½) గలిగియున్నవి. దీనినే పంచీకరణము అంటారు. పంచ భూతములలో భూమికి మాత్రము అయిదు గుణములు ఎక్కువగ నున్నవి. ఇటులున్న పంచ భూతములలోననే పంచ భూతాత్మికములగు లోకములన్నిదేహములు నిలిచియున్నాయి. ఈ భూతములు ఒకటినొకటిని దాటకుండా మరియు ఏవిధమగు క్రమభంగము లేక నిర్ణీతములై ఉన్నాయి. ఈ క్రమ పద్ధతిలో ఏవిధమైన వ్యత్యాసము గల్గినను దేహధారులకు దేహవియోగం గల్గుతుంది. ఈవిధంగా దేహములు అను

పూర్వకంగా నశిస్తూ, మళ్ళీమళ్ళీ తయారై తున్నాయి. ఈవిధంగా పంచ భూతాలు లోకాలకు, దేహాలకు మూలకారణాలుగా ఉన్నాయి. ఆపంచ భూతాల రూపాలు ఈశ్వరశక్తి సంపుటితములై, మన మూహించేందుకు శక్యంకాని స్థాయిలో ఉన్నాయి.

కాని కొన్ని కొన్ని పంచభూతవికారములైన ధాతువులు ( ప్రదేశములు, వస్తువులు) అక్కడక్కడ కన్పిస్తున్నాయి. ఆకన్పించే ప్రదేశాలకు, వస్తువులకు మనుష్యులు, ప్రమాణాలు, వాటికి సంబంధించిన విశ్లేషములు తార్కిక మేధాశక్తితో చెప్పగల్గుతున్నారు. కాని ఊహించడానికి( చింతించుటకు) శక్యం గాని భావములు (వస్తువులు, ప్రదేశాలు) ఏవున్నాయో, వాటిని తార్కిక మేధస్సుతో యోజింపకూడదు ఈప్రకృతి శక్తికి మించి ఏది ఉన్నదో అదే అచింత్యమని శాస్త్రం చెప్తుంది.

శ్లో|| అచింత్యాఖలు యే భావాః నతాం తర్కేణయోజయే
ప్రకృతిభ్యః పరంయత్తుతదచింతస్య లక్షణం

## భూమండల విస్తారము

సూర్యుడెంత ప్రదేశంవరకు వెలుగునిస్తాడో, చంద్రుడు తారకలు ఎంతవరకు వెలుగుతుంటారో అంతవరకు భూమండలం విస్తరించి ఉన్నది.

స్వాయంభువు మనువు పుత్రుడైన ప్రియవ్రతుడనే రాజు తన రథంతో ఈభూమండలాన్ని సంచరించినప్పుడు ఆరథచక్రముల వల్ల నలిగిన భూమి ఏడు సముద్రాలుగా ఏర్పడి, ఏడు ద్వీపాలుగా విభజితమైందని చెప్పబడింది. ఈప్రియవ్రతుని చరిత్రంభాగవతంలో ఉంది. ఏడు ద్వీపాలలో మధ్యనున్నదే జంబూద్వీపము. ఇది లక్షయోజనవిస్తీర్ణమై సమవర్తులంగా ఉంది. ఈద్వీపంలో ఎనిమిది నవవర్షాలు. ఆతొమ్మిదింటిలో మధ్యనున్నది ఇలావృతవర్షము. ఇలా వృతవర్షంలో మధ్యభాగంలో భూమండల కమలకర్ణికవలె మేరు పర్వతముంది. అది 16వేలయోజనముల లోతు క్రిందిభాగమున పాదుగా ఉంది. ఆక్రింది భాగము వైశాల్యము 84 వేల యోజనములుంది. భూప్రాంతంలో 16వేలయోజనముల వెడల్పు శిరోభాగంతో 32వేల యోజనముల వెడల్పుగా ఉంది.

ఇలావృతవర్షానికి ఉత్తరాన మూడు కులగిరులు నీల,శ్వేత, శృంగవత్ అనే పేర్లతో రమ్యక , హిరణ్మయ, కురు వర్షము లేర్పడేందుకు కారణ

భూతాలుగా నిల్చి ఉన్నాయి. ఇలావృతవర్షానికి దక్షిణభాగాన నిషధ, హేమకూట, హిమాలయ పర్వతములు వరుసగా హరివర్ష, కింపురుషవర్ష, భరత వర్షములకు వ్యవస్థాపకాలుగా ఉన్నాయి. ఇలావృతవర్షమునకు పశ్చిమాన మాల్యవంతం అనే కులపర్వతం నిల్చి, కేతుమాలవర్షాన్నే ఏర్పరుస్తుంది. ఇలావృతవర్షానికి తూర్పున గంధమాదనపర్వతమునిల్చి, భద్రాశ్వవర్షాన్నే ఏర్పరుస్తుంది. మేరువుకు అవష్టంభ పర్వతాలు (ఊతగాఉండేవి) నాలుగున్నాయి. అవి మందరము, మేరుమందరము, సుపార్శ్వము, కుముదము. ఇవి 10వేలయోజనాల పొడవు, 10వేల యోజనాల ఎత్తు ఉన్నాయి. మేరువుకు నాల్గుదిక్కులా పాదుకొని ఉన్నాయి. ఆపర్వతశిఖరాల పై వరుసగా చూత, జంబూ, కదంబ, వట వృక్షాలు 1100 యోజనముల ఎత్తుతో 1100 యోజన విస్తారంతో ఒప్పి ఉన్నాయి. 100 యోజనముల విస్తారమైన పాలు, తేనె, చెఱుకు రసం, శుద్ధ జలముల సరస్సులు క్రమంగా ఆ పర్వతాలపైనున్నాయి. ఆరసములనాని ఉపదేవగణాలు స్వాభావిక ఐశ్వర్య, యోగ విభూతులతో విలసిల్లుతున్నాయి. అక్కడ వరుసగా నందన, చైత్రరథ, వైభ్రాజిక, విశ్వతోభద్ర, పేర్లతో దేవతా ఉద్యానవనాలు విలసిల్లు తున్నాయి. మందర గిరిపైన ఏకాదశ శతయోజన విస్తృతోన్నతమైన చూత (మామిడి) వృక్షాగ్రము నుండి గిరిశిఖర మంత ప్రమాణంలోని అమృతమధురఫలాలు రాలిపడ్తూ, పగిలి మధుర, అమృత, అరుణ రస మొక ప్రవాహమై అరుణోదయ మనే పేరుతో ఒకనది ఇళావృత వర్షానికి తూర్పున పారుతుంటుంది.

జంబూ వృక్షమునుండి(నేరేడుచెట్టు) ఏనుగు ప్రమాణంలో పండ్లు, సూక్ష్మబీజాలై పగిలి రసము, నదిగా ప్రవహిస్తుంది. అదే జంబూనది. మేరు మందరగిరి శిఖరము నుండి భూమికి దిగి ఇళావృతవర్షానికి దక్షిణభాగమున పారుతుంటుంది. ఆనదికిరువైపులనున్న మన్ను ఆరససంపర్కమువల్ల, వాతార్కసంపాతంబువల్ల దేవలోకాభరణంచైన సువర్ణమై(బంగారం) ప్రకాశిస్తుంది.

సుపార్శ్వగిరిలోని కదంబ వృక్షములోని వేర్లనుండి వెలువడిన రసము క్రిందికిదిగి ఏరుగామారి ఇళావృత వర్షానికి పడమటిదిక్కున ప్రవహిస్తుంది.

కుముద పర్వత శిఖరమునందు శతవల్శమనుపేర వలసిన వట వృక్షమునుండి కొమ్మలనుండి క్రిందికి పారే నదములు సర్వకామాలను కురిసే ప్రభావాన్ని కల్గి ఉన్నాయి. అవి ఇలావృత వర్షానికి ఉత్తరాన వెలసినాయి. వాటి జలపానం చేసే వారికి చర్మంముడతలు పడదు. వెంట్రుకలు నెరయవు.

స్వేదదుర్గంధాలుండవు. జరామరణాది వ్యాధి శీతోష్ణ వివర్ణతాదులు కల్గవు. యావజ్జీవము నిరతిశయ సుఖాన్నిస్తాయి.

మేరు పర్వతానికి క్రిందివైపున చుట్టూ, కమలకర్ణికకు కేసరాలవలె, కురంగ, కురర, కుసుంభ, వైకంకత, త్రికూట, శిశిర , పతంగ, రుచక, నిషధ, శితివాస, కపిల, శంఖ, చారు, విహంగ, ఋషభ, నాగ, కాలాంజన, నారదాదిగిరు లొప్పుతున్నాయి. మేరువుకు తూర్పున జఠర,దేవ కూటంబులనే పర్వతాలు 18వేల యోజన విస్తారములై, 2 వేల యోజనముల ఎత్తుగలవై ఉన్నాయి. పడమట పతన-పారియాత్రంబులనే పర్వతాలు దక్షిణాన కైలాస, కరవీరము అనే పర్వతాలున్నాయి. మేరుగిరిశిఖర మధ్యభాగంలో పదివేల యోజనాల విస్తారమైన సమచతురస్రంగా బ్రహ్మపుర ముంది. దానికి చుట్టూ ప్రాగాది దిక్కులందు అష్టదిక్పాలకుల పురము లున్నాయి. అవి 2,500 యోజనముల విస్తార, విశాలత్వము ననొప్పారు తుంటాయి.

## 8.1.2. గంగానిర్గమన విధానము:-

పూర్వము బలిచక్రవర్తిని నిగ్రహించవలెనని త్రివిక్రమావతారాన్ని దాల్చిన హరి వామచరణాంగుష్ఠము తాకి బ్రహ్మాండ కటాహము పగిలి రంధ్రమేర్పడినప్పుడు, వెలువడిన సలిలధార శ్రీనారాయణ చరణక్షాళనము చేసి అపాదమునందలి పూజాకుంకుమాది పదార్థములవల్ల ఎర్రని రంగుతో ప్రకాశిస్తూ, తన్ను సేవించే అఖిలలోకముల మాలిన్యాన్నంతా నిరసిస్తూ, **భగవత్పది** అనే పేరుతో చెలగి, భాగీరథి, జాహ్నవి, అనే పేర్లు కల్గి, చాలా కాలానికి ఆప్రవాహం విష్ణుపదమనబడే ఆకాశపథమూర్ధ్వభాగాన్నుండి అవతరించింది.

అక్కడున్న ఉత్తానపాద తనయుడు, పరమభాగవతోత్తముడైన **ధృవుడు** భక్తి పారవశ్యంతో ఆనందబాష్పనేత్రుడై గోవిందపదారవిందమధురసాన్ని సేవిస్తుంటాడు. అతని క్రిందిభాగంలో సప్తర్షులు, ఆగంగా ప్రభావాన్ని ఎఱిగిన వారై శ్రద్ధా భక్తులతో ఆజలాన్ని తమ జటాజూటంలో ధరిస్తారు.

ఈవిధంగా గంగా ప్రవాహ ధార అనేక విమాన సంకులమైన ఆకాశమార్గంలోనికి దిగుతూ, చంద్రమండలాన్నావరించి, బ్రహ్మసదనం ప్రవేశించి, అక్కడ సీత, అలకనంద, చక్షుస్సు, భద్రనంద అనే నాల్గు పాయలుగా మారి, క్రమంగా ప్రాగాది నాల్గుదిక్కులకు ప్రవహిస్తుంది.

**సీత:-** బ్రహ్మసదనం నుండి కేసర- అవష్టంభాది పర్వతాలను వాటి క్రింద మేరుగిరి ప్రాగ్భాగాన గంధమాదన శిఖరాలను జొచ్చి, భద్రాశ్వవర్ష మధ్యంలో ప్రవహించి లవణసముద్రంలో కలుస్తుంది.

**అలకనంద:-** బ్రహ్మ సదనం నుండి దక్షిణానికి అనేక గిరికూటాలను దాటి, హేమకూట హిమకూటాలను అతివేగంగా పాఱే కర్మక్షేత్రమైన భారతవర్షంలో అవతరించి, లవణ సముద్రంలో కలుస్తుంది.

**భద్ర:-** మేరువునకుత్తరాన గిరిశిఖరాలను దాటి శృంగవంత శిఖరాలలో జొచ్చి ఉత్తరకురు వర్షమున లవణార్ణవాన్ని ప్రవేశిస్తుంది.

**చక్షుస్సు:-** బ్రహ్మసదనం నుండి పశ్చిమాన గిరిశిఖరాలను దాటి, మాల్యవంతాన్ని అవతరించి కేతుమాలవర్షంలో ప్రవహించి లవణ సముద్రంలో చేరుతుంది. అంతేకాకుండా మేరు పర్వతాన్ని చుట్టి పశ్చిమ ప్రవాహాలైన నదములు, పూర్వప్రవాహాలైన నదులును ప్రతి వర్షంలో మేనవేలున్నాయి.

జంబూ ద్వీపంలో భరత వర్షమే కర్మక్షేత్రము. మిగిలిన ఎనిమిది పుణ్యవంతుల స్వర్గ భోగార్థాలు. భూలోక స్వర్గాలు. ఈ కర్మక్షేత్రం కాక మిగిలిన వర్షాలలోని పురుషులు అయుతవత్సరాయు స్సంపన్నులై, దేవకల్పులై, నాగాయుతబలులై దృఢాంగులై, నవయౌవన మోదముతో నుల్లసిల్లుతూ, సురత భోగాలనను భవిస్తుంటారు. వారి స్త్రీలు ఆయుశ్శేషము ఒక సంవత్సరం ఉండునప్పుడు ఒకేఒక గర్భాన్ని ధరిస్తారు. అక్కడ త్రేతాయుగ సమకాలముంటుంది.

## నవవర్షములు

**1) ఇలావృతవర్షము:-** ఈవర్షములో భగవంతుడైన భవుడొక్కడే పురుషుడు. భవానీ శాపభీతి వల్ల మరొక పురుషుడిందు ప్రవేశింపడు. భవానీదేవి సహచారిణులైన పరిచారికలతో హరుడు సేవించబడుతుంటాడు. ఆమహాదేవుడు సంకర్షణదేవుని ప్రార్థిస్తుంటాడు.

**ఓంనమో భగవతే వాసుదేవాయ సర్వగుణ సంఖ్యానాయ అవ్యక్తాయ నమః.**

అనే మంత్రాన్ని అనుష్ఠిస్తూ భవుడంటాడు. ఇక్కడ బహు విధములైన స్వర్గాలున్నాయి. అవిస్వర్గానికన్నా మనోహరాలు. వాటికన్నా పాతాళాది లోకాలు రమ్యతరాలు, పాతాళం కన్నా ఇలావృత వర్షము రమ్యాతిరమ్యము.

**2) భద్రాశ్వవర్షము :-** ఇందలిప్రజలు హయగ్రీవోపాసకులు.

ధర్మ తనయుడు భద్రశ్రవుడు అనేరాజు ఆవర్షాధిపతి. **ఓంనమో భగవతే ధర్మాయ, ఆత్మవిశోధనాయనమఃఅనేమంత్రంతో హయగ్రీవు నుపాసిస్తారు**

**3) హరివర్షము :-** హరివర్షంలో ప్రహ్లాదుడు పాలకుడై దైత్య దానవులతో కూడి శ్రీ నృసింహుని సేవిస్తుంటాడు. వీరు జపించే మంత్రం **ఓం నమో భగవతే నరసింహాయ నమస్తే జస్తేజసే ఆవిరావిర్భావ వజ్రనఖ వజ్రదంష్ట్ర కర్మాశ యాన్ రంధయ రంధయ. నమ ఉగ్ర స్వభావాయ మహాత్మనే తమోగ్రసగ్రసస్వాహా అభయ మభయమాత్మని భూయిష్ఠాః.**

**4) కేతుమాలవర్షము :-** దీనిలో భగవతుండగు కామదేవుడు రమాదేవిని రమింపజేస్తూ, ఆత్మేంద్రియాలను రమింపజేస్తుంటాడు. ఆదేవిని రాత్ర్యభిమాన దేవతలు, అహరభిమాన దేవతలు కొలుస్తుంటారు. అక్కడి ప్రజలు ఈమంత్రాన్నుపాసిస్తారు. మంత్రం **ఓం-హ్రాం-హ్రీం-హ్రూం - ఓం నమో భగవతే హృషీకేశాయ సర్వ గుణ విశేష విలాసితాత్మనే, ఆకూతీనాంచిత్తానాం చేతసాంచ విశేషాణాంచ అధిపతయే షోడశ కలాయ ఛందో మయాయా న్నమయాయ అమృతాయ సర్వామయమాయ సహసే ఓజసే బలాయ కాంతాయ కామాయ నమస్తే ఉభయత్ర భూయాత్!.**

**5) రమ్యకవర్షము :-** ఈవర్షమునందలి ప్రజలు మత్స్యమూర్తిని కొలుస్తారు. మత్స్యమూర్తి అంటే సూత్రాత్మయైన భగవంతుడే! వారు పాసించే మంత్రం, **ఓం నమో భగవతే ముఖ్యతమాయ నమస్సత్త్వాయ, ప్రాణాయౌజసే సహసేబలాయ మహా మత్స్యాయనమః**

**6) హిరణ్మయవర్షము :-** ఈవర్షమునందు పితృ గణాధిపతి యైన అర్యముడు శ్రీకూర్మరూపియైన భగవంతుని అచటి ప్రజలతో గూడి క్రింది మంత్రాన్ని జపిస్తూ ధ్యానిస్తాడు. **మంత్రం ఓం నమో భగవతే అకూపారాయ సర్వసత్వగుణ విశేషాయ నోపలక్షితస్థానాయ నమో వర్ష్మణే నమో భూమ్నే నమో2వస్థాయ నమస్తే ఇతి!**

**7) ఉత్తర కురువర్షము:-** ఉత్తరకురువర్షంలో వరాహరూపుడైన భగవంతుని, భూదేవి, ఆవర్షప్రజలతో కలిసి, క్రింది మంత్రోపాసన చేస్తూ ధ్యానిస్తుంటుంది. **మంత్రం ఓం నమో భగవతే మంత్ర తత్త్వలింగాయ, యజ్ఞక్రతవే మహాధ్వరావయవాయ మహీధరాయ మహాపురుషాయనమః**

**8) కింపురషవర్షము:**– ఈవర్షంలో హనుమంతుడు అధినేత కింపురుషవర్షములతో గూడి సీతాభిరాముడైన శ్రీరాముని క్రింది మంత్రంతో ధ్యానిస్తూ ఉంటాడు. మంత్రం ఓం నమో భగవతే **ఉత్తమశ్లోకాయ నమ ఆర్య లక్షణ శీలవ్రతాయ నమ ఉప శిక్షితాత్మనే నమ ఉపాసిత లోకాయ నమూస్సాధువాద నికర్షణాయ నమో బ్రహ్మణ్యదేవాయ మహా పురుషాయ, మహా రాజాయ నమః.**

**9) భారత వర్షము :**– భారతవర్షమునందు భగవంతుడైన నారాయణుడు బదరికాశ్రమవాసియై, నారదాది భక్తులచేత సేవించబడుతూ, సాంఖ్యయోగాన్ని ఉపదేశిస్తున్నాడు. భరత వర్షీయులు ఆస్వామి నారాధిస్తుంటారు. వారు చాతుర్వర్ణ్యులు. వారీమంత్రం చే ఆస్వామినుపాసిస్తారు. **ఓం నమో భగవతే ఉపశమనశీలాయ ఉపరతానాత్మ్యాయ నమో అకించన విత్తాయ ఋషి ఋషభాయ, నారాయణాయ పరమహంసాయ పరమగురవే ఆత్మారామాధి పతయేనమోనమః.**

**8.1.3 జంబూద్వీప ఉపద్వీపాలు** - ఇవి ఎనిమిది. ఇవి సగర చక్రవర్తి యజ్ఞాశ్వాన్ని వెదుకుతూ సగరపుత్రులు ఈభూమిని త్రవ్వినప్పు డేర్పడినాయి.

**ఎ. ప్లక్ష ద్వీపము**

ఈద్వీపము జంబూద్వీపానికి రెండింతల ప్రమాణంతో, రెండు లక్షల యోజన విస్తారం కల్గి ఉంది ఈ ద్వీప నాథుడు ప్రియవ్రత పుత్రుడైన ఇధ్మ జిహ్వుడు. ఇతడు తన పుత్రుల పేర్లతో ఈద్వీపాన్ని ఏడు భాగాలుగా విభజించినాడు. అవి 1) శివం 2) యశస్యం 3) సుభద్రం 4) శాంతం 5) క్షేమం 6) అమృతం 7) అభయం. ఈద్వీపములను విభజిస్తూ ఏడు మర్యాదాగిరులున్నాయి. అవి 1) మణికూట 2) వజ్రకూట 3) ఇంద్రసేన 4) జ్యోతిష్మాన్ 5) ధూమ్రవర్ణ 6) హిరణ్యగ్రీవ 7) మేఘమాల. ఈ ఏడు నదుల నుండి క్రింది పేర్లు కల్గిన ఏడు నదులు ప్రవహిస్తున్నాయి. 1) అరుణా 2) మనృణా 3) అంగీరసీ 4) సావిత్రీ 5) సుప్రభాతే 6) ఋతంభరా 7) సత్యంభరా.

ఈనదులజలో పస్పర్శనంతో విధ్వస్త రజస్తమస్కులై హంస, పతంగ, గోర్ధ్వాయన, సత్యాంగ అనే నాల్గువర్ణాల ప్రజలు సహస్రవత్సరాయుష్కులై, అగ్ని హోత్రపరాయణులై, భగవతుండైన సూర్యుని త్రయీ విద్యచేత ఆత్మ

స్వరూపునిగా యజిస్తుంటారు. వారు పాసించే మంత్రం **ప్రత్నస్య విష్ణో రూపం యత్ సత్వర్తస్యబ్రహ్మణః అమృతస్యమృత్యోశ్చ సూర్య మాత్మానమీ మహి**

పక్ష, శాల్మలి, కుశ, క్రౌంచ, శాక దీపములనే ఐదు ద్వీపప్రజల ఆయుఃప్రమాణం 1000 సంవత్సరాలు. అల్లే ఇంద్రియము, ఓజస్సు సహనము, బల, బుద్ధి విక్రమములు, వీరు దరికి సమానమే వీరి స్వత స్సిద్ధమైన కార్యసిద్ధి కల్గి ఉంటారు. ఈప్లక్షద్వీపము తనతో సమానమైన విస్తీర్ణము కల్గిన ఇక్షురస సముద్రంతో చుట్టబడి ఉంది.

## బి. శాల్మలీ ద్వీపము

ఈశాల్మలీ ద్వీపము ప్లక్షద్వీపానికన్నా రెండింతల విస్తారంగా ఉంది. ఈద్వీపము చుట్టూ సురాసముద్రం ఉంది. దీనిలో శాల్మలీవృక్షాలు వటవృక్షమంత ఔన్నత్యంకల్గి ఉండడంవల్ల దానికాపేరు వచ్చింది. ప్రియవ్రతుని కుమారుడు యజ్ఞబాహుడా ద్వీపాధిపతి. ఇది ఏడు భాగాలుగా విభజితమైంది. అవి 1)సురోచన 2)సౌమనస్య 3)రమణక 4) దేవబర్హ 5)హరిబర్హ 6)ఆప్యాయన 7) అభిజ్ఞాత. ఇందలి వర్షములు 1)స్వరస 2) శతశృంగ 3)వామదేవ 4)కుముద 5)ముకుంద 6) పుష్పవర్ష 7) శతశృతి.

అందున్న నదులు 1)అనుమతి 2)సినీ వాలి 3)సరస్వతి 4) కుహూ 5)రజనీ 6)నందా 7)రాకా అనే పేర్లతో ఉన్నాయి. ఈద్వీపంలో శృతధర, విద్యాధర, వసుంధర, ఇధ్మధర అనే నాలుగువర్ణాల జనులున్నారు. వారు భగవంతుడైన సోముని వేదమయుని ఆత్మస్వరూపంగా యజిస్తారు. వారు ధ్యానించే మంత్రం. **స్వగోభిః పితృదేవేభ్యః వ్యభజన్ శుక్ల పక్షయోః అంధః ప్రజానాం సర్వాసాం రాజానఃసోమఅస్త్వతి.**

## సి. కుశద్వీపము

శాల్మలీ ద్వీపానికి రెండింతల విస్తారంతో, అంతే విస్తృతమైన ఘృతార్ణవంతో చుట్టబడిఉన్నది కుశద్వీపం. దానిలో కుశస్తంభం ఉంది. అది దేవనిర్మితము. అ స్తంభం పేరనే ఈ ద్వీపానికి కుశద్వీపమనే పేరు కల్గింది. ఆస్తంభం అగ్ని వంటి కాంతులతో దశదిశలను వెలిగిస్తుంటుంది. ఆద్వీపాధిపతి ప్రియవ్రతపుత్రుడైన హిరణ్యరేతసుడు. ఈ ద్వీపం కూడాఏడు భాగాలుగా విభజించబడింది.

1) వసుదాన 2) ధృఢరుచి 3) నాభిగుప్త 4) సత్యవ్రత 5) విప్ర 6) వామదేవ.

ఏడు వర్షములందుగల పర్వతాలు 1) బభ్రు 2) చతుశ్శృంగ 3) కపిల 4) చిత్రమాట 5) దేవానీక 6) ఊర్ధ్వరోమ 7) ద్రవిణ. ఇందలి ఏడు నదులు 1) రసకుల్య 2) మధుకుల్య 3) శృతవింద 4) మిత్రవింద 5) దేవగర్భ 6) ఘృతచ్యుత 7) మంత్రమాల. కుశల, కోవిద, అభియుక్త, కులక అనే నాల్గువర్ణాల ప్రజలు భగవంతుడైన జాతవేదుని కర్మకౌశలంతో యజిస్తారు. వారు ధ్యానించే మంత్రము. "పరస్య బ్రహ్మణస్సాక్షాత్ జాతవేదోసి హవ్యవాట్ దేవానాంపురుషాంగానాం యజ్ఞేన పురుషం యజే"

## డి. క్రౌంచద్వీపము.

ఘృతసముద్రానికి వెలుపలి క్రౌంచ ద్వీపముంది. కుశద్వీపానికన్నా రెండింతల విస్తీర్ణంగలది. సమాన విస్తీర్ణంకల్గిన దధిసముద్రంలో చుట్ట బడింది. ఇక్కడి పర్వత రాజమైన క్రౌంచపర్వతంవల్లదానికాపేరు వచ్చింది. ప్రియవ్రత పుత్రుడు ఘృతపుష్ఠుడు దీనికధిపతి. ఏడుగురు కుమారులకు ఏడు భాగాలు గా క్రౌంచద్వీపాన్ని విభజించి ఇచ్చినాడు. వారిపేర్లు ఆమోద, మధువహ, మేఘపుష్ఠ, సుదామ, ఋషిజ్య, లోహితార్ణ, వనస్పతి.

**ద్వీపము వందలి పర్వతములు** 1) శుక్ల 2) వర్ధమాన 3) భోజన 4) ఉప బర్హణ 5) ఆనంద 6) నందన 7) సర్వతోభద్ర.

**ద్వీపమువందలి నదులు** :- అభయ, అమృతౌఘ, ఆర్యక, తీర్థావతి, తృప్తిరూప, పవిత్రవతి, శుక్ల. గురు, ఋషభ, ద్రవిణక, దేవక, అనే నాల్గ వర్ణాల ప్రజలు ఆపోమయ దేవుణ్ణి యజిస్తారు. వారుపాసించే మంత్రం.

ఆపఃపురుషవీర్యాస్థః పునంతో భూరువస్సువః
తా పునంత్వమీ వఘ్నః స్పృశతామాత్మానాభువః

## ఇ. శాకద్వీపము

శాకద్వీపము 32 లక్షల యోజనముల విస్తీర్ణము, అంతే విస్తీర్ణమైన క్షీరసముద్రముతో ఆవరించబడింది. శకనామ వృక్షముతో ఈద్వీపము ఆపేరు కల్గియున్నది. ఆశాకవృక్షమునుండి వెలువడే పరిమళము దీనినంతటినీ గుభాళింపజేస్తుంటుంది. ప్రియవ్రతతనూజుడైన మేధాతిథి ఈద్వీపపాలకుడు. తన ఏడుగురు కుమారులకు శాకద్వీపాన్ని ఏడుభాగాలుగా

విభజించి ఇచ్చినాడు. వారిపేర్లు 1) పురోజన 2) మనోజన 3) వేపమాన 4) ధూమ్రానీక 5) చిత్రరథ 6) బహురూప 7) విశ్వచార.

ద్వీపంలోని గిరుల పేర్లు 1) ఈశాక 2) ఉరుశృంగ 3) బలభద్ర 4) శతకేసర 5) సహస్రస్రోత 6) దేవపాల 7) విజధృతి.

**ద్వీపంలోని చతుర్వర్ణాలు** - 1) ఋతవ్రత 2) సత్యవ్రత 3) దానవ్రత 4) సువ్రత. వారు భగవంతుడైన వాయుస్వరూపాత్ముని ప్రాణాయామము చే విధూతరజస్తమస్కులై పరమ సమాధిని చెంది ధ్యానిస్తారు. ఈమంత్రంతో యజిస్తారు.

**మంత్రం : అంతఃప్రవిశ్య భూతాని యోభిభర్త్యాత్మకేతుభిః**
**అంతర్యామేశ్వరస్సాక్షాత్ పాతునో యద్వశేయిదం**

## యఫ. పుష్కరద్వీపము

ఇది శాకద్వీపమునకు రెండింతల విస్తీర్ణంకల్గి, తత్సమాన విస్తీర్ణమైన స్వాదూదక (మంచినీటి) సముద్రంతో చుట్టబడి ఉంది. బృహత్పురుషుడైన భగవాన్ కమలాసనుడు (బ్రహ్మ) అగ్ని శిఖలవలె ప్రకాశించు వేనవేలు కనక పత్రములు కల్గిన పద్మాసనముపై అధిష్ఠించి ఈదేవి మధ్యనున్నాడు. ఈదీవిలో **మానసోత్తర** మనే పేరుగల్గిన ఒకే ఒక మర్యాదాగిరి ఉన్నది. ఇది 10వేల యోజనముల ఎత్తు, అంతే విస్తారముకల్గి ఉన్నది. ఈదీవికి నాల్గువైపుల వాల్గు లోకపాలకపట్టణాలున్నాయి. (ఇంద్ర, యమ, వరుణ, కుబేర) ఈదీవిపై మేరువును ప్రదక్షిణంచే సూర్యరథ చక్రము (సంవత్సరాత్మకం) అహోరాత్ర దేవతలతో చక్రంవలె తిరుగుతుంటుంది.

ఈద్వీపపాలకుడు ప్రియవ్రత పుత్రుడైన వీతిహోత్రనామ విభ్రాజితుడు. తన ఇర్వురు కొడుకులకు ద్వీపాన్ని పంచిపెట్టినాడు. మానసోత్తరగిరికి రెండు వైపుల రమణక, దాతక పేర్లతో ఈవర్షాలున్నాయి. అచటి ప్రజలకు చాతుర్వర్ణ విభాగం లేదు. ఈద్వీపపురుషులు బ్రహ్మను శ్రౌతపద్ధతిలో నారాధిస్తారు. వారి ధ్యానమంత్రం.

*"యత్తత్కర్మమయం లింగం బ్రహ్మలింగజనోఽర్చతి*
*భేదే నైకాంతమద్వైతం తస్మై భగవతేనమః".*

తా॥ కర్మలలో భేదమున్నా హృదయంలో (భావంలో) అద్వైతమే అనే పద్ధతి కన్పిస్తుంది. అదే **కర్మణ్యకర్మయః పశ్యేత్.**

## జి. లోకాలోక పర్వతము

లోకము - అలోకముల యొక్క అంతరాళమున చుట్టూ ఏర్పడిన పర్వతమిది. మానసోత్తర, మేరు పర్వతముల మధ్యభాగాన్ని కాంచనీభూమి (బంగారు భూమి) అంటారు. ఇది అద్దం వలె తళతళ లాడుతుంటుంది. ఈ ప్రాంతంలో ఏజీవులూ నివసించలేవు. ఈపర్వతము లోకత్రయము చివర ఉంది. ధృవుని కంటె పైవ ఎత్తుగా ఉన్నందున లోకములకు ఇదే సరిహద్దుగా ఉంది. 50 కోట్ల యోజనాల ప్రమాణం కల్గి ఉన్న భూగోళంలో ఇది ¼ వంతు భాగంగా నిర్ణయించ బడింది. ఆపర్వతంపై నాల్గు దిక్కులందు నాలుగు ఏనుగులు 1) ఋషభ 2) పుష్కర చూడ 3) వామన 4) అపరాజిత అనే పేర్లతో బ్రహ్మ దేవునిచే నిల్ప బడినాయి. అవి అన్ని లోకాలకు ఆధార భూతంగా ఉన్నాయి. ఈ పర్వత మందు మహాకాలుని పట్టణం ఉంది. అది వైకుంఠ పట్టణంతో సమానమైన మహిమకలది. ఆమహాకాల పురమందు, తన విభూతి రూపులగు మహేంద్రాదులకు వివిధ వీర్య శక్తులను ఉత్తేజ పరిచేందుకు అంతర్యామి యైన భగవంతుడు తన విశుద్ధ సత్య, ధర్మ, జ్ఞాన, మహావైరాగ్య, ఐశ్వర్యాది మహాష్టసిద్ధులకు ఉపలక్షకమైన విష్వక్సేనాదులైన పార్శ్వదులచే పరివేష్టితుడై చక్రాద్యాయుధములను ధరించి అన్ని లోకాలను పాలిస్తుంటాడు. లోకాలోకాచల పర్వత ఒహిఃప్రదేశము యోగీశ్వర గతిలో విశుద్ధమని ఉదహరిస్తారు. ఈ విధంగా భూలోక వివరాలు వివరించ బడినాయి. ఇక్కడొక విషయం గమనించ వలసి ఉంది. స్థూలదృష్టికి మనకు పైన పేర్కొన్న సముద్ర, ద్వీపాదులు కన్పించడంలేదు. జంబూ ద్వీపము, లవణసముద్రం మాత్రమే కన్పిస్తున్నాయి. మిగిలిన ఆరుద్వీపాలు, ఆరు సముద్రాలు కన్పించవు. మరి అవి లేనట్లా? కన్పించనివన్నీ లేనట్లుగా అనుకోవడం అవిచారిత రమణీయం కదా! వాటన్నంటి యోగులైన క్రాంతి దర్శులు తమ సమాహిత దృష్టితో దర్శించినారు. యోగశక్తితో సూక్ష్మ శరీరంతో ఆయా లోకాలకు వెళ్ళి రాగల్గినారు. లేకుంటే అన్ని వివరాలను ఎలా చెప్పగలరు? శ్రీగురువులు శివసచ్చిదానంద సరస్వతీ స్వాముల వారు కొద్ది మంది శిష్యులకు ఈ విద్యలను అనుభవానికి తెచ్చినట్లు తెలుస్తుంది. ఎంతో సమాహితం పొంది సంయమం చేయగల్గినవారికే ఇది సాధ్యం. అందుకే సంయమం అంటే ఏమిటో ప్రకరణ ప్రారంభంలోనే వివరించబడింది! పైన పేర్కొన్న సముద్ర, ద్వీపాలనేకాకుండా వారణాశివంటి క్షేత్రతీర్థాలను కూడా

ఈ అభ్యాసయోగ పద్ధతిలో దర్శించవచ్చు. తన శరీరంలోనే చెప్పబడిన లక్ష్యాన్ని సంయమం చేస్తే ఆయా దర్శనానుభవం కల్గుతుంది.

## 8.2. భువర్లోక విద్య

సాధకుడు తన కుక్షియందు సంయమం చేస్తే భువర్లోక జ్ఞానాన్ని (దర్శనాన్ని) పొందగలడు. ఈ లోకంలో 7 కక్ష్యలు (అంతస్థులు).

**అ) ప్రథమకక్ష్య :-** మేఘమండలం.

**ఆ) ద్వితీయ కక్ష్య:** పిశాచ, భూత, శాకినీ, ఢాకినీ, భేతాళ మండలం.

**ఇ) తృతీయ కక్ష్య:-** గుహ్యకుల మండలం సుందర రూపులు, ఖడ్గచాపధరులు, మహాబలిష్టులు, నిధుల రక్షణ వీరి బాధ్యత.

**ఈ) చతుర్థ కక్ష్య :-** గంధర్వ, చారణ మండలం. రెక్కలు గల్గి స్వేచ్ఛగా ఆకాశంలో విహరించే జాతులు సుందరులు. దేవతా గాయకులు చిత్రరథ, మహాహామాలు ముఖ్యులు.

**ఉ) పంచమ కక్ష్య:-** విద్యాధర మండలం. మంత్రతంత్ర విద్యలలో నిష్ణాతులు. స్తోత్రపాఠకులైన గాయకులు. ఈమండలంలోనే సిద్ధుల వసతి గృహాలున్నాయి.

**ఊ) షష్ఠమ కక్ష్య :-** అప్సరసమండలం. క్షీరసాగర మథనంలో పుట్టినవారు. అత్యంత లలిత, మనోహరస్ఫురద్రూపిణులు. దివ్య గంధలేపన, నిత్య పరిమళ దివ్య కుసుమ హారశోభితలు. దివ్యాభరణ విరాజితలు. దివ్య వస్త్రశోభితలు. పుణ్యవంతులకుపభోగ్యలు. సంగీత సాహిత్యాదికళా వైదుష్యం కల్గి ఉంటారు. రంభ, ఊర్వశి, మేనక, ఘృతాచి, తిలోత్తమ, మంజుఘోష, సుకేశివంటివారు ప్రసిద్ధులు.

**ఋ) సప్తమ కక్ష్య :-** రాహుమండలం. ఇతడు నీలివర్ణుడు నీల వస్త్రమాల్యాభరణ విరాజితుడు వ్యాఘ్రముఖుడు. శరీరమంతా సర్ప శరీరం. సింహ వాహనం. ఖడ్గ చర్మశూల వరాంకిత చతుర్భుజములతో గోమేధిక రత్నాభరణాలతో, శౌర్య నిధియై ప్రత్యధి దేవతలు. కృష్ణమేష వాహనమై నీల ధ్వజలాంభితమైన రథ వాహనంలో ప్రకాశిస్తూ సూర్య చంద్రులను కబళించేందుకు వేచి ఉంటాడు.

సాధక శరీరంలో ఇతడు అష్టిష్టాన దేవత. మేరు పర్వతాన్ని అపరక్షిణంగా తిరుగుతుంటాడు. బర్బర దేశాధిపుడు పైఠీనసగోత్రుడు. నైఋతి దిగ్వాసి ఈ కక్ష్య లోనే కేతు మండలం ఉన్నట్లు చెప్పబడింది. జ్యోతి శ్శాస్త్ర

సంప్రదాయాన్ననుసరించి రాహు మండలానికి సప్తమ స్థానంలో కేతు మండలం ఉంటుంది. దీన్నిట్లా సమన్వయించుకోవచ్చు. రాహు మండలి మందే మేషాది రాసుల చక్రంలో సప్తమ రాశిలో కేతు మండలం ఉంటుంది.

ఈకేతువు ధ్వజాకృతి కల్గి, గదా, వర విరాజిత బాహుద్వయుడై ఉన్నాడు. చిత్రాంబర మాల్యానులేపనుడు. వైడూర్యాభరణ భాసమానుడు. చిత్రవర్ణకపోతాలను పూన్చిన రథాన్ని అధిరోహిస్తాడు మేరువున ప్రదక్షిణంగా చుట్టుతుంటాడు. బ్రహ్మ చిత్రగుప్తులు, అధి ప్రత్యధి దేవతలు. ఇతడు మగధ దేశాధిపతి. జైమినీగోత్రజాతడు. ఆపైన సూర్యమండలముంది.

## 8.2.1. సూర్య మండలము

భగవంతుడైన ఆదిత్యుడు, కాశ్యపగోత్రుడు. కళింగదేశాధిపతి. జపాకుసుమ వర్ణంతో ఉన్నాడు. రెండు భుజములతో, పద్మాభయముద్రలు ధరించి ఉన్నాడు. సింధూర వర్ణ దివ్యాంబరదారి. మాణిక్యాభరణాలను దాల్చి ప్రకాశిస్తున్నాడు. త్రిమూర్త్యాత్మకుడు. వేదమూర్తి. అరుణ పతాకం రెపరెప లాగుతుండగా, సన్నద్ధమైన సప్తాశ్వరథారూఢుడై అగ్ని-రుద్రులు అధి, ప్రత్యధి దేవతలుగా సేవిస్తుండగా, పద్మాసనస్థితుడై ఉన్నాడు. బ్రాహ్మణ వర్ణస్థుడు. తూర్పుమొగమై ఉంటాడు. అగ్నిపిండసదృశుడు. సనాతనమైన, ఏకమైన జ్ఞానశక్తి రెండుగా మారేందుకు ఇచ్ఛయించినప్పుడు సూర్యుడనే భాస్వంతమైన పరమాత్మతేజమొకటి జగత్త్రయాలను వెలిగింపజేస్తుంది. ఆతేజంలో సమస్తసుర, సిద్ధ గణాలన్నీ స్వయంగా ఉద్భవిల్లినాయి. తేజోభూతమైన ఆయంశుతేజస్సు శరీరం ధరించి వేరుగా "రవి" అని వేదములచే కీర్తించ బడినాడు. దివా, దివసముల కారకుడు. సర్వ జగత్తుకు ఆద్యుడు కాబట్టి ఆదిత్యుడైనాడు. ఈయన అంశంతో ద్వాదశాదిత్యులు ఉద్భవిల్లినారు. జగత్తును క్రమ పరివర్తన మొనరిస్తున్నాడు. అందుకే ఈశ్వర శక్తికాలాత్మకమైంది. **సూర్య ఆత్మాజగతః తస్థుషశ్చ.**

ఆసూర్యుని రశ్ములు (కిరణములు) లలో శ్రేష్ఠతమమైనవి ఏడు. ఇవి గ్రహోలకుత్పత్తిస్థానాలు. అవి 1) సుషుమ్న 2) హరికేశ 3) విశ్వకర్మ 4) విశ్వవ్యచ 5) సమ్యగ్వసు 6) అర్వాగ్వసు 7) స్వరాట్.

1) సుషుమ్న - ఇది అడ్డముగా ఊర్ధ్వంగా ప్రసరిస్తూ (శరీరం) చల్లని ప్రకాశాన్నిస్తుంది.

2) హరికేశ - ఇది నక్షత్రాలను పోషిస్తుంది.

3) విశ్వకర్మ - బుధగ్రహాన్ని పోషిస్తుంది.

4) విశ్వవ్యచ - శుక్ర గ్రహాన్ని నిత్యం పోషిస్తుంది.

5) సమ్యగ్వసు - అంగారకగ్రహాన్ని పోషిస్తుంది.

6) అర్వీగ్వసు - బృహస్పతి గ్రహాన్ని పోషిస్తుంది.

7) స్వరాట్ - శనైశ్వరుని పోషిస్తుంది.

ఈ విధంగా సూర్య ప్రభావంతో సమస్తతారకలు, గ్రహాలు ప్రవర్ధమానమౌతాయి. సూర్యుడు ఆకాశం, భూమి లోని అన్ని ప్రదేశాలకు తన నాడీ సహస్రం ద్వారా కిరణాలను ప్రసరింపజేసి, నదుల, సముద్రాల, కూపాల, రసాన్ని ( నీటిని) గ్రహిస్తున్నాడు.

**సూర్యరశ్మిల వివరణ.**

400 ల కిరణాలు వర్షాన్ని కురిపిస్తాయి. అవి క్రింది పేర్లతో వ్యవహరింపబడుతాయి. ఛందనములు-యూహ్యాములు-కేతనములు- అహకనములు, వృష్టి సర్జనములు. ఇవన్నీ అమృత నామకములు.

మూడు వందల కిరణాలు కుకుభములు-గోవులు-విశ్వభృతములులనే పేర్లుకల్గి ఉన్నాయి. వీటన్నింటిని శుక్రములని వ్యవహరిస్తారు. ఇవి మనుష్య-పితృ-దేవతలనే మూడు జాతులను తృప్తిపరుస్తాయి. ఒక వంద కిరణాలు (కకుభములు) ఔషదములచే మనుష్యులను, మరొక వంద కిరణాలు (గోవులు) స్వధచే పితరులను, వేరొక వంద కిరణాలు (విశ్వభృతములు) అమృతముచే దేవతలను తృప్తి పరుస్తాయి.

వసంతగ్రీష్మర్తులలో మూడు వందల కిరణాలతో ప్రకాశాన్ని, హేమంత శిశరర్తులలో వర్షాన్ని కురిపిస్తాడు. సూర్యుడు. 12 నెలలల్లో 12 పేర్లతో వ్యవహరింపబడుతాడు.

| నెల | - | నామము | నెల | - | నామము |
|---|---|---|---|---|---|
| మాఘము | - | వరుణుడు | శ్రావణము | - | వివస్వంతుడు |
| ఫాల్గుణము | - | పూష | భాద్రపదము | - | భగ |
| చైత్రము | - | ధాత | ఆశ్వీజము | - | పర్జన్యుడు |
| వైశాఖము | - | తాపనుడు | కార్తీకము | - | త్వష్ట |
| జ్యేష్ఠము | - | ఇంద్రుడు | మార్గశిరము | - | భాస్కరుడు |
| ఆషాఢము | - | సవిత | పుష్యము | - | మిత్ర |

ఒక్కొక్క ఋతువులో ఒక్కొక్క వర్ణం లో ప్రకాశిస్తాడు.

వసంతం - కపిల వర్ణం గ్రీష్మం - కనకకాంతి
వర్షం - శ్వేతప్రభ శరత్తు - పాండువర్ణం
హేమంతం - తామ్రవర్ణం శిశిరం - లోహితవర్ణం (ఎర్రని)

సూర్యుని యందలి ప్రకాశ భేదములే సూర్యాదిరశ్ముల సంయోగంతో సర్వగ్రహస్వరూపాలుగా, గ్రహస్థానాలుగా ఉన్నాయి.

సూర్యతేజస్సు సూర్యునిగా, తేజోమండలంలోని సౌమ్యతేజస్సు సోమునిగా (చంద్రునిగా) శుక్ర తేజస్సే శుక్రుడుగా, లోహితమైన రక్తతేజస్సే అంగారకుడుగా; మందగతిగనున్న తేజస్సే శనిగా, మారినాయి. ఇట్లే బుధ, గురు గ్రహాలు; పీత, కనకవర్ణాలతో ఏర్పడినాయి. - వాయుపురాణం, వేదభూగోళం

ఈగ్రహాలన్నీ ధృవుని ఆకర్షణ శక్తితో నిరుద్ధములై ఉన్నాయి. ఆవాయు రశ్మి ప్రభావంతోనే ఒక క్రమంగా సూర్యునిచుట్టూ, మండుతున్న ఒకటీని చక్రంవలె వేగంగా గుండ్రంగా తిప్పినప్పుడు అగ్నిజ్వాల చక్రాకృతిగా కన్పించినట్లు, గ్రహాలన్నీ పరిభ్రమిస్తున్నాయి. ఆవాయు శక్తిని, ఈగ్రహాలను వహిస్తుంది కాబట్టి, ప్రవాహము అని పిలుస్తున్నారు. వాయువంటే "గాలి" అని అర్థంకాదు. ఒకానొక ప్రాణశక్తిగా భావించవల్సి ఉంటుంది.

## 8.2.2 సూర్యమండల సంచారము :-

సూర్యుడు దక్షిణోత్తరదిక్కులల్లో సంచరించే ప్రదేశం 108 మండలాల ప్రమాణం కల్గి ఉంది. ఆరోహణ, అవరోహణ క్రమంలో సూర్యుడు రెండు దిక్కుల సంచరించే కాలం (ఉత్తరాయనం, దక్షిణాయనం) ఒక సంవత్సరం. ఒక్కొక్క మాసంలో ఒక్కో దేవతాదిగణాలు సూర్యుని సేవిస్తుంటాయి.

1) చైత్రం :- ధాత, కృతస్థల, పులస్త్య, వాసుకి, రథకృత్, హేతి, తుంబురు.
2) వైశాఖం :- అర్యమ, పులహో, రథేజ, పుంజికస్థల, ప్రహేతి, కచ్ఛనీర, నారద.
3) జ్యేష్ఠం :- మిత్ర, అత్రి, తక్షక, రక్షస్సు, పౌరుషేయ, మేనక హాహా, రథస్వన.
4) ఆషాఢం :- వశిష్ఠ, వరుణ, రంభ, సహజాన్య, హూహూ, రథస్వన, రథచిత్ర.
5) శ్రావణం : ఇంద్ర, విశ్వావసు, స్రోత, ఏలాపుత్ర, అంగిరస, ప్రమ్లోచ, సర్ప.
6) భాద్రపదం : వివస్వాన్, ఉగ్రసేన, భృగు, ఆయూరణ, ప్రమ్లోచ, శంఖపాల, వ్యాఘ్ర.
7) ఆశ్వీయుజం: పూష, సురభి, వాత, గౌతమ, ధనుంజయ, సుషేణ, ఘృతాచీ.
8) కార్తీకం : విశ్వావసు, భరద్వాజ, పర్జన్య, ఐరావత, విశ్వాచి, సేనజిత్, ఆపము.
9) మార్గశీర్షం : అంశు, కశ్యప, తార్క్ష్య, మహాపద్మ, ఊర్వశి, చిత్రసేన, విద్యుత్.

10 పుష్యం: ఋతు, భగ, ఊర్ణాయువు, స్ఫూర్జ, కర్కోటక, అరిష్టనేమి, పూర్వచిత్తి

*11 మాఘం: త్వష్ట, జమదగ్ని, కంబళి, తిలోత్తమ, బ్రహ్మోపేత, యుతజిత్, ధృతరాష్ట్ర*

*12 ఫాల్గుణం: విష్ణు, అశ్వతర, రంభ, సూర్యవర్చ, సత్యజిత్, విశ్వామిత్ర, యజ్ఞోపేత.*

పైన తెల్పిన ఏడు జాతుల, గణముల నాయకులు 12 మాసాలలో ఉన్నారు. విశేషంగా ద్వాదశాదిత్యులు ఒక్కొక్కరు ఒక్కొక్కమాసంలో రథంపై ఉంటారు.

ఈ ఏడు గణముల అధిపతులు మహావిష్ణు శక్తి చే నియమింపబడినవారై సూర్యుని సేవిస్తుంటారు. మునులు స్తుతులతోను, గంధర్వులు గానములతోను, అప్సరసలు నృత్యముతోను, యక్షులు, సర్పగులు, సేవలతోను, రాక్షసులు రథ పరికరములు వహించుటలోను, వాలఖిల్యాదులతో పరివేష్ఠించబడిన స్వామిని సేవిస్తుంటారు. ఈసప్తగణాలు మంచు - వేడి - వర్షము ప్రసాదించడంలో సూర్య భగవానునకు సహకారులుగా ఉన్నారు. -విష్ణుపురాణం - 2 అంశ - 10 వ అధ్యాయం.

## 8.2.3 సూర్య మండల పరిమాణము

సూర్యచంద్రులెంతవరకు తమకాంతికి కిరణములచే ప్రకాశం గల్గించుచు చరించెదరో; సప్తసముద్రాలు, సప్తద్వీపాలు అంతవరకు విస్తరించి ఉన్నాయి. భూమండలం ఆవిస్తారంలో అర్ధముంటుంది. భూమండలం చుట్టుకొల్తి ప్రమాణమెంతో సమానంగా చంద్ర మండలం, దానితో సమానంగా స్వర్గ మండలం ప్రమాణం ఉంది. ఈమూడు లోకాలను తన సంచారంతో, తక్షణమే ప్రకాశింపజేయుచు రక్షిస్తాడు కాబట్టి ఆదేవుడు "రవి" యని ఖ్యాతి చెంది ఉన్నాడు.

**చంద్రసూర్యుల ప్రమాణాన్ని భూమి ఆధారంగా వివరిస్తాం కాబట్టి భూమిని గొప్పదైనదనే అర్థంలో "మహీ" అని పిలుస్తారు. (నిపాతము).**

భారత వర్షవృత్త విష్కంభ విస్తారంతో సమానంగా సూర్యమండలం ఉంది. (తొమ్మిదివేల యోజనములు) దానికి మూడింతల విస్తారంతో పరివేషం వంటి కాంతివలయం విస్తరించివుంది. విష్కంభమండలం కంటె చంద్రమండలం రెండింతలుంది.

సూర్యుడు, మానసోత్తరగిరి ఉత్తరంవైపు లోకపాలురునల్వురు లోకరక్షణార్థమునియమితులై ఉన్నారు. ఆలోకములను హద్దులుగా చేసుకొని, జ్యోతిశ్చ క్రాన్నంతటినీ తన వెంట ఆకర్షించి తీసుకొనిపోతూ, దక్షిణం నుండి

ధనుస్సునుండి విడువబడిన బాణంవలె, దివ్వస, వేగంగా నిత్యం సంచరి స్తుంటాడు. తూర్పున ఇంద్రపురి అమరావతి - దక్షిణమున యమపురి సంయమని- పశ్చిమాన వరుణపురి సుఖపురి- ఉత్తరమున కుబేరపురి విభావరి- ఉన్నాయి. ఈపేర్లతో ఉదయాస్తమాలు తెల్పబడుతున్నాయి.

తూర్పున అమరావతిలో సూర్యుడు మధ్యాహ్నకాలంలో ఉన్నప్పుడు, దక్షిణాన సంయమనీ పురంలో ఉదయ కాలం; పశ్చిమాన గల వారుణీ పురంలో అర్ధరాత్రౌతుంది.

సుఖపురియందు దయించునప్పుడు, ఉత్తరాన విభావరిలో అర్ధరాత్రి, అమరావతిలో అస్తమయమవుతుంది. ఆసమయంలో దక్షిణాగ్నేయు ప్రాంతీయులకు అపరాహ్ణము. దక్షిణనైఋతి ప్రాంతీయులకు పూర్వాహ్ణము. విభావరి ప్రాంతానికి అపరాత్రము. ఈశాన్య ప్రాంతంలో పూర్వరాత్రం. ఇది దక్షిణాయనంలోని సూర్యగమనం. ఉత్తరాయణంలో సుఖపురిలో మధ్యాహ్నమైనప్పుడు, విభావరిలో ఉదయమవౌతుంది. అమరావతిలో అర్ధరాత్రి, సంయమనిలో అస్తమయకాలమవౌతుంది. అమరావతిలో ఉదయమైనప్పుడు సంయమనిలో అర్ధరాత్రి, సుఖపురిలో అస్తమయమౌతుంది.

ఈవిధంగా సూర్యుడు అలాతచక్రం వలె గగన మందు తిరుగుతూ, నక్షత్రాలను చుట్టి వచ్చునట్లు కన్పిస్తాడు. నాల్గుద్వీపమునలో దక్షిణాంత గతిచే వయనిస్తూ, ఉదయాస్తమయ గతిచే సూర్యుడు కన్పిస్తాడు.

సూర్యుని ఉదయాస్తమయాలచేతనే తూర్పుమొదలైన దిక్కులు చెప్పబడినవి.

## 8.2.4 శింశుమారచక్రంలోని నక్షత్రవీధులు :-

అశ్విని మొదలుకొని మూడు, మూడు నక్షత్రాలు ఒకవీధిగా ఉన్నాయి.

| | |
|---|---|
| అశ్వని, భరణి, కృత్తిక, నాగవీధి - | మూడువీధుల |
| రోహిణి, మృగశిర, ఆర్ద్ర, గజవీధి - | సమష్టినామము |
| పునర్వసు, పుష్యము, ఆశ్లేష, ఐరావతవీధి | ఐరావతవీధి. |
| మఖ, పుబ్బ, ఉత్తర, ఆర్షభవీధి | మూడు వీధుల |
| హస్త, చిత్త, స్వాతి, గోవీధి | సమష్టినామము |
| విశాఖ, జ్యేష్ఠ, అనూరాధ, జరద్గవవీధి | జరద్గవవీధి. |
| మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, అజవీధి | మూడు వీధుల |

|  |  |
|---|---|
| శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, మృగవీధి | సమష్టినామము |
| పూర్వాభాద్ర - రేవతి - వైశ్వానరవీధి. | వైశ్వానరవీధి. |

ఉత్తరాయణంలో ఉత్తరవీధి మధ్యలో సంచరిస్తాడు. దక్షిణాయనంలో దక్షిణవీధి వెలుపల సంచరిస్తాడు. దక్షిణోత్తరమార్గములకు మధ్యనున్న విస్తార్ణము 1,00,321 వేల యోజనాలు. సూర్యమండల విష్కంభము (మధ్య నిడివి) 9,000వేల యోజనాలు. చుట్టుకొలత 27,000 వేల యోజనాలు. చంద్రమండల మధ్య విస్తార్ణము 18,000 వేల యోజనాలు. చుట్టుకొలత 54,000 వేల యోజనాలు. దక్షిణాయనంలో సూర్యగతి (శ్రీఘ్రుంకాబట్టి) 14 ముహూర్తముల 28 ఘడియలు. ఉత్తరాయణంలో సూర్యగతి (మందం కాబట్టి) 16 ముహూర్తములు 32 ఘడియలు.

**పుష్కర ప్రదేశము:**-లోకాలోకా పర్వతానికి ఉత్తరాన, వైశ్వానర వీధికి వెలుపల నున్న ప్రదేశం పుష్కర ప్రదేశం, సూర్యుడు ఈ ప్రాంతానికి దక్షిణ వీధి యందున్నప్పుడు సూర్యకాంతి ప్రసరిస్తుంది.

లోకాలోక పర్వతము 10,000 వేల యోజనముల ఎత్తుంటుంది. సూర్యుడు పుష్కర ద్వీపమధ్యలో ఉన్నప్పుడు భూమి యందు రాత్రి, పగలు సమానంగా ఉంటాయి. దక్షిణాయనమున దక్షిణ దిశయందు సూర్యగతి ప్రతి దినము 9,01,45,000 యోజనాలు. ఉత్తరాయణమున 3,01,21,000 యోజనాలు. ఈరెండింటిమధ్యలో సమగతినే విషువ కాలంగా పిలుస్తారు. ఈకాలంలో సూర్యుడు గోమేధిక ద్వీపంలో ఉంటాడు. విషువ స్థాన మండలం 3,01,20,000 యోజనములు ప్రమాణం కల్గి ఉంది.

**సూర్యోదయాస్తమయములు:**-సూర్యుని కిరణాలు ముందు బాగంలో, వెనుక భాగంలో, ఇరుప్రక్కల కనిపించే ప్రదేశంలో ఉదయకాలం; కిరణములు కన్పించని ప్రదేశంలో అస్తమయకాలంగా వ్యవహరించబడుతుంది.

శ్లో|| నైవాస్తమయ మర్కస్య నోదయ స్సర్వ వాసితః
ఉదయాస్త మయాఖ్యంహి దర్శనాऽదర్శనం రవేః

పుష్కరమధ్యభాగంలో సూర్యుడున్నప్పుడు భూమి యొక్క (త్రింశత్) ముప్పదవభాగము (1/3) ఒక ముహూర్తకాలంలో కన్పిస్తుంది. 1,30,000 యోజనాల గమనము ఒక ముహూర్తకాలంగా లెక్కించబడు తుంది. అహోరాత్రకాలంలో (ఒకరాత్రి, ఒకపగలు) సూర్యుడు సంచరించుదూరం 9,01,00,045 యోజనములు. ఇది వరలో తెలిసిన

తవీధుల ననుసరించి దిక్కులమధ్యదూరం 30,00,333 యోజనాలు. ోత్తర దిగ్రేఖల అంతరం 72,000 యోజనాలు. సూర్యుడు ాబాహ్యమందు ప్రతీచీదిక్కులో 900 మండల ప్రమాణంలో చరిస్తాడు. ్య విష్కంభ మండల ప్రమాణము18,058 వేల యోజనాలు. సూర్య ండలం పైన చంద్రమండలం.

## 8.2.5. చంద్ర మండలం

సూర్యమండలానికి లక్షయోజనాలపైన చంద్రమండలముంది. ఇది ర్యునికన్నా రెండింతల పరిమాణముతో ఉంది. ఆమండలంలో ుడు గోక్షీరమువలె, ధవళాంగములతో అతి సుందరాకారుడై, ాజుడై, గదా, వరహస్తయుతుడై, శుక్లమాల్యానులేపనుడై, సర్వావయవము ం ముత్యాభరణ భూషితుడై లోకాలనన్నీ ఆప్యాయన మొనరిస్తున్నాడు. తెల్లని పదిగుర్రాలను పూన్చిన మణిమయరథమునధిరోహించి ువును ప్రదక్షిణ స్తుంటాడు. ఆరథానికి మూడుచక్రాలున్నాయి. ( నీరు),గౌరి అధి, ప్రత్యధి దేవతలుగా చంద్రుణ్ణి సేవిస్తుంటారు. లు, పితరులు, దేవపితృయానము నాశ్రయించిన ఉపాసకులు ఆరథము వసించి ఉంటారు. అశ్విన్యాది 27 నక్షత్రాలు చంద్రునిభార్యలు. వీరు ులు ధరించి చంద్రుని సేవిస్తుంటారు. ఆపై నక్షత్రమండలం.

**నక్షత్రమండలం :-** చంద్రమండలంపైన లక్షయోజనముల రంలో నక్షత్రమండలం ఉంది. నక్షత్ర గణాలన్నీ సుకృతలోకాలు. జోరూపాన్ని ధరించి నక్షత్రాలైప్రకాశిస్తున్నాయి. తమతమ పుణ్యకర్మల ంతచిత్తులైన వారు, ఇంద్రియాలను జయించినవారు, ఋజువర్తనులైన , సత్యవ్రతాను ష్ఠానచణులైనవారు, సర్వప్రాణిగత దయార్ద్రభావ ులు, సర్వాత్మనా బ్రహ్మనిష్ఠులై ఉన్నవారు, లోకపూజ్యులు, వీరంతా త్మలై, యోగయుక్తులై తపోజ్జ్వలులై నక్షత్రమండలం చేరి స్తున్నారు. -కూర్మపురాణం.

**బుధమండలం :-** నక్షత్రమండలంపైన రెండు లక్షల యోజనాల ంలో బుధమండలం ఉంది. బుధుడు సౌమ్యాకృతికలవాడు. ఇతనికి ుడనే నామముంది సర్వజ్ఞానముల స్వరూపము. ఆత్రేయసగోత్రుడు. మగధ పతి. కుంకమవర్ణదేహం గలవాడు. ఖడ్గ, ఖేట ధారియై, పచ్చనిమాల్యాను ులు, మకర తమణులు ధరించి ప్రకాశిస్తుంటాడు. నాల్గు సింహాలు

పూన్చిన, పీత ధ్వజశోభితమైన, రథమునందధివసించి ఉన్నాడు. విష్ణు, నారాయణులు అధిదేవత ప్రత్యధిదేవతలు. బాణాకార పీఠము నందధివసించి, ఉదఙ్ముఖుడై దర్శనమిస్తాడు.

**శుక్రమండలం:-** బుధమండలానికి రెండు లక్షల యోజనాల దూరంలో శుక్ర మండలం ఉంది. భార్గవుడు రాక్షసగురువు. భార్గవగోత్రుడు. భోజకటాకాధిపతి. రజతోజ్జ్వల వర్ణమైన శరీరకాంతి కలవాడు. చతుర్భుజుడు. దండ, కమండలు, అక్షసూత్ర, వరద ముద్రలు ధరించి, తెల్లని పట్టుపుట్టములు ధరించి ఉంటాడు. శ్వేతమాల్యధారి. శుక్రుడు సమస్తనీతి శాస్త్ర నైపుణ్యంతో విరాజిల్లుతున్నాడు. తెల్లని ధ్వజంతో తెల్లని గుర్రాలను పూన్చిన రథాన్నిధివసించి మేరువును ప్రదక్షిణక్రమంగా తిరుగుతున్నాడు. ఇంద్ర, ఇంద్రాణీ దేవతలు ఆధిదేవత, ప్రత్యధిదేవతలు. ప్రాఙ్ముఖుడై పంచ కోణపీఠమునందధివసించి ఉండును.

**అంగారకమండలం :-** శుక్రమండలంపైనరెండు లక్షల యోజనముల దూరంలో ఉంది అంగారకమండలం. అగ్నివలె ఎర్రని ఆకృతికల్గి ఉన్నాడు. భరద్వాజసగోత్రుడు. అవన్తిదేశాధిపతి. అగ్నిజ్వాలా పుంజమువలె ప్రకాశిస్తుంటాడు శక్తి, శూల, గదా, ఖడ్గములను ధరించి, ఎర్రని పగడములు తాపిన దివ్యాభరణాలను ధరించి రక్తమాల్యాంబరధారియై, దుర్నిరీక్ష్య తేజంతో, ఎర్రని మేకలను పూన్చిన రథంపై అధిరోహించి మేరువును ప్రదక్షిణంగా చుట్టుతుంటాడు. ఆధి దేవత, ప్రత్యధి దేవతలు భూదేవి, స్కందులు. దక్షిణాభిముఖుడై త్రికోధిపీఠాసనుడై విరాజిల్లును.

**బృహస్పతి (గురు) మండలం :-** అంగారకమండలానికి రెండులక్షల యోజనాలు దూరంలో పైభాగాన గురుమండలం ఉంది. బృహస్పతి సర్వదేవతాచార్యుడు. అంగీరసగోత్రుడు. సింధుదేశాధిపతి. తప్తసువర్ణ శరీరకాంతితో ప్రకాశిస్తుంటాడు. దండ, కమండలు, అక్షసూత్ర, వరద హస్తములు చతుర్భుజములలో, పీతాంబరమాల్యాను లేపనుడై, పుష్యరాగ మణిస్థగిత దివ్యాభరణ విరాజితుడై సమస్త విద్యలకు అధిపతిగా ఉన్నాడు. ఆధిదేవత ప్రత్యధిదేవతలు ఇంద్ర, బ్రహ్మలు. మేరువును సవ్యంగా ప్రదక్షిణిస్తున్నాడు. ఉదఙ్ముఖుడై దీర్ఘచతురస్ర పీఠమున విరాజిల్లు తుంటాడు.

**శని మండలం :-** గురు మండలంపైన రెండు లక్షల యోజనముల దూరమున శని మండలం ఉంది. శని భాస్కరతనయుడు. కాశ్యపగోత్రుడు. సౌరాష్ట్రదేశాధిపతి. కాటుకవలె నల్లని వర్ణం కల్గిఉంటాడు. చతుర్భుజుడై చాప,

తూణీర, కృపాణ, అభయ ముద్రలను ధరించి ఉంటాడు. నీలాంబర మాల్యాను లేపనము ధరించి, ఇంద్రనీలమణులంపొదిగిన దివ్యాభరణ ధారియై, తన భీషణానుర్షణములతో సమస్తలోకాలను భయపెట్టు తుంటాడు. నీలధ్వజపతాకాభివామమైన నీలగృధ్రములచే సన్నద్ధమైన రథాన్నెక్కి మేరువును ప్రదక్షిణిస్తుంటాడు. అధిదేవత ప్రత్యధి దేవతలు ప్రజాపతి, యముడు. ప్రత్యఙ్ముఖుడై చాపాకార (ధనురాకారం) పదము నధివసించి ఉంటాడు.

**సప్తర్షిమండలం :–** శనిమండలంపైన ఏకాదశ (11) లక్షల యోజనముల దూరంలో ఋషిమండలం ఉంది. అధ్యాత్మ దర్శనవిద్యలో సప్తర్షి సందర్శనము తీర విద్య అని చెప్పబడింది. ఇది బృహదారణ్యకోప నిషత్తులోనిది. మనశరీరంలోని చెవులకు, ముక్కుకు ఉన్న రంధ్రములపై భాగమున సమీపమున అడుగున చతురస్రమగు లక్ష్యము శ్రోత్రాది ఇంద్రియాలకు తీరములుగా ఉన్నాయి. వాటియందు క్రమంగా లక్ష్యముంచి సమాహితం చేస్తే సప్తఋషుల దర్శనమౌతుంది. ఇంద్రియప్రవాహాలకు అవి తీరాలు. వీటినే **ప్రాణములని** పిలుస్తారు.

**తీరవిద్యాక్రమము :–**

దక్షిణోత్తరకర్ణతీరములందు — 1) గౌతమ - 2) భరద్వాజ.

దక్షిణోత్తరచక్షువులందు — 3) విశ్వామిత్ర 4) జమదగ్ని

దక్ష, వామనాసాపుటలందు — 5) వసిష్ఠ 6) కాశ్యప

వాక్ (జిహ్వా) తీరము — 7) అత్రి.

తినుట అనే క్రియలో, మాట్లాడే క్రియలో ఏ అభ్యాసి ఈతీరవిద్యలో ప్రాణాయామాధ్యాత్మ్యమును తెల్సుకుంటున్నాడో, అతడు ఎప్పుడూ భోక్తగానే ఉంటాడు కానిభోజ్యంకాడు. సప్తర్షుల దర్శనమీవిధంగా ఉంటుంది.

1) **కశ్యపుడు :–** జటాజూటమండల ధారి. భస్మభూషితాంగుడు వల్కలాజినములను ధరించి, కౌపీనముతో ఉన్నాడు. గొడుగు, దండము, దర్భలు, ఉత్తరీయములు ధరించి, ధర్మపత్నితో ఉన్న కశ్యపుని ధ్యానించ వలెను.

2) **అత్రి :–** మరీచిప్రజాపతిపుత్రుడు. అక్షసూత్ర కమండలుధారి. శాంతమూర్తి. పతివ్రతాతిలకమైన అనసూయతో ఉన్నాడు. నిష్కల్మషుడు.

3) **భరద్వాజ :** మహాశాంతుడు. సుశీలాపతి. బలిష్ఠుడు. అక్ష దండ హస్తుడు.

**4) విశ్వామిత్ర :-** జటామండల విభూషితుడు. హిరణ్యగర్భ సంభూతుడు. కుముద్వతీభర్త.

**5) గౌతమ:-** రహూగణుని కుమారుడు. శాంతుడు. ఫాలమున త్రిపుండ్రములు ధరించి విరాజిల్లుతున్నాడు. అక్ష, స్రగ్, కుండలములు, దండము ధరించి ఉంటాడు.

**6) జమదగ్ని :-** ఇంద్రియ జయంతో దాంతుడై, కామక్రోధాది అరిషడ్వర్గాలను జయించినవాడు. దండ, సూత్ర, అక్షమాలను ధరించి ఉంటాడు.

**7) వశిష్ఠ :-** తపోనిధి, దయాసింధువు. బ్రహ్మణ్యుడు , బ్రహ్మ మానసపుత్రుడు. అక్షమాల, దండ, వరద, కమండల హస్తుడైనొప్పారును.

**అరుంధతి :-** స్మరణ మాత్రంతోనే భక్తుల సర్వపాపాలను పోగొట్టే పరమపావని. సూక్షములో సూక్ష్మతరమైన జ్యోతి. దర్శనమాత్రాన పుణ్యాలనిస్తుంది. ధ్యానము "అమ్మా! నీవు పతివ్రతలలో అగ్రగణ్యువు. సౌమంగల్య సుఖాలనిచ్చే శక్తివి. బ్రహ్మశక్తివి వశిష్ఠమహర్షికి ఏకైక కుటుంబినివి. ఓనిత్యకళ్యాణీ! నాకు పావనత్వాన్ని, సౌభాగ్యాన్ని, శాశ్వత సుఖాన్ని, నిత్యానందాన్ని ప్రసాదింపుము."

## 8.2.6. ధ్రువమండలం :- (ఇదేశింశుమారము)

అరుంధతీ - సప్తర్షిమండలంపైన 30 లక్షల యోజనముల దూరంలో ధృవమండలం ఉంది. శింశుమారము అనే చెప్పబడిన స్థానమే ధృవమండలం. ధృవుడుండే స్థానమే శింశుమారం. శింశుమారమునాశ్రయించి ఉన్న తీరును దర్శించిన వారికి, ఏపూటపాపం ఆపూట నశిస్తుంది. అక్కడున్న తారలసంఖ్యతో సమానమైన సంవత్సరముల ఆయుస్సు అధిమౌతుంది.

శ్రీమహావిష్ణువు యొక్క స్థూలశరీరంగా ఈమండలం పేర్కొన బడింది. ఉత్తానపాదపుత్రుడు చెంపపైభాగము; యక్షుడు చెంప క్రింది భాగము; శిరోభాగము ధర్ముడు; హృదయము నారాయణుడు ; అశ్వినులు పూర్వపాదములు; వరుణుడు తొడలు; సంవత్సరము శిశ్నము; మిత్రుడు అపానము; తోకయందు అగ్ని; అధ్యక్షుడు మహేంద్రుడు ; శింశుమారం యొక్క తారకలు కశ్యపుడు, ధృవుడు. పర్వత సముద్రాలతో గూడిన వసుంధర పద్మాకారంలో ఉంది. తారకలు, భువనములు, వనములు, సముద్రములు, దిక్కులు. సర్వంవిష్ణువే! **సర్వం విష్ణుమయం జగత్!**

ఆవిష్ణువు జ్ఞానస్వరూపమై అనేక రూపులుగా కనిపిస్తాడు. కాని వస్తుభూతుడు కాదు. విజ్ఞానం చేత విజృంభితములైన భూమి, సముద్రాలు, పర్వతాలు మొదలైన నామరూపభేదాలు కన్పిస్తున్నాయి. ఎప్పుడు సమస్త కర్మ దోషవాసనలు నశించి, నిత్య శుద్ధబుద్ధమైన స్వరూపము అనుభవమౌతుందో, అప్పుడు సంకల్ప తరుఫలాలైన వస్తుభేదాలు, జ్ఞానరూప వస్తువులేనని అనుభవమౌతుంది.

భూమి, అందులోని మన్ను, ఘటత్వాన్నొంది; తిరిగిపగిలి పెంకులుగా, అవీచూర్ణమైనప్పుడు ఆదుమ్ములో అణువు, ఆ అణువుగూడ అదృశ్యమైన మార్పు; ఇదంతా ఆత్మనిశ్చయజ్ఞానం కల్గినవారికి ఒకే వస్తువుగా భాసిస్తుంది.-విష్ణుపురాణం. కొందరు ఈజ్యోతిశ్చక్రాన్ని కుం[illegible] దేహుడైన భగవంతుడు వాసుదేవుని నిద్రాణస్థితిగా పేర్కొంటారు.

## శింశుమారము – ధృవుడు

శింశుమారము మత్స్యాకారంలో ఉంది. పైభాగము పుచ్ఛము(తోక) క్రింది భాగము ముఖమువలె ఉన్నది. దాన్ని మేషాదిరాసులుచుట్టి ఉన్నాయి. ఈరాసులు, గ్రహముల కక్ష్యల వరుసలు ఒకదానికొకటి ఎదురుగా ఉన్నాయి. శింశమారం గతి చేతనే రాశులు తిరుగుతున్నాయి. రాశులంటే 27 నక్షత్రాల లోని 12 భాగాలే!

శింశుమార పుచ్ఛాగ్రంలో ధృవుడు అమరి ఉన్నాడు. ఆతోకలో ప్రజాపతి, అగ్ని, ఇంద్రుడు, ధర్ముడు ఉన్నారు. తోకమొదలులో ధాత- విధాత; కటిలో సప్తర్షులుండి, దక్షిణావర్తమైన శరీరంతో గుండ్రంగా ఉన్న శింశుమారానికి దక్షిణంవైపుండే ఉదగయనములైన నక్షత్రాలను కల్పిస్తుంటారు. అవిఅభిజిత్ మొదలు పునర్వసువరకు. సవ్యపార్శ్వన పుష్యమి మొద్లలు ఉత్తరాషాఢ వరకు. ఇవి దక్షిణాయన నక్షత్రములు.

మండలాకారంలో ఉండే ఈశింశుమార సన్నివేశానికి ఇరువైపుల అవయవములు సమానంగా ఉన్నాయి. పృష్ఠభాగంలో అజవీధి - ఉదరంలో ఆకాశ గంగ.

| కుడివైపు | – | అవయవము | – | ఎడమ వైపు. |
|---|---|---|---|---|
| పునర్వసు | - | ఉదరం | - | పుష్యమి |
| ఆర్ద్రా | - | పిఱుదులు | - | ఆశ్రేషా |
| అభిజిత్ | - | పాదాలు | - | ఉత్తరాషాఢా |

| | | | | |
|---|---|---|---|---|
| శ్రవణం | - | నాసిక | - | పూర్వాషాఢ |
| ధనిష్ఠ | - | కన్నులు | - | మూల |
| | | చెవులు. | | |
| శతభిషం | - | భుజములు | - | జ్యేష్ఠ |

మృగశిర నుండి 8నక్షత్రాలు - ప్రక్కటెముకలు- ముఖనుండి 8 నక్షత్రాలు

## వివిధావయవాలలో నుండే దేవతలు :-

| | | |
|---|---|---|
| అగస్త్యుడు | - | చెక్కిలిపైభాగం |
| యముడు | - | చెక్కిలిక్రిందిభాగం |
| అంగారకుడు | - | ముఖము |
| శని | - | ఉపస్థ |
| బృహస్పతి | - | మూపురం |
| ఆదిత్యుడు | - | వక్షము |
| నారాయణుడు | - | హృదయము |
| చంద్రుడు | - | మనస్సు |
| శుక్రుడు | - | నాభి |
| అశ్వినీదేవతలు | - | స్తనములు |
| బుధుడు | - | ప్రాణాపానములు |
| రాహువు | - | కంఠము |
| కేతువు | - | సర్వాంగములు |
| తారాగణములు | - | రోమములు. |

శింశుమారచక్రరూపుడైన భగవంతుని ఉభయసంధ్యలందు వాగ్యతుడై నియతుడై శ్రద్ధతో లేచినిల్చుండి, నిరీక్షిస్తూ ఉపస్థానం చెప్పుసమయంలో క్రింది మంత్రాన్ని స్మరించవలె. **"నమోనమో జ్యోతిర్లోకాయ, కాలాయ నాయ, అనిమిషాం పతయే మహాపురుషాయ అభిధీమహి"**

ఈవిధంగా గ్రహతారామయమైన అధిదైవికస్వరూపమును ఎవ్వరు త్రికాలాలలో నమస్కరిస్తారో, వారికితత్కాల జన్యమైన పాపం వెంటనే నశిస్తుంది. - భాగవతం - నవస్కంధం - 23 వ అధ్యాయం.

## 8.3. సువర్లోకము

సాధకుడు తన హృదయంలో సంయమం చేస్తే సువర్లోక (స్వర్లోక) జ్ఞానం కల్గుతుంది. ఈసందర్భంలో ఒక విశేషాన్ని గమనించడం ఎంతైనా అవసరం. నాసాగ్రములో సంయమం చేస్తే ఇంద్రలోకజ్ఞానం కల్గుతుందని

శాండిల్యోపనిషత్ చెప్తుంది. ఊర్ధ్వలోకములు 7(ఏడు)(భూలోక, భువర్లోక, సువర్లోక, మహర్లోక, జనలోక, తపోలోక, సత్యలోకములు) సాధకుడు తనశరీరంలోని నాభిస్థానం మొదలు మూర్ధస్థానం వరకు ఏడుచోట్ల సంయమం చేస్తే దర్శనమౌతాయని యోగాచార్యులు నిర్ణయించినారు.

సువర్లోకములోని ఇంద్రాది అష్టదిక్పాలకలోకాల దర్శనం నాసిక గ్రం నుండి పైభాగాలలో సంయమం చేసినప్పుడు సిద్ధిస్తుందని చెప్పబడింది. ఈరెండు పద్ధతులను సమన్వయపర్చుకోవల్సి ఉంది. స్థూలశరీరస్థానాలు విడివిడిగానున్నట్లు సూక్ష్మశరీరంలో ఉండవు. శాఖాచంద్రన్యాయంగ ఏర్పరచుకోవల్సి ఉంటుంది. యోగాచార్యులచే చెప్పబడిన సూచనలను పాటించడమే సాధకునివిధి. స్థిరసంకల్పుడైనప్పుడు విజయం తథ్యం.

**స్వర్గలోకము :-** స్వర్గనివాసులు ఆరువిధములుగా ఉన్నారు **1) త్రిదశులు 2) అగ్నిష్వాత్తులు 3) యామ్యులు 4) తుషితులు 5) అపరినిర్మిత వశవర్తులు 6) పరినిర్మిత వశవర్తులు. వీరంతా సిద్ధ సంకల్పులు అణిమాది అష్టైశ్వర్య సంపన్నులు. కల్పాయుష్కులు. బృందారకులు. కామభోగులు. మరియు ఔపవాహిక దేహులు (తేజోమయశరీరులు) ఉత్తమ వర్చస్వినులైన అప్సరసలతో భోగిస్తుంటారు.**

స్వర్గంలో ఇంద్రసభ మహారమణీయమైనది. నందనోద్యానము, ఆకాశ గంగాతీరంలో దేవతలవిహారాలు సర్వం నయనానందకరమే. అప్సరసల సంగీత నృత్యగీతా విలాసాలు మనోహరాలు. ఈదేహపాతాంతరము మానవులు, పుణ్యాత్ములైనప్పుడు, స్వర్గసుఖాలననుభవిస్తారు.కర్మిష్ఠులు, యుద్ధాలలో వీరమరణం పొందిన యోధులు పొందే స్వర్గసుఖాలను భారతాదులలో వివరించినారు. లోకవిద్యను సాధించిన యోగులు స్వతంత్రులై ఆలోకాలలో సంచరించి తెల్సుకుంటారు. స్వర్గాది పుణ్యలోకాలు కల్పితాలని చెప్పే మాటలు అవిచారిత రమణీయాలు.

## 8.3.1. అష్టదిక్పాలకలోకములు

### అ) ఇంద్రలోకము :-

నాసికాగ్రంమీద లక్ష్యముంచి, సంయమం చేస్తే ఇంద్రలోకానికి దారిఏర్పడుతుంది. ఇంద్రసభను, అందరి దేవర్షులు, బృహస్పతి, వంటి వారిసరసన కూర్చునేందుకు, గురుపుత్రులైన యోగులకు కొన్ని ఆసనాలు ఏర్పరచబడి ఉన్నాయి. ఆలోకమర్యాదననుసరించి వ్యవహరించిన వారు,

వారికి ప్రియులు. అంటే ముఖస్తుతులకు ప్రాధాన్యతనివ్వరు. తమ హృదయాలలో స్థానం సంపాదించిన వారినే ప్రియంగా చూస్తారు. యజ్ఞాదులలో ఇంద్రాదులను మంత్రాలద్వారా ఆహ్వానించి, హవిర్భాగాలనిచ్చే కర్మిష్ఠులను ప్రియంగా చూచి, కర్మఫలమైన స్వర్గాది పుణ్య లోకాలను ప్రసాదిస్తారు. (మరణించిన తర్వాత) కాని యోగాభ్యాసకులకు, సాధనలో పరిపాకం చెందిన వారికి, ఈలోకంలో ఈ స్థూల శరీరంతో జీవిస్తున్నప్పటికి, సూక్ష్మశరీరంతో స్వర్గాది లోకాలకు రాకపోకలు జరుగుతుంటాయి.

ఈలోకాల వర్ణనలన్నీ మనపురాణాలల్లో విస్తృతంగా మనోహరంగా వివరించబడినాయి. ఆయాగ్రంథాలను పరిశీలించవచ్చు.

**అ) అగ్నిలోకము :-** అభ్యాసి తన ముఖమునకు ముందుభాగాన సంయమంచేస్తే అగ్నేయలోక దర్శనమౌతుంది. అగ్ని, యజ్ఞాదులలో వర్ణించబడిన రూపముదాల్చి దర్శనమిస్తాడు. శ్రౌతస్మార్త పద్ధతులలో అగ్నిని ఉపాసించే వారు, అధ్వర్యులు, హోతలు, ఉద్గాతలు మొదలైన వారంతా ఈ లోకంలో ఉంటారు. అగ్నికి సంబంధించిన పుణ్యకార్యాలొనర్చినవారు (శవదహనాలకు కట్టెలనిచ్చే వారు, జనులను చలిబాధ తీర్చేందుకు అగ్నిని మండించే వారు మొదలైన వారు) అగ్నిలోకంచేరి, అక్కడిభోగాలనను భవిస్తుంటారు.

**ఇ) యమలోకము :-** గరుడ పురాణంలో యమలోకవర్ణన విస్తారంగా ఉంది. దక్షిణ కర్ణము(కుడిచెవి)నందులక్ష్యముంచి సంయమ మొనరిస్తే యమలోకానికి దారి ఏర్పడుతుంది. ఈలోకాధిపతి యమధర్మ రాజు. ప్రశాంతమూర్తిగా దర్శనమిస్తాడు. న్యాయనిర్ణేతగా తన ధర్మాసనంనుండి పాప, పుణ్యకర్మలను విచారించి తగిన తీర్పులు, శిక్షలు విధిస్తాడు. వారికి తగిన సద్గతి లేక దుర్గతి నిర్ణయిస్తాడు. ఈ లోకానికి దక్షిణ దిశలో నరకముంది. పశ్చిమ దిశలో జాపకులు(జపం విశేషంగా చేసి సిద్ధి చెందినవారు) నివసిస్తున్నారు. పూర్వోత్తర దిక్కులలో పుణ్యభూములు ఉన్నాయి.

**ఈ)నైఋతి లోకం :** అభ్యాసి తన దక్షిణకర్ణము వెనుకభాగంలో సంయమం చేస్తే, ఈలోకానికి దారి ఏర్పడుతుంది. ఈలోకాధిపతి నిరృతి అనే రాక్షసుడు. శాంతస్వరూపుడు. గురుపుత్రులగు యోగులను సత్పు రుషులను గౌరవించును. అతని రాజధాని పుణ్యపురము. ఇచటి జనులు జాతి మాత్రంగా రాక్షసులే అయినప్పటికీ, చాలా సాధుజనులు. అందుకే వారిని పుణ్యజనులని పిలుస్తారు. సర్వభోగసమృద్ధమైన పుణ్య పురములో, పుణ్య

క్షేత్రాలలో మృతి చెదిన పుణ్యాత్ములు, పరోపకార పరాయణులు, చేరి అచటి భోగాలు అనుభవిస్తుంటారు. ఈలోకంలో ఆసురీ దుర్గాదేవత ఉంది. ఆమె తన ఆరాధకులకు సర్వార్థాలనిస్తుంది.

**ఉ) వరుణలోకము :-** కుడిచెవి వెనుక భాగముపై సంయమం చేస్తే, వరుణలోక జ్ఞానం కల్గుతుంది. వరుణుని పట్టమహిషి వారుణి. జనులకు నీటి వసతి కల్పించిన వారు, చలివేంద్రములు ఏర్పాటు చేసినట్టి పుణ్యాత్ములు ఈలోకంలో నివసిస్తారు. ఛత్రములు, జలపాత్రలు దానం చేసినవారు, నీడ కోసం బెట్లను పెంచినవారు, గ్రీష్మతాపాన్ని హరించే వీవెనలను దానం చేసే వారు; సత్రాల వంటి వంటి నిర్మాణాలను చేసేవారు; దేవాలయంలో ధారాపాత్రలు దానం చేసేవారు; నీటిలో మునుగు చున్న వారిని రక్షించే పుణ్యాత్ములు; తీర్థములలో స్నానార్థము ఘట్టములను నిర్మించే సుకృతులు ఈలోకంలో చేరి అందలి భోగభాగ్యాలను అనుభవిస్తుంటారు. వరుణుడు జ్ఞానమూర్తి. ధర్మభూషితుడు. దయాహృదయుడు. సముద్రాలు, నదనదాలు, జలాశయాతటాకాలు, ఆదిత్యులు, వాసుకి మొదలైన మహాసర్పములు, తిమింగలం, మొసళ్ళవంటి జలచరాలు ఈతనిని సేవిస్తుంటాయి.

**ఊ) వాయులోకము :-** సాధకుడు తన ఎడమ చెవి మీద సంయమం చేస్తే, వాయులోకజ్ఞానం కల్గుతుంది. ఈలోకానికి రాజధాని గంధవతీనగరం. ఆనగరంలో వాయూపాసకులు, ప్రాణాయామపరులైన యోగులు, మచ్ఛేంద్ర, గోరక్ష, దవేంద్ర వంటిమహాసిద్ధులు నివసిస్తుంటారు. వాయువు జగత్ప్రాణుడు. మహాబలుడు. వేగంగా పరిగెత్తే జింక ఇతనివాహనం. నల్లని శరీరవర్ణంతో ప్రకాశిస్తుంటాడు. "కృత్తి" ఇతని సహచారిణి. ఆదేవి "లేలిహానమహాజిహ్వామై" (చాపుతున్న నాలుకతో) సింహాసనస్థమై ఉంది. పొగతో కూడి అగ్నివర్ణం వంటిరంగుతో, వ్రేలాడే పయోధరాలతో, కోరలలో వికటమైన నోటితో, వికారంగా కన్పిస్తుంది. శూల, ఖట్వ, చషక, చక్రాలను నాలుగు చేతులలో ధరించి ఉంది. వాటేమండి నిత్యం అగ్ని జ్వాలలు వెలువడు తుంటాయి. తళుక్కుమనే మెరుపును చూసినట్లు, ఆమె కన్పిస్తుంది. ఆమెపరివారదేవతలు. తూర్పున శాంకరి; దక్షిణాన మారిక; పశ్చిమాన వారుణి; ఉత్తరాన భీతిక.

**ఋ) కుబేరలోకము :-** సాధకుడు కంఠం మీద సంయమం చేస్తే కుబేర లోక మార్గం కన్పిస్తుంది. ఈలోకం సకలసంపదలకు ఆలవాలం.

ఈలోకం రాజధాని అలకాపురం. సర్వభోగ విరాజితం. మహాదాతలైన పుణ్యాత్ము లచ్చట నివసిస్తారు. కుబేరుని వైశ్రవణీ సభ ఇక్కడి విశేషాలలో ముఖ్యమైనది. వంద యోజనాల వెడల్పు, 70 యోజనాల పొడవుంది. తెల్లగా కైలాస శిఖరా కృతితో మెరుస్తుంటుంది. బంగారు ప్రసాదాలు మహారత్నస్థగిత ప్రదేశాలు, దివ్య సురభిళ గంధంతో అంతరిక్షంలో తేలిపోయే అద్భుత శక్తి కల్గిన పట్టణం ఇది. విశ్రవో బ్రహ్మకుమారుడైన కుబేరుడు, విచిత్ర మాల్యాం బరధారియై, గురుత్మత వర్ణుడై, పరమశాంతమూర్తిగా, హారకిరీటాది దివ్యా భరణాలతో ప్రకాశిస్తుంటాడు. సృష్టిలోని శ్రీమంతులకెల్ల శ్రీమంతుడు

అలకాపురిలో నందనవనం ఉంది. సౌగంధిక పుష్పశోభితం. అక్కడి వాయువు మందంగా వీస్తూ సుగంధాన్ని వ్యాపింపజేస్తుంటుంది. కుబేరసభలో కిన్నరులు, నదులు, మణిభద్ర, శ్వేతభద్ర, ధనద ప్రభృతులతో నిండి ఉంటుంది. ధనదుని కొడుకు పరమసుందరాకారుడైన నలకూబరుడు అప్సరసలతో వికదిస్తుంటాడు. వైశ్రమడు, ధనదుడైన కుబేరుని నారదాది దేవర్షులు, బ్రహ్మర్షులు రాక్షసులుగంధర్వులు సేవిస్తుంటారు. భగవంతుడైన శంకరుడు త్రిశూలాన్ని ధరించి, తన స్నేహితుడైన కుబేరుడి సభలో ఉంటాడు. నందీశ్వరాదులు కొలువుంటారు. నవనిధులు మూర్తిదాల్చి, కుబేరుని సేవిస్తుంటాయి.

**ఋ) శివలోకము :-** (ఎడమ) వామనేత్రం సంయమం చేసిన సాధకునికి శివలోకజ్ఞానం కల్గుతుంది. కుబేరుని అలకాపురానికి ముందుభాగంలోనే ఈశానుని పట్టణమైన మహోదయ పట్టణం ఉంది. అక్కడ రుద్రభక్తులైన తపోధనలుంటారు. నిరంతరం శివస్మరణంతో ఆనంద పడుతుంటారు. భూలోకంలో శివపూజారతులైన భక్తులే వీరంతా! స్వర్గంకన్నా మహాభోగాలనిక్కడ అనుభవిస్తుంటారు. రుద్రరూపధారులై, అజైకపాత్, అహిర్బుధ్య వంటి ఏకాదశరుద్రులచే పరివృతులై ఉంటారు.

ఏకాదశ రుద్రులు సహస్రరూపములను దాల్చి, జటామకుటాలతో, ఏకపాదంతో, ఫాలనేత్రులై, నీలకంఠులై, భసిత త్రిపుండ్ర ధారులై వృషభధ్వజములతో విరాజిల్లు తుంటాడు. ఈశానుని సేవించిన భక్తులు పునర్జన్మలో భూలోకంలో కాశీవంటి శివక్షేత్రాలలో మహానగరాలలో పురోహితులుగా జన్మిస్తారు.

**8.4 మహర్లోకము:-** భూమికి కోటి యోజనాల దూరంలో

మహర్లోకం ఉంది. సాధకుడు హృదయానికి పైభాగాన సంయమం చేసినచో, మహర్లోకజ్ఞానం లభిస్తుంది. స్వర్గంకన్నా పరమాద్భుతమైనదిది. తపస్సంపన్నులైన వారు బ్రహ్మకల్ప పర్యంతం ఈలోకవాసులై ఉంటారు. ఇక్కడ ఐదు విధాలైన దేవసంఘాలుంటాయి. అవి 1) కుముదులు 2) ఋభువులు 3) ప్రతర్దనులు 4) అంజనాభులు 5) ప్రచితాభులు.

వారు పృధివ్యాది మహా భూతాలను వశపర్చుకొని ఉంటాడు. వారికి ధ్యానమే ఆహారం. ధ్యానమాత్రతృప్తులని అర్థం.

**8.5 జనలోకము :-** భూలోకానికి రెండు కోట్ల యోజన దూరంలో జనలోకం ఉంది. సాధకుడు కంఠముపైన సంయమం చేస్తే ఈ లోకజ్ఞానం కల్గుతుంది. విమలులు, మహాత్ములైన సనందనాది యోగీంద్రుల నివాసము ఆలోకం. బ్రహ్మమానసపుత్రులైన వీరు ఊర్ధ్వరేతసులు. మరికొందరు యోగులు. అస్ఖలితబ్రహ్మచారులు నిర్మలాత్ములు. 4 రకాలు దేవగణాలు ఈలోకంలో నివసిస్తున్నాయి. 1) బ్రహ్మపురోహితులు 2) బ్రహ్మ కాయకులు 3) బ్రహ్మమహాకాయకులు 4) అమరులు. రెండు బ్రహ్మ కల్పములు వీరి ఆయుఃప్రమాణము. వీరంతా భూతేంద్రియ వశులై ఉన్నారు.

**8.6 తపోలోకము :-** అభ్యాసకుడు భ్రూమధ్యంపై సంయమం చేస్తే తపోలోకజ్ఞానం కల్గుతుంది. జనలోకంపైన తపోలోకముంది. తేజోమయం. దేవపూజితులైన వైరాగులైన పుణ్యాత్ములు అక్కడ నివసిస్తుంటారు. అనేక విధములుగా తపస్సుచేసిన మహాపురుషులందరికీ ఈలోకమే నివాసము. వాసుదేవుని యందే మనోబుద్ధులను నిల్పి, సర్వకర్మ ఫలసమర్పణ చేసిన కర్మిష్ఠులు, తమతపస్సులతో వాసుదేవుని మెప్పించిన నిరభిలాషులైన తపస్వులు ఈలోకంచేరి సుఖిస్తుంటారు.

శిలోంఛయ వృత్తి; దంత్యోలూఖలక వృత్తి; అశ్మకుట్టివృత్తి; శీర్ణపర్ణ వృత్తి, పంచాగ్ని మధ్య గతం వంటి తపస్సులచే శరీరాన్ని కృశింపచేసుకొని, చివరికి శరీర స్పృహ లేకుండా పుట్టలు పెరిగిపోయిన ఘోరతపస్సులు చేసిన తపోధనులు బ్రహ్మయుష్య సమానాయుష్కులై అకుతోభయులై( ఎక్కడా భయం లేని స్థితి కల్గి) తపోలోకంలో నివసిస్తున్నారు. ఈలోకంలో మూడు రకాల దేవసంఘాలున్నాయి.

1) అభాస్వరులు 2) మహాభాస్వరులు 3) సత్యమహాభాస్వరులు. వీరంతా భూతేంద్రియవశులు. బ్రహ్మకల్పద్విగుణాయుష్కులు. అప్రతిహతజ్ఞానులు. ఇచటి ప్రకృతి పంచతన్మాత్రలుగా ఉంది.

## 8.7 బ్రహ్మలోకము - (సత్యలోకము)

మూర్ధమందు (శిరస్సు) సంయమం చేస్తే, సత్యలోకజ్ఞానం కల్గిదర్శనమైతుంది. తపోలోకానికి ఆరురెట్లు పెద్దగానుంది సత్యలోకం. జనలోకంపైన 12కోట్లయోజనముల దూరంలో ఉంది. దీనిలోనే బ్రహ్మలోకం/వైకుంఠలోకం ఉన్నాయి. ఈ లోకంపైన 1,85,00,000 యోజనాల దూరంలో అండకటాహం (ఒకపాత్రపైభాగమునందలి రేకువంటిది) ఉంది. ఈలోకంలో సమశీతోష్ణములు లేని ఒక అనిర్వాచనమైన స్థితిలో వాతావరణం ఉంటుంది. క్షుత్పిపాసలుండవు. బ్రహ్మసభకు ఆధారస్తంభాలుండవు. అదోవిచిత్ర నిర్మాణము. తనకాంతులతో సూర్యచంద్రకాంతులును తిరస్కరిస్తున్నట్లుంటుంది. బ్రహ్మదేవుడు, చతుర్ముఖుడై, రక్తవర్ణదేహకాంతితో, దండ,కమండలు, అక్షమాల అభయముద్రలను ధరించిన చేతులతో కమలాసనంలో సరస్వతీయుతుడై ఉంటాడు. ఆభగవానుని దక్షాది ప్రజాపతులు, ప్రచేతస, పులహ, క్రతు, మరీచి, కశ్యప, భృగు, అత్రి, వశిష్ఠ, గౌతమ, అంగీరసాది బ్రహ్మర్షులు, పులస్త, ప్రహ్లాద, కర్దములు, అధర్వాంగిసురులు, వాలఖిల్యులు, మరీచిపులు, మనస్సు, అంతరిక్షం, విద్యులు, పంచభూతాలు, పంచతన్మాత్రలు, ప్రకృతి, వికారములు పరివేష్ఠించి సేవిస్తుంటాయి. అగస్త్య, మార్కండేయ, జమదగ్ని భరద్వాజ, సరివర్త, చ్యవన, దుర్వాస, ఋష్యశృంగ, సనత్కుమార, అసిత, దేవల, జైగీషర్య ఋష భమణులును, అష్టాంగ, ఆయుర్వేద నక్షత్రయుత చంద్రాదిత్యులు, వాయువులు, సంకల్పము, ప్రాణము అన్నీ రూపుదాల్చి బ్రహ్మను సేవిస్తున్నాయి. ధర్మార్థకామాలు, గంధర్వాప్సరసగణాలు, సమస్త లోకపాలురు, గ్రహాలు, ద్వాదశాదిత్యులు, అధిదేవత ప్రత్యధిదేవతలతో సహా బ్రహ్మను కొలుస్తున్నారు. పితృగణములు, హవిర్ద్రవ్యములు, వేదశాస్త్ర పురాణేతి హాసాలు, యజ్ఞములు, సోమదేవతలు, సావిత్రి, దుర్గ, తరణి, వాణి, ఏడు విధాలైన వేధలు, ధృతి, స్మృతి, ప్రజ్ఞాబుద్ధులు, యశస్సు, క్షమ, సామములు, స్తుతి శాస్త్రులు, గాధలు, భాష్యాలు, వంటి పక్షములు, మాసములు, ఋతువులు, సంత్సరాలు, యుగములు ఆకారాన్ని ధరించి పితామహుని సేవిస్తుంటాయి. దివ్యమైన కాలచక్రము, అక్షయము, అవ్యయమైన ధర్మచక్రము నిల్చి ఉంటాయి. అదితి, దితి, దను, సురస, విద్యాత, ఇర, కాళిక, సురభి, సరమ, గౌతమి, ప్రభా, కద్రూ వంటి

దేవమాతలు, రుద్రాణి, శ్రీ, భద్ర, లక్ష్మి, శచి, పుష్టి, అరుంధతి, సంవృత్తి, ఆశ, నియతి, సృష్టిదేవి, రతి వంటి దేవతాస్త్రీలంతా సేవిస్తుంటారు. స్థావర జంగమాలు, మహాభూతాలు, మహాదేవమహాసేనులు, అయోనిజులు, యోనిజులు, త్రిలోకాలలో ఏది దృశ్యమగునో అదంతా బ్రహ్మసభలో ఉంది. 88వేల మునులు, 50 వేల దేవతలు, పితామహుని దర్శించిపోతుంటారు. ఈలోకంలోని దేవసంఘాలు నాల్గురకాలు. సృష్టి అంతవరకు వీరి ఆయుష్యం.

1) అచ్యుతులు- సవితర్క ధ్యానసుఖాన్ని పొంది ఉన్నారు.
2) శుద్ధనివాసులు- సవిచార ధ్యానసుఖులు.
3) సత్యాభులు- ఆనందమాత్రధ్యావసుఖులు.
4) సంజ్ఞాసంజ్ఞినులు- అస్మితా మాత్రధ్యానసుఖులు.

వీరంతా త్రైలోక్యమధ్యమందున్నారు. విదేహప్రకృతులైనవారు మోక్షపదముపొందుతారు. దీన్ని యోగి సంయమంచే అనుభవానికి తెచ్చుకుంటాడు. ఎంతవరకు సాక్షాత్ అనుభవమౌతుందో అంతవరకు (పైనతెల్పినదంతా) దర్శనమౌతుంది. తర్వాత విదేహప్రకృతిలయమౌతుంది. విదేహప్రకృతిలయులకు బ్రహ్మాండానికి లోపల, వెలుపల స్వతంత్రస్థితి ఉంటుంది. వారీశ్వరకోటిలో చేరినవారు కాబట్టి వారిని ఈలోకవాసి జనుల మధ్య చేర్చరాదు.

## 8.8 వైకుంఠ లోకము

అమృతము, శాశ్వతము, నిత్యము, అనంతమైన పరమపదమే వైకుంఠము. బ్రహ్మానందసుఖమే అలోకంగా మారింది. హిరణ్యామయమైన ఆలోకమును చేరిన వారు తిరిగిరారు. మహాయోగిశ్రేష్ఠులు శాస్త్రమార్గ జ్ఞానంతో చేరతగినది ఈవైకుంఠము. శ్రీహరి పాదపద్మ భక్తిరసమగ్నులై, భోగవర్జితులైన ముముక్షువులు, మహాభాగులు శ్రీవిష్ణుపరమధామము చేరి బ్రహ్మానందమనుభవిస్తూ ధన్యులౌతారు.

ఆలోకము విష్ణుభక్తులైన నానావిధ జన సంకీర్ణము. దీనిలో అనేక ప్రాకారాలు, విమానాలు, రత్నమయ సౌధాలున్నాయి. ఆలోకమధ్యంలో "అయోధ్య" అనే దివ్యనగరం ఉంది. దీనికి నాల్గువైపుల ప్రధాన ప్రవేశద్వారాలున్నాయి. ప్రాగ్ద్వారము వద్ద చండప్రచండులు, దక్షిణద్వారం వద్ద భద్రసుభద్రులు. పశ్చిమద్వారం వద్ద జయవిజయులు ఉత్తరద్వారం వద్ద

ధాతృవిధాతృలు, కాపుంటారు. ఎనిమిది దిక్కులను కుముద, కుముదాక్ష, పండరీ, వామన, శంఖుకర్ణ, సర్వనిద్ర, సుముఖ, సుప్రతిష్ఠ అనే పేర్లున్న 8 ఏనుగులు రక్షిస్తుంటాయి. ఆనగరంలోని అంతఃపురస్త్రీలు సర్వలక్షణ శోభితలు. వారంతా మహాలక్ష్మిని సేవిస్తుంటారు. లక్ష్మీయుతుడైన శ్రీహరి విరాజిల్లుతుంటాడు. ఈనగరానికి సప్తావరణములు వ్యూహభేదాలతో నిర్మించబడి ఉన్నాయి.

వైకుంఠానికి తూర్పున వాసుదేవుని మందిరం, ఆగ్నేయంలో మహాలక్ష్మిమందిరం, దక్షిణాన సంకర్షణదేవుని మందిరం, నైఋతిలో సారస్వతాలయం, పశ్చిమాన ప్రద్యుమ్నమందిరం , వాయువ్యాన రతి నివాసభవనం. ఉత్తరాన అనిరుద్ధ భవనం, ఈశాన్యంలో శాంతి భవనం ఉన్నాయి. ఇది ప్రథమావరణం.

కేశవకీర్తి మొదలైన లోకాలు ద్వితీయావరణం. మత్స్యకూర్మాది, దశావతారలోకాలు తృతీయావరణం. సత్యయుత, దుర్గ, ఆనంద, విష్వక్సేన, గజానన, శంఖపద్మనిధులున్నలోకాలు చతుర్థావరణము. ఋక్యుజుస్సామాథర్వణాది లోకాలు సావిత్రి, గరుఢ ధర్మ సుఖ సర్వావాఙ్మయలోకాలు పంచమావరణము. శంఖ, చక్ర, గదా, పద్మ, ఖడ్గ, శార్ఙ, హల, ముసల లోకములు, సర్వ శస్త్రా స్త్ర లోకాలు షష్ఠమావరణము. ఇంద్రాగ్నియామ్య నైఋతి వరుణవాయుకుబేర ఈశాన్యలోకాలు సప్తమావరణం. ఈలోకంలోని సాధ్యులు విశ్వేదేవతలు మొదలైన దేవతలు నిత్యులుగా ఉంటారు. ప్రాకృత స్వర్గాదిలోకాలలోని వారు నిత్యులుగారు. మారుతుంటారు. ఇదంతా భగవన్మాయావిలాసము. ఈపరమపదమునందు దివ్యులతో, మహర్షులతో, భక్తపరాయణులతో శ్రీహరి సేవింపబడుతూ, విరాజిల్లుతుంటాడు. ఇక్కడ సూర్యచంద్రులు ప్రకాశింపరు.- పద్మపురాణం.

## 8.9 కైలాస లోకం

వైకుంఠానికి 16 కోట్లయోజనాలు దూరంలో కైలాసముంది. ఇక్కడ త్రినేత్ర జటామండల విరాజితులు, త్రిశూలధారులు, భస్మావగుంఠిత దేహులు, చంద్రేఖాకృత శిరోభూషణులు, పరమపావనులైన 11 కోట్ల రుద్రులున్నారు. కోతి మొగాలతో త్రిశూల, ఖట్వాంగ, పరశు, వరధారులు నందీశ్వరనాము లున్నారు. వీరు రుద్రులద్వారపాలకులు. 6 కోట్ల స్కందనామక రుద్రులున్నారు. విశిఖులు, శాఖానాములు, ఆరుకోట్ల మంది,

ప్రమథోత్తములు 7 కోట్లమంది రుద్రరూపాలలో ఉన్నారు. 11 కోట్ల మాతృకా దేవతలు, దిశ్యాలంకార శోభితలై విచిత్రవాహనులై ఉన్నారు. వీరంతా లేత ఎరుపురంగు దేహంతో త్రినేత్రులై శూలపాణులై గణేశ్వరులైన శైవులు. పాశుపతులు, భస్మప్రహరణులు, మహావ్రతులు, దిగంబరులు, అయోనిజులు, నిరామయులు, మహాపాశుపతులు, శివకేశవాభేదదృష్టిలేని వారంతా ఈరూపాలను ధరించి ఉంటారు. సింహముఖులైన వీరభద్రాదులు శివరోమములనుండి ఉద్భవిల్లినారు. శూలబాణ ధనుస్సులను ధరించి ఉంటారు. ఏకాదశరుద్రులు గణాగ్రగణ్యులు. రుద్రాణీసహితులై ఉన్నారు.

అజ, ఏకపాద, అహిర్బుధ్న్య, విరూపాక్ష, త్రైవత, హర, బహు రూప, త్ర్యంబక, సావిత్ర్య, జయంత, పినాకీ అనే వీరంతా 324 కోట్లనుండి అన్ని దిక్కులా ఈశ్వరాజ్ఞా ప్రవర్తకులై రక్షిస్తుంటారు. రుద్రుని అష్టమూర్తులు, సూర్య, జల, మహీ, వహ్ని, వాయు, ఆకాశ, దీక్షిత, బ్రాహ్మణ, చంద్ర రూపములు. వారి భార్యలు - సువర్చల, ఉమ, వికేశ, శివ, స్వాహ, దిశ, దీక్ష, రోహిణి. వారి పుత్రులు - శని, లోహితాక్ష, మనోజవ, సుంద, సుర, బుధ, అనువారలు.

భూత, ప్రేత, పిశాచ, కూశ్మాండ, భైరవులనే జాతులు ఘోరరూపులై, భీమునిస్వసములతో సంచరిస్తుంటారు. అష్టదిక్పాలకులు శంకర కింకరులై ఉంటారు. 36 కోట్ల సంఖ్యకల్గిన హరగణములు సదాశివమహాయోగిని సేవిస్తుంటారు. అప్రాకృత దివ్యదేహులైన ఇంద్రాది దేవతలందరూ ఈస్వామిని భజిస్తూ ఉంటారు.

గమనిక :- "అప్రాకృత" అంటే మామూలుగా స్వర్గంలో ఉండే ఇంద్రాది దేవతలు కాకుండా ప్రత్యేకంగా ఇంద్రాదులు కైలాసంలో ఉన్నారు. పైనపేర్కొన్న సదాశివుడు అప్రాకృతకైలాసనాథుడు. ప్రాకృతకైలాసనాథుడు శంకరుడు వేరే ఉన్నాడని తెల్సికోవల్సి ఉంది. సదాశివుడు మహావిభూతపతి. ముక్తిప్రదాత. లోకవిద్యలలో కొన్ని చోట్ల స్థాన, దూరభేదములు కన్పించ వచ్చు. సృష్టిమారునప్పుడు ఈ మార్పులు జరుగుతుంటాయని "జ్ఞానవాశిష్ఠం" వంటి గ్రంథాలు పేర్కొంటున్నాయి. నేటి భౌతిక శాస్త్రపరిశోధనలు కూడా ఎంతో వైవిధ్యాన్ని పొందుతున్నాయి. మార్పులకు లోనైతున్నాయి కదా! **తర్క్యతాం మా కుతర్క్యతాం!**

# 8.10 అధోలోకవిద్య (సప్తపాతాళములు)

**1) అతలలోకము :-** అభ్యాసి కటి ప్రదేశం (నడుము)లో సమాహితం చేస్తే అతలలోకజ్ఞానం కల్గుతుంది. భూలోకానికి క్రింద 10 వేల యోజనాల దూరంలో అతలలోకమందు యముని కుమారుడు మయుడనే రాక్షసుడు ఈలోకాధిపతి. ఈలోకులంతా మాయాపుత్రులైన రాక్షసులు. అచటి స్త్రైరిణులు, ఆలోకాన్ని ప్రవేశించిన పురుషులకు, స్వర్ణరసమనే పానీయాన్ని త్రాపి దాని ప్రభావంతో మత్తులైన వారితో రమిస్తుంటారు. మహా భోగాలకు నిలయం ఈలోకం. దీని భూభాగం బంగారురంగులో ప్రకాశిస్తుంది.

**2) వితల లోకము :-** సాధకుడు తొడలభాగంలో చిత్తసంయమం చేస్తే ఈలోకదర్శనం కలుగుతుంది. అతలలోకం క్రింద 10వేల యోజనాల దూరంలో వితలలోకముంది. హాటకేశ్వరనామంతో హరుడీలోకంలో విహరిస్తాడు. పార్షదులు, భూతగణాలతో సేవించబడే ఈస్వామి భవానీ యుతుడు. వీరి వీర్యంతో పుట్టిన హాటకి అనేనది ప్రవహిస్తుంది. ఆ నీటిని అగ్నితో కాల్చి బంగారుగా మార్చి ఆభరణాలను ధరిస్తారు ఆలోక వాసులు. అచటి భూమి శిలామయము.

**3) సుతల లోకము :-** సాధకుడు మోకాళ్ళభాగంలో సమాహితం చేస్తే, సుతల లోకదర్శనానుభవంకల్గుతుంది. వితలలోకానికి క్రింద 10వేల యోజనాల దూరంలో ఈలోకముంది. విరోచనపుత్రుడు, పుణ్యశ్లోకుడు, మహాదాత బలిచక్రవర్తి ఈలోకపాలకుడు. ఆలోక ప్రవేశప్రధానద్వారంలో అహర్నిశలు భగవంతుడైన శ్రీమన్నారాయణమూర్తి గదాధారిగా రక్షిస్తుంటాడు. అది బలికిచ్చిన వరం. అచటి భూమి నీలమృత్తిక (నల్లరేగడి).

**4) తలాతల లోకము:-** అభ్యాసి తన పిక్కల భాగంలో ఏకాగ్రంతో సమాహితం చేస్తే ఈలోకదర్శనం కల్గుతుంది. సుతలలోకానికి 10వేల యోజనాల క్రింద తలాతలముందిత దీనికధిపతి పూర్వము త్రిపురాధి పతియైన మయుడు. వాడుమహామాయావి. ఇక్కడిభూమి రక్తవర్ణ (ఎర్రనేల)

**5) మహాతల లోకము:-** సాధకుడు తన పాదసంధిప్రాంతంలో (మెడిమ) సమాహితం చేస్తే మహాతలలోక దర్శనం కల్గుతుంది. తలాతలం క్రింద 10వేల యోజనాల దూరంలో ఈలోకముంది. కద్రూపుత్రులైన సర్పములు, తమకుటుంబాలతో సహా, గరుడినికి భయపడి కన్పడకుండా

ఈలోకంలో దాగుకున్నాయి. సుషేణ తక్షణ, కాళీయాది మహా సర్పములకీలోకం నిలయం ఇచటభూమి పీతవర్ణ (పచ్చని కాంతి).

**6) రసాతల లోకము :-** అభ్యాసి పాదంపై ఏకాగ్రం చేస్తే ఈలోక జ్ఞానం కల్గుతుంది. మహాతలము క్రింద రసాతలము 10వేల యోజనాల దూరంలో ఉంది. దేవేంద్రుని చేత నిర్జింపబడిన రాక్షసులు, దైతేయులు, దానవులు, పణులనే జాతులు ఈలోకంలో నివసిస్తున్నారు. కాలకేయ, నివాతకవచులు, హిరణ్యపుర నివాసులు వీరంతా భగవంతుని చేత నిగ్రహీత బలులై, రంధ్రములో దూరిన పాములవలె, ఈలోకంలో ఉన్నారు. ఇచటిభూమి శ్వేతవర్ణం (తెల్లని).

**7) పాతాళలోకం :-** సాధకుడు పాదాధోభాగంలో ఏకాగ్రం చేస్తే (అరికాలిపై) పాతాళ లోక దర్శనం సిద్ధిస్తుంది. రసాతల లోకానికి క్రింద 10వేల యోజనాల దూరంలో ఉంది పాతాళం. ఇది నాగలోకం . వీరంతా శూరులు. మహాబలులు. వాసికి, శంఖ, కుళిక, ధృతరాష్ట్ర, ధనుంజయ, శంఖచూడ, వంటి మహా నాగులు 5,10,100,1000 పడగలను గల్గి భయంకరంగా, మహాక్రోధులై ఉంటారు. ఆపడగలపైన జాతి మణులు అలంకారంగా ప్రకాశిస్తుంటాయి. వీటి ప్రకాశంలో ఆలోకం చీకట్లు లేనిదై ఉంటుంది. అచటి భూమి కృష్ణ వర్ణ (నల్లని రంగు). ఈ లోక మూల ప్రాంతంలో భగవంతుని తామసీ కల "అనంత" అనే పేరుతో ఉంటాడు. అతడే సంకర్షణుడు. ఆమహా సర్పదేవుని వేయి పడగలమీద ఈభూమండలముంది. ఆదేవుని పార్షదులు, మునులు, ఋషులు, దేవగంధర్వ యక్షకిన్నెరది దేవగణాలు సేవిస్తుంటాయి. వైజయంతీ మాలధరించి, నీలాంబరధారియైన, రత్నకుండల భూషితుడీ స్వామి. సమస్తలోకాల స్థితి, శుభముల కీతడేకారణము. ఇది భగవంతుని రెండవమూర్తి. మొదటి మూర్తి వాసుదేవుడనే పేరు గల్గిన జ్ఞానకల. అది అమలము. గుణాతీతము. శేషసంజ్ఞ కల్గిన సంకర్షణుడు కాలస్వరూపుడు. ఇది లోకాలను అంతమొందిస్తుంది. ఈయనెప్పుడు మదఘూర్ణితలోచనుడై విజృంభిస్తాడో, అప్పుడు భూమి కంపిస్తుంది. లోకాలన్నీ బెగ్గడిల్లుతాయి. ఇంతటితో అధోలోకవిద్య ముగిసింది.



# అధ్యాయము 9.

## 9.1. తన్మాత్రవిద్యలు (విషయవతీవిద్య).

పరిచయం. ప్రాణులకు గంధాదులైన విషయాల, ప్రాణాదులైన ఇంద్రియాల పరస్పర సంబంధంతోనే శీతోష్ణ సుఖదుఃఖాలనుభవం కల్గుతుంది. విషయము బాహ్యమైనప్పుడే ఇంద్రియం దాన్ని గ్రహిస్తుంది. అంటే పరిమళద్రవ్యం యొక్క సువాసనను ఇంద్రియం తెలుసుకుంటుంది. దాని అనుభవంవల్ల సుఖం, హాయిపొందుతున్నాం. కాని యోగి బాహ్య విషయాలు లేకుండానే(పరిమళ ద్రవ్యాదులు)గంధానుభవం పొందుతాడు. బాహ్య జగత్తులో నున్న ఐదు రకాలైన విషయాలకు మూలమైన సూక్ష్మ భూత గుణములే గంధాదులు. గీత, సాంఖ్యయోగంలో భగవంతుడిట్లా హెచ్చరిస్తున్నాడు.

శ్లో॥ మాత్రాస్పర్శాస్తు కౌంతేయ! శీతోష్ణ సుఖదుఃఖదాః
అగమాపాయినోఽనిత్యాః, తాంస్తితిక్షస్వ భారత!

తా॥ అర్జునా! శీతోష్ణ సుఖాలనిచ్చే మాత్రాస్పర్శలు(ఇంద్రియ విషయాలు) వస్తూపోతూ ఉన్నాయి. అవి అనిత్యాలు. కావున వాటిని సహించు!

ఊరికే సహించమని చెప్పడంతోనే సహించేశక్తి కల్గుతుందా! ఇంద్రియాలను, విషయాలను వేరు చేసిన యోగి మాత్రమే సహించగలడు! ఇందుకే తన్మాత్ర విద్య లుద్దేశింపబడినాయి. యోగవిద్యాప్రణాళికలో శ్రీ గురువులు తన్మాత్రవిద్యల తర్వాతే ఇంద్రియ విద్యలనుపదేశించడంలోని అంతరార్థమిదే! ఇంద్రియాలను, తన్మాత్రమైన స్పర్శలను విడిగా దర్శించి, క్రమమైన (తర్ఫీదు) శిక్షణ పొంది యోగిమాత్రమే పరిపూర్ణజ్ఞాన సిద్ధి పొందగలడు. అందుకే జ్ఞానసిద్ధికి యోగమే పరమసాధనమని చెప్పబడింది. తర్వాతి శ్లోకంలోనే భగవానుడీవిధంగా సెలవిస్తున్నాడు.

శ్లో॥ యం హి నవ్యధయంత్యేతే పురుషం పురుషర్షభ!
సమదుఃఖ సుఖం ధీరం సోఽమమృతత్వాయ కల్పతే!

తా॥ సుఖదుఃఖాలను సమానంగా చూసే ఏధీరుడైన పురుషుని ఈశీతోష్ణాలు బాధింపవో, ఆమహాపురుషుడు(ద్వంద్వ సహిష్ణువు) అమృతత్వ సిద్ధికి అర్హత కల్గి ఉన్నాడు. (సమర్థుడగుచున్నాడు).

ఈవిధంగా ఈతన్మాత్రవిద్యలు, ఇంద్రియాధిష్టానదేవతా విద్యలు, పరమార్థసాధనకు అత్యంతా వశ్యకాలని గ్రహిస్తూ, పంచతన్మాత్ర విద్యను గురించి తెల్పుకుందాం!

తన్మాత్రలు ఐదు. 1) గంధ 2) రస 3) రూప 4) స్పర్శ 5) శబ్దము. ఇవి సూక్ష్మపంచభూతాలు. వీటివల్లనే స్థూలపంచభూతాలు పుట్టాయి. తన్మాత్ర అంటే **ఆత్మనఃఆకాశస్సంభూతః** అనేక్రమంతో సూక్ష్మాతి సూక్ష్మమైన ఆత్మశక్తిగా తెల్సుకోవచ్చు.

**1) గంధతన్మాత్ర విద్య:-** నాసికాగ్రంపై దక్షిణామూర్తి విద్యలో కన్పించే జ్యోతిర్బిందువు స్థానానికి కొంత ఎడమ వైపు లక్ష్యముంచి సమాహితం చేస్తే పచ్చని (పీత) రంగుతో గంధతన్మాత్ర దర్శనమౌతుంది. కొంత అభ్యాసం వల్లనే గంధము (మంచివాసన) సాధకునికి అనుభవమౌ తుంది. పరిపాకస్థితిలో దివ్య పరిమళాన్ని పరిసరములకు వ్యాపింపచేయ గలడు. పృథివీ భూతగుణము గంధము. దీని వల్లనే వల్లనే పృథివీ భూతం ఉత్పత్తి జరుగుతుంది. దక్షిణామూర్తి విద్యలోనే స్వల్పంగా దృశ్యం మారినప్పుడు కూడా ఈ పరిమళాన్ని అభ్యాసి అనుభవిస్తాడు. ఇంద్రియ సుఖానుభూతి బాహ్య ప్రకృతి నుండి కాకుండా, తన శరీరంలోనే ఎలా పొంద వచ్చో ఈతన్మాత్ర విద్యలో అనుభవమౌతుంది. దీనివల్ల బాహ్య సుఖలాలస నివారింపబడుతుంది. ఈగంధతన్మాత్ర సాధన చేసినవాడు పరిసరదుర్గంధ వాతావరణబాధను పొందడు. యోగి సుగంధాన్ని ప్రసాదిస్తాడు.

**2) రసతన్మాత్రవిద్య:-** నాలుక చివర(కొన) రసతన్మాత్ర ఉంది. దీనిపై లక్ష్యముంచి ఏకాగ్రం చేస్తే తామ్రవర్ణంతో దర్శనమిస్తుంది. ఈసాధనలో అభ్యాసికి మాధుర్యాది రసాస్వాదనానుభూతి కల్గుతుంది. నాలుకచివర చుం, చుం అనిపిస్తుంది. ఈవిద్యవల్ల సాధకుడు ఆహారాది పానీయాలలో తేడాలెన్ని ఉన్నా, వాటిని స్వీకరించగలడు. ఏరుచీలేని కందమూలాలను, ఆకుల ఈములను తినేటప్పుడు ఇతరులు పొందలేని మాధుర్యాది రసాలను అనుభవిస్తాడు.

**3) రూపతన్మాత్రవిద్య :- తాలువుల** (దవడలు) క్రింది భాగంలో సమాహితం చేస్తే కృష్ణవర్ణంతో రూపతన్మాత్రదర్శనమిస్తుంది. రూపాలను గ్రహించడానికి ఈతేజస్సే ముఖ్యం. ఈవిద్యాపరిపూర్ణునికి చీకటిలో కూడా వస్తురూపాలను గుర్తించకల్గే శక్తి అలవడుతుంది.

**4) స్పర్శతన్మాత్రవిద్య:-** నాలుకమధ్య భాగంలో లక్ష్యముంచి సమాహితం చేస్తే ధూమ్రవర్ణంతో, శీతలస్పర్శతో స్పర్శతన్మాత్ర అనుభవాని కొస్తుంది. ఈసాధకుడు బాహ్య వాతావరణంలోని శీతోష్ణాలను తనదేహానికి తగినట్లుగా మార్చుకోగలడు.

**5) శబ్దతన్మాత్రవిద్య:–** కంఠ స్థానంలో లక్ష్యముంచి సమాహితం చేస్తే, స్ఫటిక వర్ణంతో, దీర్ఘ ఘంటానినాదరూపంలో శబ్దతన్మాత్ర దర్శనమిస్తుంది. ఈవిద్యలో పరిపూర్ణుడైన అభ్యాసి దూరశ్రవణ శక్తి పొందగలడు.

**"నాసాగ్ర, జిహ్వాగ్ర, తాలు, జిహ్వామధ్య, జిహ్వామూలేషు చిత్త సంయమాత్ దివ్యగంధ, రస, రూప, స్పర్శ, శబ్ద సంవిదో జాయంతే!".**

**విషయవతీ విద్య:–** భ్రూమధ్యమంలో సమాహితంచేస్తే పీతవర్ణంతో (పచ్చని) మనస్సు దర్శనమౌతుంది. జ్ఞాతవిద్యున్నిభుడు. కొందరి సంప్రదాయంలో యోగాభ్యాసాన్ని విషయవతీ విద్యతో ప్రారంభించ బడుతుంది.. కాని త్రాటకంతో ప్రారంభించడమే క్రమమని, సులభమని తెల్సుకోవచ్చు.

## 9.2. ఇంద్రియవిద్యలు

**9.2.1 జ్ఞానేంద్రియాలు :–** ఇవి రెండురకాలు 1) జ్ఞానేంద్రియాలు 2) కర్మేంద్రియాలు . జ్ఞానేంద్రియాలను ముందుగా వివరించుకుందాం.

**శ్రోత్రేంద్రియం:–**

" శ్రోత్రాకాశ యోస్సంబంధ సంయమాత్ దివ్యంశ్రోతం"

*-యోగసూత్రములు. విభూతిపాదం. 42 వ సూత్రం*

చెవుల రంధ్రంలోని ఆకాశం (ఖాళీప్రదేశం) లో సంయమంచేస్తే పచ్చని రంగుతో శ్రోత్రేంద్రియం కన్పిస్తుంది. ఇంద్రియాధిదేవత ద్విదేవి. ఉపాసకుడు ఈ విద్యలో పూర్ణుడైనప్పుడు దివ్యశ్రవణశక్తి పొందుతాడు. ఎంతదూరంలోని శబ్దాన్నైనా వినగలడు. ఈలోకమే కాకుండా స్వర్గాది దివ్యలోకంనుండి కూడా శబ్దాన్ని గ్రహించగలడు. ఈసిద్ధి పొందిన ఇద్దరు యోగులు ఎంత దూరమున్నా సంభాషించుకోగలరు. (నేటి వైర్‌లేస్ వంటిది.)

**2) త్వగింద్రియము :–** సాధకుడు తన స్థూల శరీరాన్నంతా లక్ష్యంగా సమాహితం చేస్తే, త్వగింద్రియ (చర్మం) దర్శనమౌతుంది. దాని రంగుగేద వర్ణం (లేతపసుపు) విద్యాప్రవీణుడు వాయుదేవతను దర్శిస్తాడు.

**"కాయాకాశయో స్సంబంధ సంయమాత్ లఘుతూల సమాప త్తేశ్చాకాశగమనం"** *యోగసూత్రం-43 (విభూతిపాదం)*

శరీరానికి ఆకాశానికి ఉండే సంబంధంపై సంయమమొనర్చిన యోగ దూదింపింజవలె తేలిక శరీరంకలవాడై ఆకాశంలో సంచరించ గలడు.

ఆకాశగమనము యోగ సిద్ధులకు సహజము. వారు అన్ని లోకాలకు వెళ్ళి వస్తుంటారు. (నారదాదులు).

**3) చక్షురింద్రియము:-** కన్నులలోని నల్లగ్రుడ్డుపైన సమాహిత దృష్టితో ఏకాగ్రం చేస్తే, ఈ ఇంద్రియం నల్లని రంగులో కన్పిస్తుంది. ఇంద్రియాధి దేవత సూర్యుడు. ఈవిద్యలో సిద్ధి పొందిన సాధకుడు దూరదర్శన శక్తి పొందగలడు. ఏలోకంలోని దృశ్యమైనా చూడగలడు.

**4) జిహ్వేంద్రియము :-** ఈఇంద్రియం నాలుక చివరి లక్ష్యముంచి ఏకాగ్రం చేస్తే రక్తవర్ణంతో దర్శనమిస్తుంది. ఇంద్రియాధి దేవత వరుణుడు ఈవిద్యలో యోగి దివ్యరసములను (రుచులను) ఆస్వాదించగలడు. అంతేకాకుండా ఏరుచినైనా (చేదు - కారం) తృప్తిగా స్వీకరించగల్గుతాడు. అన్నింటికన్నా ముఖ్యం ఎంతరుచికల పదార్థాన్నైనా తినవలెనని కాంక్షను నిరోధించగలడు.

**5) ఘ్రాణేంద్రియము:-** నాసాగ్రంపైన లక్ష్యముంచి సంయమం చేస్తే, శ్వేతవర్ణము (తెల్లని)తో ఘ్రాణేంద్రియమం కన్పిస్తుంది. దీని అధిదేవతలు అశ్వినులు. ఈ ఉపాసనలో పరిణతి చెందిన యోగి దివ్యగంధాన్ని అనుభవిస్తాడు. పరిసరములకు వ్యాపింపచేస్తాడు.

## 9.2.2 కర్మేంద్రియాలు:

**1) వాగింద్రియము :-** వాక్కు బయలుదేరే ఎనిమిది స్థానాలలో సమాహితం చేస్తే నీలవర్ణంలో ఈఇంద్రియదర్శనమౌతుంది. ఇంద్రియాధి దేవత అగ్ని. ఈయోగి వాక్కు శాసకముగా ఉండి, ప్రత్యేక ప్రతిభను వెలారుస్తుంటుంది.

**2) ప్రాణేంద్రియము:-** హస్తమధ్యప్రదేశంలో సమాహితం చేస్తే పసుపుపచ్చని రంగుతో దర్శనమౌతుంది. అధిదేవత ఇంద్రుడు. దీని ప్రభావం యోగి ఆదాన ప్రర్థానలలో కన్పిస్తుంది.

**ప్రాణాగ్ని విద్య:-** ప్రాణే ఆత్మాస్థితః; అపానే భూతయోనమః; వ్యానే పాతాళవాసినఃనాగాః; ఉదానేదేవతాః; సమానే పితరః.

*అపరిశిష్ఠ గౌతమసూత్రం - 217.*

**వ్యాఖ్య:-** ప్రాణసంయోగే బహువిధ నదీనగరాణి పశ్యత్యాత్మానం
అపానసంయోగే యక్షరాక్షస గంధర్వాన్ పశ్యతి
వ్యానసంయోగే పాతాళలోక వాసినాగాన్ పశ్యతి

ఉదానసంయోగే దేవలోకాన్, దేవాన్ పశ్యతి
సమానసంయోగే పితృదేవలోకాన్, పిత్రూన్, గుప్తదానానిచ పశ్యతి.

**3) పాదేంద్రియము:-** పాదమధ్యంలో సమాహితం చేస్తే శ్యామ వర్ణంతో దర్శనమిస్తుంది. అధిదేవత విష్ణువు. ఈఉపాసకుని పాద సంచారం వల్ల ఆయాప్రదేశాలు పావనమైఉంటాయి.

**4) ఉపస్థేంద్రియము:-** యోని లేదా లింగము (మర్మావయం) పై సమాహితం చేస్తే, కర్బురవర్ణం (తెలుపుమిశ్రమం) దర్శనమౌతుంది. అధిదేవత బ్రహ్మ.

**5) గుదేంద్రియం:-** గుదస్థానంలో సమాహితం చేస్తే రక్తవర్ణంతో కన్పిస్తుంది. అధిదేవత మృత్యువు.

**ఇంద్రియ విద్యావిశిష్టత :-** పైన తెల్పిన ఇంద్రియ విద్యలను సాధించినప్పుడే ఇంద్రియనిగ్రహం సాధ్యమౌతుంది. అవన్నీ తను కాదని తెల్సుకోగలం. బాహ్య, అంతరంగ వ్యవహారాలన్నింటికి ఇంద్రియాలే మూలం. కేవలం మాటలలో ఇంద్రియనిగ్రహం సాధ్యంకాదు. పూజాది కాలతో కాదు. దర్శనంతో ఇంద్రియ పరిచయం చేసుకున్న వ్యక్తి, వాటిని నిగ్రహించ గలడు. అదిలేనినాడు భ్రష్టుడైనట్లే! నేటిని కాలంలోని అశాంతికర జీవన విధానానికి, అస్తవ్యస్త పరిస్థితులకు ఇంద్రియాలే కారణము. గీతదానినే బోధిస్తుంది.

ఇంద్రియాణాం హిచరతాం యన్మనోను విధీయతే
తదస్యాహరతి ప్రజ్ఞాం వాయుర్నావమివాంభసి.

పరిగెత్తుతున్న ఇంద్రియాలను బట్టి ఎవని మనస్సు ప్రసరిస్తుందో ఆమనస్సు వాని ప్రజ్ఞను (తెలివిని), నీటిలోనున్న పడవను గాలి ఎక్కడెక్కడికో తీసుకుపోయినట్లు, తగని చోట్లకు లాగుకొని ఎత్తుకొని పోతుంది.

## 9.3. ప్రాణవిద్యలు

గ్రంధారంభంలో వివరించుకున్న సూక్ష్మశరీరాన్ని గురించిమళ్ళీ గుర్తుకు తెచ్చుకోవడం అవసరం. జ్ఞానేంద్రియాలు 5, కర్మేంద్రియాలు 5, ప్రాణములు 5 మనస్సు 1 బుద్ధి 1- మొత్తం 17 ఇవన్నీ కలిసి సూక్ష్మశరీరం మౌతుందని శాస్త్ర నిర్ణయం.

**సూక్ష్మశరీరం :- 1) బుద్ధి 2) మనస్సు.**

| **3) జ్ఞానేంద్రియాలు** | **4) కర్మేంద్రియాలు** | **5) ప్రాణములు.** |
|---|---|---|
| 1) త్వక్ (చర్మం) | 1) వాక్కు | 1) ప్రాణ |
| 2) చక్షుస్సు (కన్నులు) | 2) పాణి | 2) అపాన |
| 3) శ్రోత (చెవి) | 3) పాదము | 3) వ్యాన |
| 4) జిహ్వ(నాలుక) | 4) పాయువు | 4) ఉదాన |
| 5) ఆఘ్రాణ (ముక్కు) | 5) ఉపస్థ | 5) సమాన |

సూక్ష్మశరీరం వ్యష్టి, సమష్టి అని రెండురకాలు. ఒక్కో జీవిలో ఉండేది వ్యష్టి. మొత్తం కలిసి సమష్టి. ఇది అనేక శక్తులు కల్గి ఉన్నది. ఇంకా కొన్ని శక్తులతో (స్థూలము, అవ్యక్తము) కల్సిక్షేత్రంగా పిలువబడుతుంది. దీని విభాగాలలోని దశేంద్రియాలను గురించి తెల్సుకున్నాం. ఇప్పుడు ప్రాణ విద్యలను వివరించుకుందాం! ప్రాణములు 5. ఉపప్రాణములు - 5. ప్రాణ విద్యను ప్రాణాగ్నిహోత్రవిద్యలని పిలుస్తారు. ప్రాణములు అగ్ని తేజస్సు తో మిళితమై ఉండడమే దీనికి కారణం.

మూర్ధానమాశ్రితో వహ్నిః శరీరం పరిపాలయన్
ప్రాణో మూర్ధని చాగ్నౌచ వర్తమానో విచేష్టతే!

తా|| అగ్నిశిరస్సునాశ్రయించుకొని, శరీరాన్ని పాలిస్తుంటుంది. ప్రాణము శిరస్సులో, అగ్నిలో ఉంటూ ప్రసరిస్తూంటుంది.

**1) ప్రాణవిద్య :-** హృదయంపై సంయమం చేస్తే ప్రాణము మాణిక్య వర్ణములో కన్పిస్తుంది. నోరు, ముక్కు, ఉదరము, బొడ్డు, కాలివ్రేళ్ళు, కుండలిని క్రింది మీది భాగాలలో సంచరిస్తూ భుజింపబడిన అన్నరసాన్ని సమీకరించి, ఆయాభాగాలకు విడివిడిగా సరఫరా చేస్తుంటూంది. అంతేకాక శ్వాసక్రియను నిర్వహిస్తుంది. అధిదేవత వశిష్ఠుడు. ప్రాణవిద్యలో ఉపాసకుడు శరీర భాగాలలో ప్రాణశక్తిని సక్రమంగా సంచరించేట్లు చేయగలడు.

**ప్రాణాయామము:-** ప్రాణశక్తి ప్రసారాన్ని అన్ని అవయవాలకు అన్నినాడులకు సక్రమంగా చేర్చువిధానమే ప్రాణాయామము. కొన్ని ఉపనిషత్తులు ప్రాణాయామం సర్వరోగహారణిగా పేర్కొన్నాయి. నాడీశుద్ధి కల్గితేగాని, చిత్తము ప్రశాంతమై ఏకాగ్రం కావడానికి తగిన స్థితిని పొందలేము. కాబట్టి అష్టాంగయోగంలో "ఆసనము" నకు వెంటనే ప్రాణాయామం

చెప్పబడింది. మూడవది ప్రత్యాహారము. చెదరిపోయే చిత్తవృత్తులను మరలించడమే ప్రత్యాహారము. యోగసాధనకే కాకుండా వైదిక కర్మారంభంలో కూడా ప్రాణయామాన్ని నిర్ణయించడంలోని అంతరార్థం చిత్తప్రసన్నతకు, ఏకాగ్రతకుమూలం అదే కావడమే!.

**అధిదైవికప్రాణము:-** ఈప్రాణము సూర్యమండల రూపంలో ఉంది. కన్నులు మొదలైన అవయవాలలో ప్రసరించి చూపుమొదలైన శక్తులనిచ్చి సహాయపడుతుంది. సూర్యమండల తేజం ప్రసారం చేతనే మనశరీరం ఆరోగ్యవికాసాలను పొందుతూంది.

**2) అపాన విద్య :-** గుదస్థానాన్ని లక్ష్యంగా సమాహితంచేస్తే అపానప్రాణదర్శనమౌతుంది. ఇది ఇంద్రగోపమనే పురుగు రంగులో ఉంటుంది. ఒకరకమైన ఎరుపురంగు. ప్రాణములోపల వెలుపల కూడా సంచరిస్తుంది. నడుము, పిక్కలు, బొడ్డు, మర్మావయము, తొడలు ఉదరము, బొడ్డు గుదాగ్నిస్థానాలు. మలమూత్రవిసర్జన చేసేక్రియ నిర్వర్తిస్తుంది. అధిదేవత విశ్వకర్త. ప్రాణ, అపాన కలయికవల్లనే దేహంలో జఠరాగ్ని వృద్ధి చెందుతుంది .

అపానే జిహ్వతి ప్రాణం ప్రాణే తథాపరే
ప్రాణాపాన గతేరుధ్వా ప్రాణాయామ పరాయణాః - గీత.

**అధిదైవికాపానము:-** భూమండలరూపంతో క్రిందపడకుండా, పైకెగర కుండా ప్రమాదాలలో రక్షిస్తుంది. ఈ అపానాన్ని సక్రమస్థితిలో నుంచుకొన్న వ్యక్తి విసర్జనాక్రియలలో క్రమంగల్గి శరీరదోషములు లేకుండా చేసుకోగల్గుతాడు.

**3) సమాన విద్య:-** నాభియందు సమాహితం చేస్తే, ఆవుపాల రంగులో దర్శనమిస్తుంది. ఇది అపానంలోపల వెలుపల సంచరిస్తుంది. శరీరమంతా వ్యాపించి, అన్నాదికాలను అగ్నితో కూడా దేహమందంతట వ్యాపింపచేస్తూ, అన్ని నాడీమార్గాలలో స్వయంగా వ్యాపించి శరీరాన్ని పోషిస్తుంది. అధిదేవతాజయుడు. ఈ సమాన ప్రాణాన్ని స్వాధీనం చేసుకున్న యోగి శరీరంనుండి దేదీప్యమైన తేజస్సు ప్రసరిస్తుంది. తను కోరనప్పుడెల్లా ఈ కాంతి వెలువరించ గలడు. **సమాన జయాత్ ప్రజ్వలనమ్ విభూ.41**

**అధిదైవిక సమానము :-** ఇది అంతరిక్ష రూపంలో శరీరంలోని సమాన ప్రాణానికి సహకరిస్తూ ఉంటుంది.

**4) ఉదానప్రాణము:–** కంఠమందు సంయమం చేస్తే శ్వేత వర్ణంలో దర్శనము ఇస్తుంది సమాన ప్రాణానికి లోపల వెలుపల సంచరిస్తు దేహం పైకెగిరెందుకు మాట్లాడెందుకు సహకరిస్తుంది. అధిదేవత అజుడు

**అధిదేవకోదానం :–** ఖగోళంలోని తేజోరూపాలైన నక్షత్రాలు మెరుపులు మొదలైన వాటిలో ఉంటుంది. శరీరంలోనిఉదాన ప్రాణానికి సహాయపడ్తూ, అనుగ్రహిస్తుంది. మరణసమయంలో దేహంలోని ఉదానంతో కల్సి, జీవుడు సంకల్పించిన లోకాన్ని చేరుస్తుంది. తేలినడువ గలడు. ముళ్ళపైన, కత్తులు సూదులపైన ఏబాధలేకుండా తేలికగా నడుస్తాడు.

కంఠమందున్న ఈఉదానప్రాణము, క్రిందిభాగంలో ఉన్నవాటి నన్నింటిని తనవశములో నుంచుకొని ఉంటుంది. ఉదానాన్ని స్వాధీనం చేసుకున్న యోగి శరీరాన్ని కావల్సినంత తేలికగా మార్చుకోగలడు. ఆఖరుకు అగ్నిలో నడిచినా అది కాల్చలేదు. ఇచ్ఛామరణం కూడా సిద్ధిస్తుంది.

**ఉదానజయాత్ జలపంకకంటకారిష్వంగ ఉత్క్రాంతిశ్చ**

**5) వ్యానప్రాణము:–** సర్వాంగములపై సమాహితం చేస్తే జ్వాలల వంటి కాంతితో దర్శనమిస్తుంది. ఇది ఉదానంలోపల, వెలుపల సంచరిస్తుంది చెవులు, కన్నులు, నడుము, మడమలు, నాసిక, గొంతు, పిఱుదులు మున్నగు అవయువాలలో సంచరిస్తుంది. తీసివేయుడు, తీసి కోవడం, ఊప్పులు మూాయడం వంటి క్రియలకు కారణమిదే! అధిదేవత. విశ్వయోని.

**అధిదైవిక వ్యానము :–** బాహ్య వాయువు రూపంగా ఉంది. శారీర వ్యానాన్ని అనుగ్రహిస్తూ ఆయా శరీరక్రియలకు సహాయపడుతుంది.

**ఉపప్రాణములు** ఇవి కూడా ఐదు. 1) నాగము 2) కూర్మము 3) కృకరము 4) దేవదత్తము 5) ధనుంజయము.

**1) నాగము:-** పీతవర్ణంతో రోమముల నాడులందుండి నాడీ సంచలనం కల్గిస్తుంది. **2) కూర్మము :-** శ్వేతవర్ణంతో పొట్టలో, నుదురులో, ఉంటుంది. ముఖం వికసించేందుకు, ముడుచుకొనేందుకు ఉపయోగపడుతుంది. **3) కృకరము :-** కాటుకరంగులో నాసాగ్ర మందుంటుంది. తుమ్మును కల్గిస్తుంది. **4) దేవదత్తము :-** స్ఫటిక వర్ణంలో నడుమునందుంటుంది. ఒళ్ళు విరుచుకోవడానికి సాయపడుతుంది. **5) ధనుంజయము:-** నీలవర్ణం కళ్ళ, బ్రహ్మ రంధ్రంలో, చెవులల్లో ఉంటుంది.

ఈ ఉపప్రాణముల దర్శనం కూడా ఆయాస్థానాలలో సంయమం చేసి దర్శించవచ్చు. ఇంతటితో ప్రాణవిద్యలు ముగిసినాయి.

## 9.3. దహరవిద్య

ఆధ్యాత్మిక విద్యలు 1) శ్రౌతవిద్యలు 2) తంత్రవిద్యలు అని రెండు రకాలు. శ్రీచక్రవము, షట్చక్రవిద్యలు, తాంత్రికవిద్యలైనప్పటికి మహోనీయులు పరమార్థసాధనానికి వాటిని శ్రౌత విద్యలవలెనే స్వీకరింపవలెనని నిర్ణయించినారు. దహర విద్య శ్రౌత విద్యలలో చేరినదే!

మనోవృత్తులు ఒక్కొక్క సమయంలో ఒక్కొక్క విధంగా ఉండి వాటి ప్రభావానికి లోనై ప్రాణులన్నీ ముఖ్యంగా మనజుడు, ప్రవర్తిస్తున్నాడు. దుష్టకామం, క్రోధం, ఈర్ష్య, అసూయ, స్వార్థం, అమిత ధనకాంక్ష వంటి దుర్లక్షణాలు కల్గుతుంటాయి. ఒక్కోసారి ఒక్కొక్క దానిపై మనోవృత్తి ప్రసరిస్తుంటుంది. ఈవృత్తులను నియంత్రించి సల్లక్షణాలను పెంచుకొనేందుకుపకరించేదే దహరవిద్య. జాగ్రదావస్థలోని ఈ స్థితులే కాకుండా, స్వప్న, నిద్రావస్థలలోని మనోవృత్తులను కూడా దహరవిద్య ద్వారా నియంత్రిస్తాడు యోగి.

**విద్యాక్రమం :-** అనాహతచక్రంలో బంగారుకాంతులు విరజిమ్ముతూ ఒక బాణలింగముంది. దానిపై సంయమంచేస్తే ఆలింగం క్రింద ఆధారంగా నిశ్చలమైన దీపకళిక వంటి ఆకారంలో, హంసరూపిగా జీవాత్మ ప్రకాశిస్తున్నాడు. అనాహత కమలకర్ణిక యొక్క క్రింది ప్రదేశంలో ఎనిమిది రంగులతో ప్రకాశిస్తున్న అష్టదళపద్మం ఊర్ధ్వముఖంగా దర్శన మౌతుంది. ఈ ఎనిమిది దళాలలో జీవాత్మ సంచరిస్తుంటుంది. సంచారక్రమ మిట్లుంటుంది.

1) తూర్పుదిక్కునున్న దళము తెల్లని రంగు తో ప్రకాశిస్తుంటుంది. జీవాత్మ ఈదళంలో సంచరించేటప్పుడు భక్తి పురస్సరమైన ధర్మకర్మ లాచరించాలనే బుద్ధిపుడుతుంది.

2) ఆగ్నేయ దిక్కున రక్తవర్ణంలోనున్న దళంలో జీవాత్మసంచారం చేసేటప్పుడు నిద్ర, అలసత్వము(సోమరితనం)ఏ పనీ చేయలేని స్థితి కల్గుతుంది.

3) దక్షిణదిక్కున నల్లనిరంగులో ఉన్న దళంలో జీవాత్మ సంచరించేటప్పుడు ద్వేషము, కోపము మొదలైన వికారాలు కల్గుతాయి.

4) నైఋతిదిక్కున ఉన్న నీలంరంగు దళంలో జీవసంచారం వల్ల పాపకార్యాసక్తి, పరహింసా బుద్ధి కల్గుతుంది.

5) పశ్చిమ దిక్కునున్న స్ఫటికవర్ణదళంలో జీవసంచారం వల్ల వినోద విహారక్రీడలపై మనోవృత్తి ప్రసరిస్తుంది.

6) వాయవ్యదిక్కునున్న మాణిక్య వర్ణ దళంలో జీవసంచారంవలన చాంచల్యము, తొందరపాటు, కొంతవైరాగ్యం (నిరాశ) వంటి లక్షణాలు కల్గుతాయి.

7) ఉత్తరదిశలోనున్న పచ్చని రంగు దళంలో జీవసంచారంవల్ల ఐహికసుఖాసక్తి, శృంగారభావాలు విజృంభిస్తాయి.

8) ఈశాన్య దిక్కునున్న వైడూర్యవర్ణదళంలో జీవచారంవల్ల దానము, భూతదయ, సంఘసేవ వంటి ఉత్తమభావాలు కల్గుతాయి.

9) దళముల సంధిలో (మధ్యభాగంలో) హంససంచరించునప్పుడు వాత, పిత్త, శ్లేష్మముల ప్రకోపము, వాటి వ్యత్యాసాలవల్ల మహావ్యాధి పీడ సంభవిస్తుంది.

10) కమలకర్ణికపై హంస సంచరించే టప్పుడు అన్నీ తెల్సినస్థితి కల్గుతుంది. నృత్యగానాలనొనరుస్తూ మధురోపన్యాసాలవల్ల ఆనందానుభూతి పొందాలనే భావన కల్గుతుంది. ఇక్కడే కల్పవృక్షం, కామధేను, చింతామణి, మొదలైన దర్శనాలు కల్గుతాయి. ఇంతవరకు జరిగిన వృత్తులన్నీ జాగ్రదవస్థలోనివే!

11) జాగ్రదవస్థలో వ్యవహారశ్రమ కల్గునప్పుడు హంస అష్టదళ కమల కర్ణికలోని మొదటి వలయంలో ప్రవేశిస్తుంది. ఇది బందూకవర్ణంలో ఉంటుంది. దీని ప్రభావంతోనే స్వప్నాలు కల్గుతాయి.

12) ఆస్వప్నస్థితిలో ఎప్పుడు శ్రమకల్గుతుందో అప్పుడు హంస ఇంద్ర దీప పురుగు వర్ణం కల్గిన రెండవ వలయంలో ప్రవేశిస్తుంది. ఇదే సుప్తావస్థ (నిద్ర).

13) కర్ణికమూడవవలయం పద్మరాగవర్ణంలో ఉంటుంది. దీనిలో హంస (జీవాత్మ) ప్రవేశించినప్పుడే బ్రహ్మానందం పొందుతాడు. దీన్నే **తురీయావస్థ** అంటారు.

విద్యాప్రభావము:- ఈదహరవిద్య మహాప్రభావవంతమైనది. దీన్ని అభ్యసించేవారు దుర్జనత్వం విడిచి సజ్జనులౌతారు. సజ్జనులు మహాపురుషులౌతారు. పైన తెల్పిన స్థానాలలో లోకకళ్యాణ కరమైన స్థితుల

కల్గిన దశను అందే తన బుద్ధి వృత్తిని చేర్చి ఉండడం వల్ల, మహా మహిమాన్వితుడై ఉండగలడు. దుర్జనులను సజ్జనులుగా మార్చగలడు. ఈవిద్యా ప్రభావాన్ని వివేకానందస్వామి ఈవిధంగా వివరిస్తాడు.

"యోగ్యుడవగుము! యోగ్యుడవగుము! యోగ్యుడవగుము అని ప్రపంచమంతటను బోధనలు వినవచ్చుచున్నవి. దొంగలింపవలదు! అసత్యమాడవలదు! అనుహితోపదేశములను ప్రపంచమందలి బిడ్డలందరును పొందుచునేయున్నారు. ఇట్టి ఉపదేశములు నిష్ప్రయోజనములు.

దొంగలింపరాదనుటకు హేతువేమి? దొంగలింపకుండుటనునది ఎట్లు సాధ్యమగునో మనము బాలురకు చెప్పక దొంగలింపకుమని మాత్రమే ఉపదేశించుచుందుము. బాహ్యాంతర వ్యాపారములన్నియు, మనస్సు ఇంద్రియములతో సంయోగముందినచో గల్గుచున్నవి. ఇచ్ఛాపూర్వకముగా గాని, అనిచ్ఛాపూర్వకముగా గాని మనస్సు ప్రియములచే ఆకర్షింపబడి, వానితో సంయోగము పొందుచుండును. జనులు తెలివిమాలిన పనులు చేయుచు దుఃఖించుచుండుటకిదియే కారణము. మనస్సు వారికధీనమైయున్ననాడు వారిట్లు వర్తింపరుకదా! మనోనిగ్రహము వల్ల గల్గు ఫలమేమి? మనస్సు ఇంద్రియములచే సంయోగము పొందకుండుటచే కామరాగములు మన అధీనములై యుండును. ఇంతవరకు స్పష్టముగానున్నది. ఇకనిది సాధ్యమాయనిన సంపూర్ణముగా సాధ్యమే!" - రాజయోగము.

వివేకానందులవారి పైమాటలలోని పరిపూర్ణముగా సాధ్యమే అనే అంశాన్ని ఋజువు పరచేందుకే క్రమప్రణాళికను శ్రీగురువులు శివసచ్చిదానంద సరస్వతీ స్వామివారు ఆధ్యాత్మదర్శన-అభ్యాసయోగాన్ని ఏర్పరిచినారు. తరగతులవారీగా సాధన చేయడం ఎంతో సుకరమని శాస్త్రీయమని మనం వివేచించి తెల్సుకోవచ్చు!

## 9.4. బృహజ్జ్యోతిర్విద్య

స్థూలశరీరాన్నే తనుగా భావిస్తాడు మానవుడు. అదే నిశ్చయం చేసుకొని వ్యవహరిస్తుంటాడు. కాని పరమగమ్యమైన సచ్చిదానందమైన పూర్ణఅద్వైత సిద్ధికి పరమసాధనం ఈశరీరం తానుకాదని తెల్సుకోవడం. స్థూలశరీరమే తాను అనిఎట్లైతే స్థిరబుద్ధి కల్గిఉన్నాడో, అట్లేజ్యోతిర్మయమైన సూక్ష్మశరీరమే తాను అనే స్థిరబుద్ధిపొందేందుకు ఈబృహజ్జ్యోతిర్విద్య ఉద్దేశింపబడినట్లు యోగాచార్యుల నిర్ణయం. స్థూలవ్యష్టి, సమష్టి శరీరాలకు కారణం సూక్ష్మవ్యష్టి

సమష్టి శరీరాలే. తనవ్యష్టి సూక్ష్మశరీరాన్నంతా కలిపి ఒకేసారి చూసేందుకు ఏర్పరచబడినదే బృహజ్జ్యోతిర్విద్య. స్థూలశరీర, ప్రపంచాలు వైవిధ్యంగా భిన్నంగా ఉన్నాయి. అట్లుండడమే దాని స్వభావం. దాన్ని సమంగా దర్శించడం సాధ్యంకాదు. కేవలం మాటలల్లో సర్వసమత్వభావన వల్లించడంవరకే కాని, ఆచరణ సాధ్యంకాదు.

**"విద్యావినయసంపన్నే, బ్రాహ్మణే, గవి, హస్తిని,**
**శునిచైవ శ్వపాకేచ పండితాస్సమదర్శినః"** - గీత.

తా || విద్యావినయ సంపన్నుడైన బ్రాహ్మణుని, గోవును, ఏనుగును, కుక్కను, కుక్కమాంసము తినే ఛండాలుని పండితులు సమానంగా చూస్తారు.

వివిధ రకాలైన దేహాలను, వివిధరకాల స్వభావాలను సమానంగా చూడడం జ్ఞానులకే సాధ్యం. వారికి భేదదృష్టిలేదు. "సమదర్శినః" అన్నారే కాని, "సమవర్తినః" అనలేదు. భేదము లేకుండా ప్రవర్తించరు అనిచెప్పలేదు. కారణం భేదము లేని ప్రవర్తన స్థూలవ్యవహారములో అసాధ్యం. పశుపక్ష్యాది జాతి భేదములు, స్త్రీ పురుష, స్థావరజంగమాది భేదములను ఏవిధంగా పరిహరిస్తాం? ఈ భేదాలు ప్రకృతి సిద్ధములు. వీటికి కారణమైన సూక్ష్మ దేహము మాత్రము ఏభేదము లేకుండా అంతా ఒకేరకమైన తేజోరూపంగా ఉంది. ఏవస్తువును చూచినా, వ్యక్తిని చూచినా, పశుపక్ష్యాదు లను చూచినా, ఒకేరకమైన తేజోరూపమే దర్శనమిస్తుంది. అదే సూక్ష్మ ప్రపంచం. **"సమదర్శనం" అంటే ఇదే! ఇదే యోగసాధన లక్ష్యం. యోగానికి పరాకాష్ఠ. అఖండాత్మదర్శనానికి కూడా ఈ విధానమే మొదటి సోపానము. ఇదే శాస్త్రీయము. సహేతుకము.**

శ్లో || సర్వభూత స్థమాత్మానం సర్వభూతాని చాత్మని
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్రసమదర్శినః!!

తా|| యోగముతో కూడిన ఆత్మ (మనస్సు) కలవాడు, మహాసీయుడు సర్వభూతములందున్న తనను, తనయందు సర్వభూతాలను చూస్తున్నాడు. అంతటా సమదృష్టి కలవాడౌతున్నాడు.

ఇది సూక్ష్మప్రపంచ దర్శనముతోనే సాధ్యం. దీనిని దర్శించేందు కుపదేశించ బడినదే బృహ జ్జ్యోతిర్విద్య అనేకంలో ఏకత్వం, భేదంలో అభేదం చూడడమే విశ్వజనీనమైన మహోపదేశం. ఆమూపుగ్గేది సూక్ష్మ ప్రపంచ

దర్శనంతోనే సాధ్యం. ఆధ్యాత్మదర్శన ప్రణాళికననుసరించి క్రమంగా అభ్యాసం చేసి, ఆస్థితిని పొందిననాడే లోకకళ్యాణాన్ని సమకూర్చగలడు.

**విద్యాక్రమం:**-సాధకుడు తన(స్థూల) దేహాన్ని లక్ష్యంగా దేహపరిమితి మీద సామాన్యవృత్తితో ఉపాసిస్తే, దేహమంతా జ్యోతిర్మయంగా కన్పిస్తుంది. శరీరంలోని ఏభాగము కూడా వృత్తికి తోచవు. (కన్పడవు) అవయవాలున్నట్లు కూడా తోచదు. శరీరమంటే తేజోమయమైన సూక్ష్మశరీరమే అనే భావం స్థిరపడుతుంది. అప్పటివరకు సాధన చేయాల్సిందే!

దానితర్వాత తనకంటిచూపు ఎంతవరకు ప్రసరిస్తుందో ఆపరిధిలోని ఏవస్తువునైనా (చెట్లు, భవనాలు మొ.) లక్ష్యంగా చేసుకొని ఏకాగ్రం చేస్తే అది జ్యోతిర్మయంగా కన్పిస్తుంది. ఆప్రదేశంలోని ఏదీ స్థూలరూపంగా కన్పించవు.

ఆపైన ఒక ప్రాంతాన్నంతా లక్ష్యంగా చేసుకొని (కేంద్రంగా) ఉపాసిస్తే ఆప్రాంతమంతా జ్యోతిర్మయమైపోతుంది. ఆమనోభావనాస్థలంలో ఉండే ఏవస్తువుకూడా కన్పించదు. ఇదే బృహజ్జ్యోతిర్విద్య. దీన్ని మూడంచెలుగా అభ్యాసం చేయవల్సి ఉంది. ఈవిద్యాసాధన గాఢంగా చేసిన సాధకుడు, తాను, మిగిలిన ప్రపంచమంతా తేజోమయమై ఉందని తెలుసుకోగలడు. గాఢానుభవం పొందుతాడు. ఇట్టి స్థితిని వినడమే, ఊహించడమే ఎంతో ఆశ్చర్యజనకంగా ఉంది. ఈస్థితి పొందిన యోగి మాత్రమే భగవద్గీతలో చెప్పబడిన "సమదర్శి" కాగలడు. అభేదదృష్టి ఈస్థితిలోనే సాధ్యం. ఇదే స్థూల ప్రపంచం. స్థూలభౌతిక ప్రపంచానికి కారణమదే!

బృహజ్జ్యోతిర్విద్యనుపాసించే శిష్యులు కొందరు శ్రీగురువుల వద్దనుండినారు. డాక్టరు జయంతి కామేశ్వరరావు (ప్రొఫెసర్ నిజాం కాలేజ్) వంటివారు ముఖ్యులు. ఈవిద్యలో అనుభవం పొందినవారికే శ్రీగురువులు లోకవిద్యనుపదేశించేవారు. ఇతరలోకాలను ప్రవేశించిన సాధకుడు ఆలోకమర్యాదకు భంగం కల్గించకుండా, ఆలోకవాసులకు కోపం తెప్పించకుండా ప్రవర్తించాల్సిఉంటుంది. లేకుంటే ఎన్నోచిక్కులెదుర్కో-వలసి ఉంటుంది. అట్టి పరిస్థితులలో తప్పించుకొని తిరిగి వచ్చేందుకు ఈ బృహజ్జ్యోతిర్విద్య ఉపకరిస్తుంది. దీన్ని మహాస్త్రంగా ఉపయోగించు కోవచ్చని చెప్తూ, ఇతరవిద్యలోక విద్యాలక్ష్యాలను శ్రీ గురువు లొసగేవారు.

ఈ సందర్భంలో ఒకసాధకునికి జరిగిన అనుభవాన్ని తెల్సుకోవచ్చు.

శ్రీగణపతి భట్టుగారు వాయులోకవిద్యనుగ్రహించి, ఆప్రభావంతో వాయులోకంలో సంచరిస్తూ ఒకగుహలోనికి ప్రవేశించినారు. అక్కడ ఒక ఋషి పుంగవుడు కన్పించినాడు. గురుపుత్రుడని ఆదరించినాడు. వారిద్దరిమధ్యన జరిగిన సంభాషణయిట్లుంది.

**గణపతిభట్టు:**- స్వామీ! ఈలోకాలన్నీ మిథ్యగదా!

**ఋషి:**- నాయనా! నీవెట్లు మిథ్య అంటున్నావు?

**గణపతి:**- బ్రహ్మసత్యం జగన్మిథ్యా అని సిద్ధాంతం చేసినారుగదా!

**ఋషి:**- సరే! అదంతా నీకు అర్థమై అనుభవానికి వచ్చిందా!

**గణపతి:**- పెద్దలు చెప్పునప్పుడు విన్నాను!

**ఋషి:**- అర్హత లేని స్థితిలో పైస్థాయి మాటలనుపయోగిం[illegible]. సరేలే! చూస్తాం!

అని ఋషి పల్కుతుంటూనే అక్కడనల్గురు దివ్యసౌందర్యవతులు యువతులు ప్రత్యక్షమైనారు. ఆఋషి వారితో "ఆ బ్రహ్మచారిని పట్టుకొమ్మని" వారినాజ్ఞాపించినాడు. వారు అతనిని చుట్టుముట్టుమంటే గణపతి తత్తరపాటుతో "నేను బ్రహ్మచారిని! నావద్దకు రావద్ద" ని కేకలు వేస్తూ పరిగెత్త సాగినాడు. ఋషి యువతులను "విడువవద్దు! పట్టుకోండి" అని హెచ్చరించి నాడు. గణపతి గగ్గోలు పడుతూ వెంటనే శ్రీగురువులను స్మరించి, బృహజ్జ్యోతిర్విద్య సాయంతో ఆగుహమీదలక్ష్యంచేసిన వెంటనే ఋషి, యువతులు జ్యోతిర్మయముగా మారినారు. గణపతిభట్టు వెంటనే బయటపడి తిరిగిరాగల్గినాడు. సద్గురు కటాక్షమునకింతకంటే వేరే దృష్టాంతం ఇంకేముంది?

**అధ్యాత్మదర్శన అభ్యాసయోగమ్**
**సర్వమ్ సంపూర్ణమ్**

---

**జ్యోతీరూప ప్రకాశస్స జయతు భగవాన్ శ్రీనివాసాఖ్యదేవః**



శ్రీ శ్రీ శ్రీ శివ సచ్చిదానంద స్వామినే నమః!

శ్రీ గురు శ్శరణం మమ!

సర్వం శ్రీ బ్రహ్మార్పణమస్తు!

ఓం తత్సత్!





శ్రీగురువులు శిష్యులతో

(1942)